




# వేదములు

విచారణ

# మహాభారతంలో విద్యావిధానము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి

గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మహాభారతంలో విద్యావిధానం

డా॥ ఆర్. మల్లేశముర్తి

బి. ఏ. (యస్‌సిఐ); యం. ఏ; యం. ఇడి; పిహెచ్. డి;

ఆంధ్రోపన్యాసకులు,

ప్రభుత్వ కళాశాల, చిత్తూరు.

1986 సం॥ శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారి

పిహెచ్. డి. పట్టంపొందిన సిద్ధాంత వ్యాసం.

తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థిక సహాయంచే ప్రచురింపబడినది.

# అనుమోదం

1. చిరంజీవి ఆర్. మల్లేశుడు నాకు చిరకాల విద్యార్థి. అప్పుడేగాదు. ఇప్పటికీ అతడు విద్యార్థిననే భావిస్తుంటాడు. ఉమర్ ఖయ్యాముఁలాంటి వాడే అన్నాడు ఎప్పటికీ నేను విద్యార్థినే అని. మానవుడింకా తెలుకో వలసిన దున్నంతవరకూ విద్యార్థి గాక మరేమవుతాడు. అంతా తెలిసిన వాడెవ్వడూ లేడు కాబట్టి సృష్టిలో ప్రతి ఒక్కడూ విద్యార్థే. విద్యనర్థించే వాడేగదా విద్యార్థి అంటే. ఈ విద్య అనేది ఒకటిగాదు. ఒక మేరగాదు. ఒక్కమాటలో చెబితే విచిత్రమూ Varied అనంతమూ Infinite. కాబట్టి జిజ్ఞాస అనేది ఉండవలెనే గాని అది జీవితాంతమూ కృషి చేయవలసిన క్షేత్రమే.

2. చిరంజీవి మల్లేశు డిలాంటి నిరంతర జిజ్ఞాసాశీలుడు. చదివినది జీవశాస్త్రమైనా భాషమీదా సాహిత్యంమీదా మమకార మెక్కువ. శాస్త్ర విజ్ఞానాన్ని సాహిత్యంతో మేళవించుకొంటూ వచ్చాడు. సాహిత్యంలోకూడా బహుముఖంగా పరిశ్రమించాడు. వేద పురాణాదుల దగ్గరినుంచీ మన్వాది ధర్మశాస్త్రాల దగ్గరనుంచీ కావ్యనాటకాదులదాకా ప్రతి ఒక్క సాహిత్య శాఖనూ పట్టిచూడాలనే ఉత్కంఠ ఎంతో ఉన్నవాడు. పైగా ప్రతిదానిలో దాగి ఉన్న అంతరార్థమేమిటో దానికీ మరొక దానికీ ఉన్న సంబంధమేమిటో ఎప్పుడూ అన్వేషిస్తూ ఉంటాడు. పరస్పర భిన్నంగాతోచే వాఙ్మయ శాఖలన్నింటికీగల మహాసమన్వయాన్నికూడా మననంచేసి పట్టుకోవాలనే తహతహ ఎక్కువగా ఉన్నవాడతడు. ఒక ప్రామాణికమైన క్రొత్త విషయాన్ని బయటపెట్టాలంటే ఇలాంటి మననశీలత ఎంతైనా అవసరం.

3. మొదటినుంచీ తన్ను వెంటాడుతూవచ్చిన ఈ మననశీలతకు ఫల శ్రుతిగానే మల్లేశుడీ సిద్ధాంత వ్యాసాన్ని సరిక్రొత్తగా ప్రస్తుతం మన తెలుగు పాఠక లోకానికందివ్వగలిగాడు. సాధారణంగా సిద్ధాంత వ్యాసాలనేవి డాక్టరు పట్టా పొందాలని ముందుగా ఉబలాటపడి తరువాత ఏదో లాంఛనార్థంగా రూపొందించేవి. ఇది అలాకాదు. ముందుగానే రూపొందితే తరువాత యాదృచ్ఛికంగా పట్టా లభించిన గ్రంథం. అంటే పట్టాకోసం ప్రయత్నించిందికాదు. ప్రయత్నఫలంగా లభించింది పట్టా. ఇలాంటి ఘట్టాలు పరిశోధనా రంగంలో మనదృష్టికి చాలా అరుదుగా కనిపిస్తాయి.

మెప్పటికి. ఎవరు దీనికికర్త అనేవి దేశకాల కర్తృత్వాలకు సంబంధించిన సంగతులు లోతుకుదిగి వాటన్నిటినీ వివరిస్తూ పోవలసిన అవశ్యకత ఈ సిద్ధాంత వ్యాసానికిలేదు. భారతంలో విద్యా స్వరూపాన్ని బయటపెట్టే ముందు అసలు విద్య అంటే ఏమిటో మానవ జీవితానికి దాని అపేక్ష ఏమిటో పరామర్శించడం సమంజసం. అలాగే పరామర్శచేసి చూపాడీ సిద్ధాంతకర్త. అయితే విద్యానిర్వచనాలటు పూర్వమూ—ఇటు ఆధునికమూ అనేకులనేకంగా చెప్పారుగదా—అవన్నీ ప్రాచీన భారత విద్యకెలా అన్వయిస్తాయి. బలవంతగా అన్వయిస్తే అది ఏమిబాగు—అని ఒక ఆశంక రావచ్చు. ఇక్కడే ఉంది ఒక చారిత్రక రహస్యం. చరిత్ర ఎప్పుడూ ఆవృత్తమవుతూ ఉంటుంది. మానవజాతి ఎప్పుడూ అన్వేషణాశీలమే. విజ్ఞానమెప్పుడూ సార్వకాలికమే. మహా అయితే దేశకాలాలను బట్టి అలతి అలతి మార్పులతో ఉండవచ్చు. మూలసూత్రాలెక్కడా ఎప్పుడూ ఒక్కటే. ఈ విశ్వనాడీరహస్యం కనుగొన్నామంటే విచారణా దక్షుడైనవాడికెందులో ఏదైనా గోచరించవచ్చు. అయితే ఔచిత్యమెరిగి ముందు వెనుకలు చక్కగా సమన్వయించుకోగలిగి ఉండాలి. ప్రస్తుత సిద్ధాంతి ఇలాంటి సమన్వయ నైపుణ్యమెంత ఉండాలో అంతగా ఉన్నవాడు. అడుగడుగునా అది ఈ గ్రంథంలో తార్కాణమవుతుంది మనకు.

7. సిద్ధాంతి తన ఈ సిద్ధాంత గ్రంథాన్ని ఆరు ప్రకరణాలుగా విభజించాడు. ఒకటి విద్య—దాని స్వరూపం. రెండు శ్రుతిస్మృతులలో విద్యా విధానం. మూడు మహాభారతంలో విద్యా విధానం. నాలుగు భారతంలో గురుశిష్య సంబంధం. అయిదు భారతంలో బోధన పద్ధతులూ ఆరు భారతంలో విద్యా సంస్కారాదులు. ఈ ప్రకరణ విభాగమెంతో సముచితంగా, సమగ్రంగా భాసిస్తూ ఉంది. ఆరింటిలో మధ్య నాలుగూ మహాభారతానికి సంబంధించినవే. పోతే ఆద్యంతాలు రెండూ దానికొకటి ముఖబంధమయితే-మరొకటి అనుబంధం. రెండంచులకూ నడుమనున్న ఆ నాలుగంశాలుకూడా ఒకదానికొకటి పూర్వోత్తర భూమికలలాగాకన్పిస్తాయి. విద్య అనగానే చెప్పేవాడు వినేవాడూ ఉండాలి. వారే గురు శిష్యులు. వారెప్పుడున్నారో ఇద్దరినీ కలిపే సంబంధమొకటి కావాలి. అదే బోధన. అలాగే బోధన సమాప్తమైన తరువాత దాని పర్యవసానమేదో చెప్పాలి. అవే

సమావర్తనాదులు. ఇలా ఒక హేతు హేతుమద్భావంతో నడిచిందీ సిద్ధాంత గ్రంథ రచన అంతా.

8. అంతేగాదు ప్రకరణార్థ వివేచనలో-విచారణలో-పాడిన పాటగా గాక ఒక నూతనమైన సృష్టి-ఉపజ్ఞా సాక్షాత్కరిస్తాయి ఈ గ్రంథ రచనలో. మరి వేదయుగంలో బోధన పద్ధతులంటూ ఉపాఖ్యానమనీ-సంవాదమనీ- ఆలంకారికమనీ చర్చా-గోష్ఠులనీ- ఇలా విభజించి చెప్పటం చక్కని విమర్శనా దృష్టికి నిదర్శనం. అలాగే భారతకాలంలో బద్ధ విద్యలూ-అని బద్ధ విద్యలని రెండుగా విభజించటమూ. వివిధ విద్యలలో వర్ణవిద్యలూ-స్త్రీ బాల ప్రయోజన విద్యలూ పశు వృక్ష - సైనిక వ్యాయామాది విద్యలూ-ఇలా ఎన్నో విశేష విద్యలన్నీ నిరూపణ చేయటం ఎంతో అపూర్వంగా సాగింది. తరువాత భారత పాత్రలలో కృపద్రోణ భీష్మాదుల ఒక్కొక్కరి విద్యాభ్యాస విశేషాలనూ తడవి చూపటం కర్త నిశిత పరిశీలనను నిరూపిస్తుంది. అంతకన్నా సునిశితమైన పరిశీలన అప్పటి బోధనాపద్ధతులను ప్రదర్శించటంలో మనకు నిదర్శితమవుతుంది. పంచావయవ వ్యాస సమాస- సమష్టివ్యష్టి నిగమన అనుగమన ఇలాంటి శాస్త్రీయమార్గాలూ-ప్రయోగ ప్రరోచనాది విధానాలూ-ఎన్నో సవిస్తరంగా చర్చించబడ్డాయి. ప్రతి ఒక్క నిరూపణలోనూ ఎంత సోప పత్తికంగా సాగిందో అంత సోదాహరణంగాకూడా సాగింది రచన. ఉదాహరణలు శ్రుతిస్మృతుల దగ్గరినుంచీ పురాణేతిహాసాలవరకూ-ఇంకా అవసరమైన ఇతర గ్రంథాలవరకూ-ఎన్నో ప్రాచీన నవీన గ్రంథాలనుంచి కుప్పతెప్పలుగా ఇస్తూవచ్చాడు సిద్ధాంతి. అయితే ప్రతి ఒక్క దానికీ మాతృకను పేర్కొనే నియమం అంతగా పెట్టుకొన్నట్టు కనిపించదు. పెట్టుకో బనిలేదుకూడా. మల్లినాథసూరి చెప్పినట్టు ఏదీ అమూలంగా వ్రాయనన్న మాత్రాన అపేక్షిత మైనా కాకున్నా వ్రాయనక్కరలేదు. అది విషయ వేదన అలా ఉంచి శిరోవేదన మాత్రం తప్పకుండా ప్రసాదిస్తుంది. గ్రంథానికేగాని దానివల్ల గ్రంథార్థాని కంతగా గౌరవం రాబోదు.

9. ఇంతకూ ఈ పరిశోధనా వ్యాసమెంతో సమగ్రమైన పరిశోధనా ఫలితమే. ఎన్నో క్రొత్తవిషయాలు ఎంతో క్రొత్తగా ఆలోచించి చెప్పినవే. రోకటి పాటగా ఏదీ జరగలేదు. దానికి తగిన సామగ్రీ-దానిని సేకరించే

పరిశ్రమా—చాలా కాలంనుంచీ సాగిస్తూవచ్చాడీరచయిత. ఇంటర్, బిఏ లలో చదివిన జీవరసాయనాదిశాస్త్ర జ్ఞానమూ—ఎమ్. ఏ లో చదివిన భాషా సాహిత్య విజ్ఞానమూ రెంటినీ చక్కగా మేళవించుకొన్నాడితడు. పైగా కొన్ని ఏండ్లనుంచి నాబోటి వారితో సాహచర్యం మూలాన మత వేదాంత విజ్ఞానం కూడా సంక్రమించింది. వీటి సంస్కారబలంతో వాటిని మథించేసరి కొక సరికొత్త బాణీ స్ఫురించిందితనికి పరిశోధనా రంగంలో. దాని ఫలమే ఈ ప్రస్తుత సిద్ధాంత వ్యాస నిర్మాణం.

10. అయితే నూటికి నూరుపాళ్లూ గుణవంతమైన నిర్మాణమేదీలేదు సృష్టిలో. "ప్రాయేణ సామగ్ర్య విధౌ" అని మహాకవే వాపోయాడు. ఇంకా కొంతపరిశోధించి ఇంకాకొన్నిక్రొత్తవిషయాలు వ్రాసుచ్చు ఉండవచ్చు. శ్రుతి స్మృతీతిహాస ప్రపంచంనుంచి ఇంకామరుగునున్న రహస్యాలెన్నో బయటకి లాగి ఉండవచ్చు. ఆధునిక విద్యా సూత్రాలనెన్నింటినో ప్రాచీన కాలాని కన్వయించి వ్యాఖ్యానం చేయటం ఎంతో అపూర్వంగా నిర్వహించటం చాలా ప్రశంసనీయం. అదికూడ ఆధ్యాత్మిక దీప్తిలో దర్శించి సమన్వయించటం ఇంకా శ్లాఘనీయం. అయితే దానినింకా సమగ్రంగా దర్శించిన మన్వయించ వలసి ఉంది. పోతే రచనా—శైలీ ఇంకా కొంత ఆలంకారికంగా-పరనీయంగా సాగి ఉంటే సువర్ణానికి పరిమళంలాగా భాసించేది. మరి పరిశోధన అంటే అది నిత్య ప్రవహణ శీలం. క్రమక్రమ వికాస భాసురం. చరమదశా పరిపాకదాయకం. అది కాలానికే వదిలేసి సహృదయులీ తరుణ పరిశోధకుని పరిశోధనా సరణి పరిశీలింతురుగాక. పరిశీలించి పరితోషింతురుగాక.

బ్రహ్మశ్రీ యుల్లంరాజు శ్రీనివాసరావు
రిటైర్డ్ ఆంధ్రోపన్యాసకులు
ప్రొద్దుటూరు.

# కృతజ్ఞతానివేదనం

'మహాభారతంలో విద్యావిధానం' అనే అంశాన్ని పరిశోధన విషయంగా ధ్రువీకరించి నాసిద్ధాంత వ్యాసరచనలో తులలేని సూచనలుచేసి నన్ను ప్రోత్సహించిన సహృదయులు ఆచార్య జి. యస్. రెడ్డిగారికీ, పర్యవేక్షకులుగా వ్యవహరించి నా సిద్ధాంత వ్యాసాన్ని పరిశీలించి సవరించిన సహృదయులు ఆచార్య జి. నాగయ్య గారికీ, సిద్ధాంత వ్యాసరచనలో మొదటినుండి చివరిదాకా నాకు కలిగిన సందేహాలను అడుగడుగునా తీర్చి దీని నడకను దిద్దడమేగాక అడిగిన వెంటనే 'అను మోదం' వ్రాసి యిచ్చిన గురువర్యులు బ్రహ్మశ్రీ ఎల్లంరాజు శ్రీనివాసరావుగారికీ, ఈ గ్రంథ రచనలో నే నేయే రచయితల భావాలను స్వీకరించానో వారికీ, నా పరిశోధన కృషిలో సహకరించిన పెద్దలకూ, మిత్రులకూ పరిశోధన. కనుమతించిన విశ్వవిద్యాలయాధి కారులకూ. గ్రంథాన్ని, అచ్చువేయుట కనుమతించిన విశ్వవిద్యాలయాధికారులకూ, గ్రంథ ప్రచురణ కార్థిక సహాయంఅందజేసిన తెలుగు విశ్వవిద్యాలయం వారికీ, ఈ గ్రంథాన్ని ముద్రించి యిచ్చిన ప్రొద్దుటూరు గాయత్రి ప్రింటర్స్ వారికీ

నా కృతజ్ఞతలు

**ఆర్. మల్లేశుడు**

# ప్రస్తావన

ప్రాచీనాంధ్ర సాహిత్య పరిశీలనమన్నా, విద్యా చరిత్రను వివరించే గ్రంథాలన్నా మొదటినుండి నాకు చాలా ఇష్టం. కర్ణాటక విశ్వవిద్యాలయం, ధార్వాడలో 1975లో నేను, ఎమ్. ఇడి. చేస్తున్నప్పుడు విద్యా శాస్త్ర సూత్రాలను ప్రత్యేక దృష్టితో సమగ్రంగా పరిశీలించే అవకాశం కలిగింది. విద్యాశాస్త్ర సూత్రాలను ఒక ప్రాచీనమైన తెలుగు గ్రంథానికి అన్వయించి పరిశోధన సాగించాలనే కుతూహలం ఏర్పడింది.

1978లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగుశాఖాధ్యక్షులైన ఆచార్య జి. యన్. రెడ్డిగారిని కలుసుకొని విద్యావిధానంపై పరిశోధన చేయాలనే నా ఆసక్తిని వ్యక్తంచేశాను. వారు దయతో ఆమోదించి మహాభారతంలోని విద్యా విధానంపై పరిశోధన చేయడానికి అవకాశాన్ని కలిగించారు. అనాటి సంకల్పానికి రూపకల్పనే ఈ సిద్ధాంత గ్రంథం.

మహాభారతం విశ్వవిజ్ఞానకోశం, శ్రుతిస్మృతీతిహాస పురాణ వాఙ్మయానికి అంతటికీ ఒక చక్కని సమన్వయ రూపమైన గ్రంథం. పురుషార్థాలను సాధించే మార్గాన్ని సూచిస్తూ "ఇందు గలుగునదియయొండెడలగల్గు దీనలేకుండు చొప్పుదక్కా కంటను లేదు వేదజ్ఞులార" అని తిక్కన, భారతాన్ని ప్రశంసించాడు. మహాభారతం ఒకధర్మశాస్త్రం, వేదాంతగ్రంథం, ఇతిహాసం, కావ్యం, నీతిశాస్త్రం, సర్వ లక్షణాలకూ ఒక లక్ష్య గ్రంథం, విశేషించి చతుర్దశ విద్యాతత్త్వదర్శి. ఇట్లాంటి విశిష్టతను సంతరించికొన్న మహాభారతంలోని విద్యా విధానాన్నిగురించి సమగ్రమైన పరిశీలనగాని పరిశోధనగాని ఇంతవరకూ తెలుగులో జరుగలేదు అయితే కీ.శే. ఆచార్య భూపతి లక్ష్మీనారాయణరావుగారు, 'భారతం విద్యా స్వరూపం' అనే శీర్షికతో ఒక వ్యాసాన్నిమాత్రం ప్రకటించారు. తెలుగుభాషా సారస్వతాలకు సంబంధించి విడివిడిగా పరిశోధన జరుగుతూ ఉంది. కాని విద్యా శాస్త్ర మూల సూత్రాలను ఒక ప్రాచీన గ్రంథానికి అన్వయించి పరిశోధించడమనే ప్రక్రియ ఇంతవరకూ జరగలేదు, ఇది ఒక అప్రహతమైన పరిశోధనా రంగం. కనుకనే ఈ మార్గంలో పరిశోధన సాగించ దలచాను.

విద్యా స్వరూప స్వభావాలూ, విద్యా సంస్థలూ, ఆచార్యులూ, అంతేవాసులూ, బోధన పద్ధతులూ, విద్యా సంస్కారాలూ మొదలైనవి అన్నీ విద్యా విధానానికి సంబంధించినవే. వాటిని వివరించడానికి చారిత్రక పద్ధతిలో పరిశోధన సాగించవలసి ఉంది.

దేశకాల నిమిత్తాలాధారంగా జరిగిన విద్యా విధానంలోని మార్పులను శోధించి వాటిని గురించి విద్యా చరిత్ర వివరిస్తుంది. చరిత్ర గతానికి చెందిన అనుభవాన్ని అందిస్తుంది. ఆ అనుభవబలంతో మానవుడు భవిష్యత్తును దృష్టిలో ఉంచుకొని వర్తమాన కాల సమస్యలను పరిష్కరించుకోవలసి ఉంటుంది. మహాభారతంలోని విద్యా విధానం ఎట్లాంటిదో తెలుసుకోవడానికి చరిత్రాత్మక పద్ధతి ఉపకరిస్తుంది. అందువల్ల భారతాన్ని ఆధారంగా చేసుకొని అందులోని విద్యా విధానాన్ని గురించి సమగ్రంగా పరిశీలించాలనే ఉద్దేశంతో నేను కవిత్రయ భారతాన్ని ఎన్నుకొన్నాను. అందులో కనిపించని విద్యా విషయిక విశేషాలను సంస్కృత భారతంనుండి గ్రహించడం జరిగింది. ఆంధ్ర సంస్కృత గ్రంథాలతోపాటు, విద్యా చరిత్రకు, మనస్తత్వ శాస్త్రానికి సంబంధించిన గ్రంథాలను పరిశీలించి నేనీ పరిశోధనను సాగించినాను. ఈ పరిశోధనలో ఈ క్రింది విధానం పాటించబడింది.

మొదటి అధ్యాయంలో విద్యా స్వరూప స్వభావాలూ, మానవుడు - విద్యా యోగ్యత,చతుర్విధ పురుషార్థాలకు విద్య ఉత్తమ సాధనం, విద్య-వివిధ నిర్వచనాలూ వీటిని గురించి చర్చించడం జరిగింది.

తొలిమలి వేదయుగాలలోని విద్యా విధానం, బ్రాహ్మణాలూ, ఆరణ్యకాలూ, ఉపనిషత్తులూ, స్వాధ్యాయం, గురుకుల ప్రవేశం, శిక్షణ పరిమితి బోధన ప్రణాళిక, బోధన పద్ధతులు, తొలిమలి వేదయుగాలలో విద్యా విధానంలోని భేద సాదృశ్యాలూ, స్మృతులలోని విద్యా విధానం రెండవ అధ్యాయంలోని ముఖ్యాంశాలు.

మూడవ అధ్యాయంలో మహాభారత గ్రంథ ప్రాశస్త్యం, మహాభారతంలోని విద్యా సంస్థలు, వివిధ విద్యలు, వర్ణవిద్య, స్త్రీ విద్య, బాలల విద్య, వయోజనవిద్య, ఆయుర్వేదం, పశువిద్య, సైనికవిద్య, వృక్షశాస్త్రం. సాధారణ సాంకేతిక విద్యలు, వ్యాయామవిద్య, వికలాంగుల విద్య. అక్షహృదయం, నీతివిద్య. మతవిద్య, బ్రహ్మవిద్య, వీటిని గురించి పరిశీలించడం జరిగింది.

'గురువు' పర్యాయ పదాలరూపనిష్పత్తి. శిష్యశబ్ద పర్యాయ పదాల వ్యుత్పత్తి, ధౌమ్యుని శిష్యుల వృత్తాంతం, ఉదంకుని వృత్తాంతం, కచుని విద్యాభ్యాసం, కృష్ణ బలరాముల విద్యాభ్యాసం. నారదుని విద్యాభ్యాసం, వ్యాస శిష్యుల వృత్తాంతం, భీష్ముని విద్యాభ్యాసం, పాండురాజు విద్యాభ్యాసం, కృపుని విద్యాభ్యాసం, ద్రోణుని విద్యాభ్యాసం, పాండవుల విద్యాభ్యాసం, కర్ణుని విద్యాభ్యాసం, దుర్యోధనుని విద్యాభ్యాసం, ఏకలవ్యుని విద్యాభ్యాసం, సహస్రపాదఖగమాది శిష్యుల వృత్తాంతం. వీటిని గురించి నాల్గవ అధ్యాయంలో చర్చించడమైంది.

ఐదవ అధ్యాయంలో, ప్రవచనం, ప్రయోజనం, ప్రేరణ — ప్రతిస్పందన పద్ధతి యౌగిక పద్ధతి. పఠన పద్ధతి. పంచవయవవాక్య పద్ధతి, వ్యాస సమాస, సమష్టివ్యష్టి అనుగమన నిగమన ప్రశ్నోత్తరాది బోధన పద్ధతులూ, ఉపాఖ్యానపద్ధతి, సంవాదచర్చాగోష్ఠి పద్ధతులు, ఉపన్యాస పద్ధతి, ప్రయోగ పద్ధతి, బోధనదశలు, వీటి సమీక్ష ఉంది.

ఉపనయనం, సమావర్తనం ,గురుదక్షిణలను గురించిన వివరణ ఆరవ అధ్యాయంలోని ముఖ్య విషయం. యథాశక్తిగా నేనీ రచన సాగించాను. ఈ రచన కొందరి హృదయాలనైనా స్పందింపజేయ గలిగితే చరితార్థం కాగలదని విశ్వసిస్తున్నాను. అంతేగాక గుణదోష వివేచన దక్షులైన పెద్దలు ఈ రచనలో ఏవైనా సవరణలు సూచించినా నాకు సంతోషమే. పునర్ముద్రణలో వాటిని తప్పకుండా పాటించగలను,

— రచయిత

# విషయ సూచిక

"నారాయణం నమస్కృత్య
నరం చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీమ్ వ్యాసమ్
తతోజయముదీరయేత్"

ఇది విద్యాసంప్రదాయాన్ని తెలిపే శ్లోకంగాకూడా భాసిస్తున్నది. నారాయణుడంటే సర్వజ్ఞుడైన ఆచార్యుడే. నరోత్తముడంటే జిజ్ఞాసువైన విద్యార్థి, ఇక సరస్వతి జ్ఞానానికీ దాన్ని అందించే విధానానికీ ప్రతీక, వేదవ్యాసుడుకూడా ఆచార్యుడే. ఆయన నారాయణుని అవతారమేగదా. కనుక ఆచార్యాంతేవాసి ప్రవచనాలనే ఈ మూడింటి పరస్పర సంబంధానికి సూచకమే ఈ శ్లోకం. ఈ సమన్వయాన్ని చక్కగా గ్రహించి అనుభవానికి తెచ్చుకొన్నప్పుడే జీవితానికి జయం కల్గుతుందని తాత్పర్యం.

# 1. విద్య - స్వరూపస్వభావాలు:

1.1 మానవుడు – విద్యా యోగ్యత :

జగత్సృష్టి అనంతం. విచిత్రం. స్థావరజంగమాత్మకమైంది. సృష్టిలో కేవల స్థావరాలకంటే జ్ఞానమున్న జంగమాలు మేలైనవి. జ్ఞానంలోకూడా కేవల వాసనాజ్ఞానం (Instinct) కాక వివేకమున్న మానవుడు అన్నిటికన్నా ఉత్తముడు. వివేకం ఉండబట్టే మానవుడు సృష్టిలో విశిష్టమైన స్థానాన్ని పొందగలుగుతున్నాడు. మానవునిలోని ఈ విశిష్టతకే అధికారం (Competency) అని మరోపేరు. ఈ అధికారం రెండువిధాలు. ఒకటి సామర్థ్యం (Capacity). రెండోది అర్థిత్వం (Desire). సామర్థ్యమంటే విద్యా గ్రహణానికి అనుకూలమైన శరీర నిర్మాణం. మానవునిలోనే అనువర్తనం (Adaptability). సంవర్తనం (Modifiability). పరివర్తనం (Flexibility) విశేషంగా గోచరిస్తాయి. అర్థిత్వమంటే తనకున్న సామర్థ్యంతో లక్ష్యాన్ని సాధించాలనే ఆకాంక్ష. మానవునికి సామర్థ్యమున్నా అర్థిత్వం లేకపోతే లక్ష్యం సిద్ధించదు. అర్థిత్వమున్నా సామర్థ్యం లేకపోతే ప్రయత్నమేలేదు. మానవునిలో ఈ రెండూ విశేషంగా గోచరిస్తాయి. దీనికి కారణం మనస్సు. 'మన్' అనే ధాతువునకు 'ఆలోచించుట' అని అర్థం. మననశక్తిగలవాడే మానవుడు. ఒకవ్యక్తి మరో వ్యక్తికంటే విశిష్టుడనిపించుకొన్నాడంటే ఆ విశిష్టత ఇంద్రియాధిక్యంచేత వచ్చింది కాదు. అతనిబుద్ధి సమీచీనమైన విద్యావిధానంచే ఉజ్జ్వలత్వాన్ని, పరిపూర్ణతను పొందుటచేతనే అని భావించాలి.

1.2. పురుషార్థాలకు విద్య ఉత్తమ సాధనం :

మహాభారతంలోని ముఖ్య సందేశం ధర్మాద్వైతం. తిక్కన హరిహరాద్వైతం ధర్మాద్వైత స్థితిని వ్యక్తంచేస్తుంది. భారతం ఐహిక జీవితానికి ధర్మమును ప్రధానంగా ఉపదేశిస్తుంది. అది ఆముష్మిక జీవితానికి అద్వైత దర్శనాత్మకమైన మోక్షధర్మాన్ని బోధిస్తుంది. అందులో ప్రవృత్తిరూపమైన ధర్మం, ఐహికధర్మం. నివృత్తిరూపమైన ధర్మం ఆముష్మికం. ఈ మోక్షమే మహాభారతంలోని మూడు

ముఖ్య ధర్మాల్లో ఒకటైన బ్రహ్మవిద్యోపదేశం. వేదాలకూ, సమస్తమైన స్మృతి వాదాలకూ, నానావిధాలైన పురాణాలకూ పురుషార్థాల విషయంలో వివాదంవస్తే ధర్మార్థకామమోక్ష స్థితిని నిరూపించడానికి భారతమే ప్రమాణమని తిక్కన అభిప్రాయం. తిక్కన తన అభిప్రాయాన్ని క్రింది పద్యంలో సూచించినాడు.

"వేదములకు నఖిల స్మృతివాదములకు బహు పురాణ వర్గంబులకున్,
వాదైన చోటులను దా-మూదల ధర్మార్థకామమోక్ష స్థితికిన్."[1]

మానవుడు తన జీవిత ధ్యేయాలైన ధర్మార్థకామమోక్షాలను ఇంతకుముందు చెప్పిన అధికారంతో సాధించవలసిఉంది. అందులో మొదట ధర్మ పురుషార్థాన్ని పరిశీలించవలసి ఉంది. మహాభారతంలో విదురుడు ధర్మరాజాదులకు, ధర్మార్థ కామాల తారతమ్య నిరూపణ జేస్తూ ధర్మాన్నిగూర్చి ఇట్లా చర్చించినాడు.

"విను ధర్మంబున ధనమగు
ధనమున సిద్ధించుఁ గామతంత్రం బటుగా
వున మధ్యమంబు నధమము
ధన కామము లుత్తమంబు ధర్మంబధిపా."[2]

ధర్మమనే పేరు రావడానికి కారణం అది అన్నింటిని ధారణ చేయడమే. అధోగతిపాలయిన ప్రజలను రక్షించేదీ, జీవన రక్షణను కల్గించేదీ, అహింసతో కూడినదీ, సంసార సముద్రాన్ని తరింపజేసేదీ, దేవతల కౌన్నత్యాన్ని కల్గించేదీ ధర్మమే. అర్థంయొక్క అస్తిత్వం ధర్మంలోనే ఉంది. ధనంవల్ల కామతంత్రం సిద్ధిస్తుంది. అందువల్ల ధర్మ ముత్తమమైందని, ధనము మధ్యమమైందని, కామ మధమమైందని తెలుసుకొనవలసి ఉంది.

అర్థప్రాధాన్యాన్ని గురించి అర్జునుడు ధర్మరాజుతో చెప్పిన సందర్భాన్ని పరిశీలించవలసి ఉంది. విదురుడు ధర్మప్రాధాన్యాన్ని ఉగ్గడించిన తరువాత అర్జునుడు అర్థవిషయకమైన తన అభిప్రాయాన్ని ఇట్లా చెప్పినాడు.

---

1. శ్రీమదాంధ్ర మహాభారతము విరాటపర్వము ఆ॥ 1 పద్యము 4, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు. 1965.

2. Ibid, ఆ॥ 3 ప॥ 453.

"అనవుడు బార్థు డిట్టులను నర్థము మూలము ధర్మ కామ వ
ర్తనముల కట్లుగాకయు విరక్తతనొంది జటాది ధారణం
బునఁ జరియించు వారికిని భూవర యర్థము దేహకృత్య సా
ధన మనురేజ్య కణ్వులును దానిన మేలని పూనిచెప్పరే."[1]

కర్మభూమిలో బ్రదుకుతెరువుకు సాధనాలయిన కర్మలకే ప్రాశస్త్యం మెక్కువగా ఉంటుంది. కృషీ, వాణిజ్యమూ, పశుపాలనమూ, రకరకాల శిల్ప కార్యాలూ అర్థప్రాప్తికి సాధనాలు. సమస్తమైన కర్మలను సాధించడానికి అర్థం ముఖ్యం. ధర్మకామాలు అర్థానికి రెండవయవాలు. అర్థం లేకపోతే ధర్మ కామాలు సిద్ధించవు. జటాజినధారులూ, దాంతులూ, ముండకులూ, నైష్ఠిక బ్రహ్మచారులూ అర్థాభిలాషతోనే వేరువేరుగా జీవిస్తున్నారు. స్వర్గసుఖాలను పొంద గోరేవారూ, తమతమ వర్ణధర్మాలనూ, ఆశ్రమ ధర్మాల ననుష్ఠించేవారూ, ధనము మీద అభిలాష గలవారే. భృత్యులకు త్తమభోగాలను కల్గించువాడూ, శత్రువులను తన వశంలో ఉంచుకోగలిగేవాడూ ధనవంతుడే. కణ్వ బృహస్పతులుకూడా అర్థమే మేలైనదని చెప్పినారు.

త్రివర్గంలో కామానికి ప్రాధాన్య మివ్వాలనేదే భీముని అభిమతం. దీన్ని తిక్కన క్రిందిపద్యాల్లో వర్ణించినాడు.

"దధిసారము చందంబున
నధిపా ధర్మార్థ సారమగు కామరసం
బధమమను తలంపు సుఖ సం
విధాన బాహ్యమని నీ వివేకమ యెఱుగున్."[2]

"వినుమఖి యలరునఁ దేనియ
గొను గతి నత్యంత సుఖము గొననగుఁ గామం
బున నధిక సుఖము లొందని,
జను సిరి దాఁ గొల్చురేని సస్యముకాదే."[3]

---

1. తిక్కన Ibid, ఆ॥ 3, ప॥ 454.
2. తిక్కన Ibid, ఆ॥ 3, ప॥ 459.
3. „ ఆ॥ 3, ప॥ 460.

కామిగాని వానికి ధనం సంపాదించాలనిగానీ, ధర్మ మాచరించాలనిగానీ కోరిక ఉండదు. వానికి భోగాలపైన ఆశ ఉండదు. ఋషులు తపస్సుచేయడానికి కారణం కామమే. కామంవల్లనే వారు ఫల మూలాలనూ, ఆకులనూ, భక్షిస్తున్నారు. వారు గాలిని ఆహారంగా తీసుకోవడం, జితేంద్రియులుగా ఉండడం కామంవల్లనే. వేదోపవేదాల నధ్యయనం చేయడం, శ్రాద్ధకర్మలూ, యజ్ఞాలూ, దానాదులుచేయడం కామంవల్లనే. వర్తకులూ, కర్షకులూ, గోపకులూ, కర్మకారులూ, శిల్పులూ కామం వల్లనే తమతమ పనులను చేస్తున్నారు. సర్వకార్యాలూ కామమయములే. సర్వ ప్రాణులకు కామం సహజం. దధిసారమైన నేయిలాగా ధర్మార్థసారం కామరసం. కామ మధమమని భావించడం మంచిదికాదు. మానవుడు పూవునుండి తేనెను తీసుకొని త్రాగి తేటి ఆనందాన్ని పొందినట్లు కామరసాన్ని పానంచేసి సుఖాన్ని పొంద వలసి ఉంది అట్టి సుఖాన్ని పొందడానికుపయోగించని వాని సంపద, సేవించడానికి పనికిరాని సస్యమువంటిది. ధర్మార్థకామాల్లో మూడింటిని సేవించువాడుత్తముడు. రెండింటిని భజించేవాడు మధ్యముడు. ఒక దానిపైనే భక్తిఉండేవాడధముడు. పై విషయాన్నిబట్టి భీమునిది కామప్రధానమైన మనస్తత్త్వమని విదిత మౌతుంది.

మోక్ష పురుషార్థాన్ని గురించి ధర్మరాజు విదురాదులతో ఇట్లా చెప్పినాడు.

"మనమున ధర్మము నర్థం
బునుఁ గామముఁ గీలుకొనక పొరపొచ్చెములై
చన సుఖదుఃఖంబుల మద
మున దైన్యముఁ బొంద కునికి మోక్షకరమగున్."1

సంస్కృత భారతంలో వేదవ్యాసుడు మోక్ష పురుషార్థాన్ని గురించి విస్తరించి చెప్పినాడు. తిక్కన ఆ విషయాన్ని సంగ్రహంగా చెప్పినాడు. తిక్కన అద్వైత భావం కర్మమార్గంతో ప్రారంభమై, క్రమంగా భక్తిమార్గంలోపెరిగి, జ్ఞానమార్గంలో కుదిరిక చెందుతుంది. కర్మయోగానికీ, కర్మసన్యాసయోగానికీ మధ్య నిలిచి, సమన్వయ సూత్రమైన నిష్కామ కర్మయోగాన్నే తిక్కన భారతంలో ప్రతిపాదించి నాడు. ధర్మార్థ కామమోక్షాల్లో మోక్షమే చరమలక్ష్యమని భారతంలో చెప్పబడింది. మానవుని జీవితం ఒక నదివంటిది. దానికి ధర్మం మొదటితీరం. మోక్షం రెండోతీరం. నీరు అర్థకామాలకు సంకేతం. అర్థకామాలు ధర్మ బద్ధమైనప్పుడే

1. తిక్కన Ibid, ఆ॥ 3, ప॥ 466.

మోక్షం సిద్ధిస్తుంది. అర్థకామాలు ధర్మానికీ, ధర్మం మోక్షానికీ దారితీస్తే చివరకు మోక్షమే పరమపురుషార్థమైంది. మోక్షం కేవల ఆత్మజ్ఞాన స్వరూపమైంది. అనాత్మ నిరాకరణ రూపమైన వైరాగ్యం లేదా సన్యాసం దీనికి అంగం. కర్మ కాండకూ దీనికీ విరోధంలేదు. మీదుమిక్కిలి విధులన్నీ చిత్తశుద్ధిని ప్రసాదిస్తే, ఆ చిత్తశుద్ధివల్ల జ్ఞానం కలగడానికి వీలుపడుతుంది. జ్ఞానియైనవాడు సుఖదుఃఖాది ద్వంద్వాలవల్ల దైన్యాన్ని పొందడు. అట్లా దైన్యాన్ని పొందకుండడమే మోక్షం. కొంతే జ్ఞానం పుట్టుకతోనే కొంతమందికి కలుగుతుంది. అది యోగం. మామూలు వ్యక్తులకు జ్ఞానం పుట్టుకతోనే సిద్ధించదు. ప్రతివ్యక్తి జన్మచే శూద్రుడే. అతడు సంస్కారాన్నిపొంది ద్విజుడౌతాడు. విద్య నధ్యయనంచేసి విప్రుడౌతాడు. అందువల్ల మానవుడు ప్రాకృత దశనుండి పరిణతమైన దశను అందుకోవడాని కుపకరించే ఉత్తమసాధనం విద్య. విద్య మానవునికి మూడవకన్ను వంటిది. దానిబలంతో అతడు సమస్తమైన తత్త్వార్థాన్ని విశేషంగా దర్శించగలడు. మానవుని ఐహికాముష్మిక సుఖసాధనకు విద్యయే మూలమని క్రింది పద్యంవల్ల విదిత మౌతుంది.

> "విద్య యొసగును వినయంబు; వినయమునను
> బడయు పాత్రత; పాత్రత వలన ధనము;
> ధనము వలనను ధర్మంబు; దానివలన
> నైహికాముష్మిక సుఖంబు లందు నరుడు."[1]

1.3 విద్య — వివిధ నిర్వచనాలు:

'విద్య' అనే శబ్దాన్ని 'ఆత్మవిద్య' అనే అర్థంలో కొందరు ప్రయోగించి నారు. మరికొందరు దీన్ని కళలలోచేర్చి స్వీకరించినారు. నిషేకాది శ్మశాన పర్యంతం మానవునికి కలిగే అనుభవ పరంపర 'విద్య' అని కొందరు విస్తృ తార్థంలో వాడినారు. అధ్యయన, అధ్యాపనాలతో, నేడు విద్యా సంస్థలలో కొనసాగే బోధనయే 'విద్య' అని కొందరభిప్రాయపడినారు. ఒక విషయాన్ని నేర్చుకోవడమే 'విద్య' అని కొందరి మతం. కొన్ని జంతువులలో కూడా నేర్చు కోవడమనేది ఉంది కాబట్టి మానవుడు పుట్టకముందే 'విద్య' ఉన్నట్లు ఊహించ

1. చిన్నయసూరి, పరవస్తు-నీతిచంద్రిక. బాలసరస్వతి బుక్ డిపో, కర్నూలు, 1975. పుట 7, పద్యము 3.

వచ్చు. 'విద్య' అనే పదాన్ని పలువురు పలు రకాలుగా ఉపయోగించిన సందర్భాలను క్రింద పరిశీలించాలి.

1.3.1 విద్య ఆనువంశిక లక్షణం – పరిసరాల ప్రభావం:

'విద్య' అనే శబ్దం 'విద్' అనే ధాతువునుండి వచ్చింది. 'విద్' ధాతువునకు 'తెలుసుకొనుట' అని అర్థం. (విద్ - జ్ఞానే) "To know; Understand; perceive; learn; become; be acquainted with; be conscious of have correctnotion of;"[1] మొదలైనఅర్థాలు 'విద్' కున్నాయి. 'విద్' నుండే 'వేద'మనే పదంకూడా పుట్టింది. 'Veda' అనే పదానికి. "Knowledge; Science;" అనే అర్థాలున్నాయి. 'వేదం' అంటే జ్ఞానం. దాన్ని తెలుసుకోవడానికి సాధనం విద్య. జ్ఞానం గమ్యం. విద్య గమకం. దీనికి ఆంగ్లంలో సమానార్థకమైనపదం "Education." "e (ducatio)" అనే ల్యాటిన్ పదం నుండి "Educato" అనే ఇంగ్లీషుపదం ఏర్పడింది. "e" అంటే 'బయట' అని, 'ducatio' అంటే 'లాగుట' అని అర్థాలున్నాయి. వీటినిబట్టిచూస్తే ఒక వ్యక్తిలోని సహజశక్తిని ఉద్బుద్ధమొనర్చేది 'విద్య' అని చెప్పవచ్చు. విద్యవల్ల వ్యక్తిలో అంతర్గతంగా ఉన్న శక్తి బహిర్గతమౌతుంది. ఈ నిసర్గమైనశక్తి వంశపారంపర్యంగా వ్యక్తికి సంక్రమిస్తుంది.

విద్యాధ్యయనంలో వంశపారంపర్య గుణంయొక్క ప్రభావాన్ని గురించి ఎర్నెస్టర్ హిల్‌గార్డు. రిచర్డు సి. ఎక్కిన్‌సన్ అనేవారు ఇట్లా చెప్పినారు. "Intelligence varies, as height does, on a scale from subnormality to great brilliance, without the sharp break that would let us classify men into two groups - the bright and the stupid. Hence to the extent that intilligence or any other complex trait may be inherited; we should expect it to be controlled by a number of genes."[2]

---

1. Sir Monier, Sanskrit English Dictionary, Page 1017. Williams, Motilal Banarsidass, Delhi, 1964.
2. Hilgard R. Ernest, Akkinson C. Richard. Introduction to psychology, page 450. Harcourt, Braceand world INC. Newyork 1967.

'Education' అనే పదం 'Educare' అనే ల్యాటిన్ పదంనుండి ఉత్పన్నమైందని చెప్పబడింది. ఈ పదానికి 'To bring up' అని అర్థం. సంస్కృత భాషలో కూడా 'విండ్' అనే ధాతువునకు 'పొందుట' అనే అర్థముంది. ఒక మొక్క పరిసరాలనుండి పోషక పదార్థాలను గ్రహించి బాగుగా పెరుగునట్లు విద్యార్థి సరియైన పరిసరాల్లో విద్యను బాగుగా ఆర్జించగలడని చెప్పవచ్చు. వ్యక్తిలో కలిగే ఈ మార్పు, లేక వికాసం బాహ్యమైంది. బాహ్యవికాసం (External growth) పరిసరాలచే ప్రభావితమౌతుంది. విద్యాధ్యయనంలో పరిసరాల ప్రభావాన్ని గురించి మనస్తత్త్వవేత్త లిట్లా చెప్పినారు. "Since fraternal twins are more alike in intelligence than ordinary siblings, we Know that environment must also play a part in the determination of intelligence."[1]

విద్యాధ్యయనంలో వంశపారంపర్య లక్షణం, పరిసరాల ప్రభావం రెండూ అవసరమే. ఇందులో వంశపారంపర్య లక్షణం నిసర్గమైంది. రెండవది సంస్కారయుక్తమైంది. వ్యక్తియొక్క పరిపూర్ణ వికాసానికి రెండూ ముఖ్యమే. ఈ రెండింటియొక్క గుణకమే ప్రజ్ఞాలబ్ధం. (Intelligenc quotient.)

కౌంతేయులజేయులనీ, విద్యా సంపన్నులనీ, కురుపితామహుడు పలికినప్పుడు దుర్యోధనుడు చెప్పిన ఈ మాటలలో జ్ఞానార్జన రాసుపంశికత, పరిసరాల ప్రభావం ముఖ్యమనే భావం స్ఫురిస్తుంది.

"సదృశానామ్ మనుష్యేషు సర్వేషాం తుల్య జన్మనామ్
కథమేకాంతతస్తేషాం పార్థానామ్ మన్యసే జయమ్"[2]

కురుపాండవులు ఒకే వంశంలో జన్మించినవారే. ఒకే వాతావరణంలో శిక్షణ పొందినవారే. అందువల్ల యుద్ధంలో పాండవులకే జయంకల్గుతుందని ఎందుకనుకోవాలని దుర్యోధనుడు ప్రశ్నించినాడు.

పై పరిశీలనను బట్టి విద్యార్జనకు పరిసరాలూ ఆనువంశిక లక్షణం రెండూ ముఖ్యమని తేలుతుంది. 'విద్' ధాతువు వంశపారంపర్య గుణానికీ, 'విండ్' ధాతువు పరిసరాల ప్రభావాన్ని సూచించడానికి సంకేతాలుగ ఉన్నట్లు బోధపడుతుంది.

---

1. Hilgard R. Ernester Akkinson C. Richard, Ibid, P. 454.
2. వ్యాసుడు సంస్కృత భారతము ఉద్యోగ పర్వము. శ్లో 8 పుట 2244 గీతా ప్రెస్, గోరఖ్‌పూర్.

1.3.2. విద్య - వైయక్తికాభివృద్ధి (Individual development)

T. P. నన్ అనే, విద్యావేత్త వైయక్తికాభివృద్ధిని గురించి ఇట్లా చెప్పినాడు. "Education is the Complete development of the individuality of the child so that he can make an original Contribution to human life according to the best of his Capacity"1 తన శక్తి కొలది మానవ జీవితానికి (ఉపజ్ఞను) (Originality) సమకూర్చే విద్యార్థి వ్యక్తిత్వాన్ని వృద్ధి నొందించేదే విద్య అని T. P. నన్ అభిప్రాయం.

వైయక్తికాభివృద్ధికి సంబంధించిన పెస్టలాజీ అభిప్రాయమిట్లా ఉంది. "Education is defined as natural, harmonious and Progressive development of mens, innate powers"2 మానవులలోని సహజశక్తులు సహజంగా సమంగా, ప్రగతి శీలం కావడానికి తోడ్పడేదే విద్య అని పెస్టలాజీ చెప్పిన వాక్యాలలోని సారాంశం. ఈ విద్యా వేత్తల అభిప్రాయాలను బట్టి వైయక్తి కాభివృద్ధికి విద్య ఎట్లా తోడ్పడుతుందో విదితమౌతుంది. మహాభారతంలో కూడా వైయక్తికాభివృద్ధికి విద్య తోడ్పడుతుందని చెప్పటం జరిగింది.

"ఉద్ధరేదాత్మఽఽనాత్మానం నాత్మానమవసాదయేత్
ఆత్మైవహ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః"3

ఒక వ్యక్తి తన్నుతానే ఉద్ధరించు కోవలసిందే. అతడధోగతి పొందకూడదు ఇచ్చట గురువు నిమిత్తమాత్రుడు. గురువు ప్రమేయం లేకుండా విద్యనేర్చిన శిష్యులుండవచ్చు. విద్యార్థి గురువునుండేగాక, తల్లిదండ్రులనుండీ, స్నేహితులనుండీ ఎన్నో విషయాలు నేర్చుకొంటాడు. ఐతే విద్యార్థి తన్ను తానుద్ధరించుకోవడానికి స్వాధ్యాయం (Self Study) చాల ముఖ్యం. విద్యార్థి స్వాధ్యాయ బలంతో విషయాన్ని గ్రహించి తన జీవితానికి తగిన ప్రత్యగ్రతను సమకూర్చుకో గలుగుతాడు.

---

1. Raman Nayar, R. Advanced educational Psychology
2. Raman Nayar, Ibid, P 3
2. వ్యాసుడు, op, cit, పుట 2646 శ్లో 5

1.3.3. విద్య - ఉభయతారక పద్ధతి : (Bipolar Process)

గురు శిష్యుల పరస్పర సహకారం లేకపోతే విద్య సిద్ధించదని కొందరి విద్యావేత్తల అభిప్రాయం. అందువల్ల విద్య ఉభయతారకంగా ఉండాలని చెప్పినారు. Sir John Adams అను విద్యావేత్త ఉభయతారక పద్ధతిని గురించి ఇట్లా చెప్పినాడు. "Education is a bipolar Process. At one Pole, there is the, "Educator" (Teacher) and at the other the, "Educand" (Pupil), Education results from the Co-operative effort of the two"1 గురుశిష్యుల పరస్పర సహకారం వల్లనే విద్య సిద్ధిస్తుందని యజుర్వేదీయతైత్తిరీయోపనిషత్తులో క్రింది విధంగా చెప్పబడింది. "ఆచార్యః పూర్వరూపమ్ అంతేవాస్యుత్తర రూపమ్ విద్యాసంధిః ప్రవచనం సంధానమ్."2 ఆచార్యుడు పూర్వ రూపమనీ, అంతే వాసి ఉత్తరరూపమనీ, వారిని సంధించేది విద్య అనీ, ప్రవచనం సంధానమనీ దీనివల్ల విదితమౌతుంది. విద్య ఉభయతారక ప్రక్రియ అనే విషయం మహాభారతంలో కూడా చెప్పబడింది, అశ్వమేధ పర్వంలోని బ్రాహ్మణ దంపతుల సంవాద మందలి శ్లోకాన్ని పరిశీలిద్దాం.

"అరణీం బ్రాహ్మణీం విద్ధి గురురస్యోత్తరారణీమ్
తపః శ్రుతేఽభిమథ్నీతో జ్ఞానాగ్నిర్జాయతే తతః" 3

అగ్ని పుట్టాలంటే రెండు జమ్మికొయ్యలవసరం. అందులో ఒకటి పూర్వారణి. రెండోది ఉత్తరారణి. ఆ రెండింటికి మధ్య ఘర్షణ జరిగినప్పుడే అగ్ని పుడుతుంది. ఇచట శిష్యుని బుద్ధి ఒక అరణి. గురువు యొక్క బుద్ధి ఉత్తరారణి. తపస్సూ, శ్రవణమూ, మననమూ విద్యాసాధనాలు. వీటివల్ల జ్ఞానాగ్ని పుడుతుంది. అగ్ని అంధకారాన్ని తొలగించినట్లు జ్ఞానం తమస్సును పోగొడుతుంది. వెలుతురు లేకపోతే వస్తువు యొక్క ఉనికిని తెలుసుకొనలేము. అగ్ని రెండు పనులను చేస్తున్నది. ఒకటి చీకటిని తొలగించడం. రెండు పదార్థాన్ని చూపించడం. అట్లాగే జ్ఞానంవల్ల అజ్ఞానం తొలగడం, సత్పదార్థం గోచరించడం జరుగుతుంది. జ్ఞానాన్ని సత్ప్రత

---

1. Raman Nayar, o p, cit, Page 3
2. గోపదేవ్, పండిత యజుర్వేదీయతైత్తిరీయోపనిషత్తు (ఆంధ్ర) పుట 4-5 శ్లో 2-3 ఆర్యసమాజము, కూచిపూడి - 1979
3. వ్యాసుడు, op. cit, పుట 6172 శ్లో. 3

దానం చేయడంవల్ల గురువుకూ, జ్ఞానార్జనవల్ల శిష్యునికీ తృప్తి కలుగుతుంది. అందువల్ల ఉభయులూ తరించినట్లే ఔతుంది.

గురుశిష్యుల సహకారం వల్లనే విద్య సిద్ధిస్తుందని సాధారణంగా చెప్పినా, ఉపనయనానికి ముందు విద్యార్థి గురుకులంలో నివసించడంలేదు కాబట్టి అతడు గురువు నుండి జ్ఞానాన్ని పొందడానికి వీలుండదు. అట్లాగే సమావర్తనం (Convocation) జరిగిన తరువాత గృహస్థాశ్రమాన్ని స్వీకరించిన వ్యక్తి గురువునుండి విద్యను నేర్చుకొనలేడు. విస్తృతార్థంలో నిషేకాది శ్మశానపర్యంతం మానవునికి కలిగే అనుభవపరంపర విద్య అని చెప్పినప్పుడు, గురువుగానీ, శిష్యుడుగానీ పుట్టినదటనుండీ మరణించే దాకా విద్యను నేర్చుకోవలసి ఉంటుంది. కానీ అట్లా జరగడంలేదు. అందువల్ల ఉభయతారక ప్రక్రియను దృష్టిలో ఉంచుకొని చేసిన విద్యా నిర్వచనాలు అసమగ్రమని చెప్పవలసి ఉంది.

1.3.4. విద్య - ప్రయోజనం దృష్ట్యా చెప్పిన నిర్వచనాలు :

"Education is the creation of Sound mind in a Sound body"1 అని అరిస్టోటల్. "Education is the superior adjustment of a Physically and mentally developed conscious human being to the intellectual, emotional, and violitional environments"2 అని హార్న్. Education is the organisation of acquired habits of such actions such will fit the individual to his physical and social environment"3 అని జేమ్స్. "The importance of education is not only knowledge and skill, but it is to help us to live with others, Co-operative and mutually helpful living is what we should be trained for"4 అని సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు విద్యాప్రయోజనాలను దృష్టిలో నుంచుకొని విద్యను నిర్వచించినారు. నిర్మలమైన శరీరాన్ని, మనస్సునూ ప్రసాదించేది విద్య అని అరిస్టోటిల్ అభిప్రాయం. శారీరకంగా, మానసికంగా ఎదిగిన సచేతనుడైన మానవుని బౌద్ధిక, హార్దిక, ఐచ్ఛిక పరిసరాలకు అనుగుణ్యం

1. Raman Nayar R., op. cit. Page 3
2. Raman Nayar R., op. cit. Page 4
3. Raman Nayar R., op cit. ,,
4. Raman Nayar R., op. cit.

పొందునట్లు చేసేది విద్య అని హార్న్ అభిప్రాయాలనుబట్టి విదితమౌతుంది. సహజీవన సామర్థ్యాన్ని, జ్ఞానశక్తినీ, సంస్కారాన్ని, క్రియా నైపుణ్యాన్ని కల్గించడానికి విద్య ఉపకరిస్తుందని జేమ్సు, రాధాకృష్ణ పండితుల మాటలలోని సారాంశం.

భర్తృహరి కూడా విద్యాప్రయోజనాలను గురించి ఇట్లా చెప్పినాడు.

"హర్తుర్యాతినగోచరం కిమపిశం పుష్ణాతియత్సర్వదా
ప్యర్థిభ్యః ప్రతిపాద్యమానమనిశం ప్రాపోన్నతి వృద్ధింపరామ్
కల్పాన్తేష్వపి నప్రయాతిని ధనం విద్యాఖ్యమన్తర్ధనం"1

"విద్యానామ నరస్యరూపమధికం ప్రచ్ఛన్న గుప్తంధనం
విద్యా భోగకరీయశస్సుఖకరీ విద్యాగురూణాంగురుః
విద్యాబన్ధుజనో విదేశ గమనే విద్యాపరాదేవతా
విద్యా రాజసుపూజ్యతే నహిధనం విద్యావిహీనః పశుః"2

దొంగిలించుటకు వీలులేనిదీ, ఎల్లప్పుడూ సుఖాన్ని ఇచ్చేదీ, కీర్తిని కల్గించేదీ, ఇతరులకిచ్చేకొలదీ పెరిగేదీ, ప్రళయకాలంలోకూడా నశించనిదీ విద్యఅనే దివ్యధనం. విద్యయే మానవునికి రూపం. గురువులకు కూడా పరమార్థాన్ని బోధించేది విద్యయే. అది పరదేశంలో బంధువు. పరాదేవత. విద్యావంతునికే రాజ్యసభల్లో సన్మానం జరుగుతుంది. విద్యలేనివాడు పశుప్రాయుడని భర్తృహరి అభిప్రాయం.

మహాభారతంలో కూడా జ్ఞానార్జనకు చక్కని శరీరం, నిర్మలమైన మనస్సు అవసరమని చెప్పబడింది.

"యత్రాసతే మతిమంతో మనస్వినః
శక్రో విష్ణుర్యత్ర సరస్వతీచ
వసంతి భూతానిచ యత్ర నిత్యం
తస్మాద్ విద్వాన్ నావమన్యేత దేహమ్॥"3

---

1. భర్తృహరి - భర్తృహరి సుభాషితములు పుట 13 శ్లో 13, రామా అండ్ కో, ఏలూరు. 1909.
2. భర్తృహరి, Ibid, పుట 18. శ్లోకము 17.
3. వ్యాసుడు, op. cit, పుట 4731, శ్లో॥ 46.

ఇంద్రునికీ, విష్ణువుకూ, సరస్వతికీ, మహర్షులకూ ఇంద్రియాలు నివాసస్థానాలనీ, వాటికి కేంద్రమైన శరీరాన్ని అవహేళన చేయడం బుద్ధిమంతుల లక్షణం కాదని పై శ్లోకంవల్ల విదితమౌతుంది. శారీరక వికాసంతోపాటు వ్యక్తికి మానసిక వికాసంకూడా ముఖ్యమే. అష్టవిధ మేధాశక్తుల గురించికూడా భారతంలో చెప్పడం జరిగింది. "శుశ్రూష, శ్రవణం, గ్రహణం, ధారణం, ఊహ, అపోహ, అర్థజ్ఞానం, తత్త్వవిజ్ఞానం"1 అనే ఎనిమిదీ మేధాశక్తులు. అంతేవాసి భక్తిశ్రద్ధలతో త్రికరణశుద్ధిగా ఆచార్యునికి సంతోషాన్ని కల్గించే పనులుచేయడం, నమస్కరించడం, ఆయన ఆజ్ఞను శిరసావహించడం, గురువు ఎడ అనుకూల ప్రవర్తనతో ఉండడం గురు శుశ్రూష. గురువు చెప్పే ఎన్నో విషయాలను ఎంతో కాలం వినడం శ్రవణం. వాటిని అర్థం చేసుకోవడం గ్రహణం. అర్థం చేసుకొన్న విషయాలను మనస్సులో నిలుపుకోవడం ధారణం. అవసరమైన భావాలను స్వీకరించడం ఊహ (Selection). అనవసరమైన వాటిని పరిహరించడం అపోహ (Rejection). విద్యార్థి తన వివేచన శక్తితో మంచి విషయాలను గ్రహించి, చెడు విషయాలను పరిత్యజించవలసి ఉంటుంది. మంచిని గ్రహించడమే అతనికి అర్థజ్ఞానం కలిగినందుకు నిదర్శనం. గ్రహించిన మంచి విషయాలను జీవితంలో ఆచరించడం తాత్పర్య విజ్ఞానం. శారీరక మానసిక వికాసాది ప్రయోజనాలేగాక ఇంకా ఎన్నో ప్రయోజనాలు విద్యవల్ల కలుగుతాయని క్రింది శ్లోకంవల్ల విదితమౌతుంది.

"యథాపి పానాం జయతి పురుషః ప్రాప్యవై జలమ్
ఇష్టార్థో విద్యయాహ్యేవ న విద్యామ్ ప్రజహేత్ నరః॥"2

జ్ఞానదాహం తీరడానికి విద్య అత్యావశ్యకమని పై పరిశీలనలో తేలిన సారాంశం. విద్య వల్ల కలిగే ప్రయోజనాలెన్నో ఉన్నాయి. వాటి సంఖ్యను నిర్ణయించడం కష్టం. అందువల్ల విద్యవల్ల కలుగు ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని చెప్పిన నిర్వచనాలు సమగ్రమైనవని చెప్పడానికి వీలుపడదు.

---

1. వ్యాసుడు op. cit, పుట 1077, Foot Note

2. వ్యాసుడు op. cit, పుట 6086.

1.3.5. విద్య – నైతిక ప్రవర్తనం :

విద్య నేర్చుకొన్నందుకు ఫలితం నైతిక ప్రవర్తనమే. అందువల్ల, "Education does not mean teaching the people what they do not know. It means teaching them to behave as they do not behave"[1] అని రస్కిన్, "Education is the development of good moral character"[2] అని హెర్బర్టు. "Education is the manifestation of the perfection already in man. The education which does not help the common people, to equip themselves for the struggle for life, which does not bringout the strength of character, a spirit of philoauthrophy, and the covrage of a lion; Is to worth the name? Real education is that which enables one to stand on his own legs."[3] అని వివేకానందుడు నైతిక వర్తనాన్ని గురించి నొక్కి వక్కాణించినారు.

మానవునిలో స్వతస్సిద్ధంగా ఉండే పరిపూర్ణతను ఉద్బుద్ధమొనరించేదీ, శీలపాటవాన్ని, భూతదయనూ, ధైర్యాన్ని చేకూర్చేదీ, స్వయంప్రతిష్ఠకు తోడ్పడేదీ 'విద్య' అని పై ఉదాహరణలబట్టి బోధపడుతుంది. మహాభారతంలో నైతిక వర్తన ప్రాముఖ్యాన్ని గురించి చెప్పడం జరిగింది.

"అగ్నిహోత్ర ఫలావేదాః దత్తభుక్త ఫలమ్ ధనమ్।
రతిపుత్ర ఫలాదారాః శీలవృత్త ఫలమ్ శ్రుతమ్॥"[4]

"దార సంగ్రహంబు ధరణీశ రతిపుత్ర,
ఫలము శీలవృత్త ఫలము శ్రుతము
దత్తభుక్త ఫలము ధనము వేదము
లగ్నిహోత్ర ఫలము లనియు నొగి నెఱుంగు."[5]

---

1. Raman Nayar, R. op. cit, Page 6
2. Raman Nayar, R. op. cit, ,, 7
3. Raman Nayar, R. op. cit, ,, 8
4. వ్యాసుడు, op, cit, వనపర్వము పుట 684, శ్లో॥ 118
5. భారతము, సభాపర్వము. పుట 262, పద్యము 52.

ఒక వ్యక్తికి పాఠ్యాంశాలు తెలియకపోయినా ప్రమాదముండదు. ఆచార్యుని ప్రవర్తన బాగుగా లేకపోతే చాలా ప్రమాదం కలుగుతుంది. అందువల్ల క్షీణ వృత్తుడైనవాడు హతుడనీ, నాల్గువేదాలను కంఠస్థంచేసినవాడైనా నీతిలేనివాడు నీచుడనీ, సునియంత్రితుడైన బ్రాహ్మణునికి సావిత్రీమంత్ర మొక్కటి తెలిసినా చాలుననీ చెప్పడంవల్ల శీలవృత్త ప్రాధాన్య మెట్టిదో బోధపడుతుంది.

136. విద్య – సత్యప్రతిపాదన :

శీలవృత్తాలు రెండూ సత్యమనే పునాదిపైన ఆధారపడి ఉంటాయి. సోక్రటీసు, రవీంద్రనాథఠాగూరు, శంకరాచార్యులు మొదలైనవారు సత్యమును దృష్టిలో ఉంచుకొని విద్యను నిర్వచించినారు. వారుద్దేశించిన సత్యం నిరపేక్షమైంది. విద్య అంటే వారి దృష్టిలో వస్తుస్వరూప అవధారణమే.

"Education means bringing out the ideas of universal validity which are latent in the mind of man."[1] విశ్వసత్యానికి సంబంధించిన భావాలను ఆవిష్కరించేదే విద్య అని సోక్రటీస్ చెప్పినాడు. రవీంద్రనాథఠాగూరుకూడా. "Education means enabling the child to findout the ultimate truth; making truth its own and giving expression to it."[2] అని ఇంచుమించు అదేభావాన్ని తెలిపినాడు. "Education is the best means for a person to be free from worldly alinements and temptations and ultimately to get himself absorbed in the truth."[3] వ్యక్తి ప్రాపంచిక విషయ వాసనలనుండి విముక్తుడై చివరకు సత్యంతో తాదాత్మ్యం పొందడానికి ప్రశస్తమైన సాధనం 'విద్య' అని శంకరాచార్యులభిప్రాయపడినారు.

మహాభారతంలో భీష్ముడు ధర్మరాజుకు ఇక్ష్వాకు కౌశిక సంవాదాన్ని వినిపించే సందర్భంలో సత్యాన్నిగూర్చి ఇట్లా చెప్పడం జరిగింది.

---

1. Raman Nayar R. op. cit, Page 6
2. ,, ,, ,, 7
3. ,, ,, ,, 8

"సత్యమ తపమును యజ్ఞము
సత్యమ వేదంబు శాంతి దాంతులు నగుటన్
సత్యము దొఱగుట నిర్మల
నిత్యానుష్ఠానములును నిష్ఫలములగున్."1

సత్యమే తపమనీ, యజ్ఞమనీ, వేదమనీ పై పద్యంలో చెప్పటం జరిగింది.

ఉన్నదాన్ని ఉన్నట్లు తెలుసుకొంటేనే మానవునికి శ్రేయస్సు కలుగుతుంది. అతనికి విపరీత దర్శనం పనికిరాదు. మానవుడు సమగ్రమైన వ్యక్తిగా రూపొందాలంటే అతడు సత్యాన్ని దర్శించవలసి ఉంది. సత్యదర్శనమే అతని సమగ్రతకు కారణమౌతుంది. సమగ్రత శీలవృత్తాలవల్ల కలుగుతుంది. దీన్నిబట్టి నైతిక వర్తనం సత్యదర్శనానికి శిక్షణనిచ్చే సాధనమైతే, సత్యం దానికి గమ్యమని అర్థం. మానవుడు హేయాన్నివదలి, ఉపాదేయాన్ని స్వీకరించినప్పుడే శీలవృత్త సంపన్నుడౌతాడు. హేయం అభివృద్ధి నిరోధకం కాబట్టి దాన్ని వర్జించినా మానవుని పరిపూర్ణతకు లోపంరాదు. అది తమస్సువలె మిథ్య ఐనది. అనృతం సత్యదర్శనంచేత తొలగిపోతుంది. కనుక సత్యమొక్కటే పరిపూర్ణమైందని తేలుతుంది.

విద్యను నిర్వచిస్తూ వైయక్తికాభివృద్ధిని గురించి కొందరూ, ఉభయతారక పద్ధతినిగూర్చి కొందరూ, విద్యాప్రయోజనాలనూ, నైతిక వర్తనాన్నీ, సత్యాన్నీ గురించి మరికొందరూ, తమ తమ అభిప్రాయాలను వెల్లడించినారు. వైయక్తికాభివృద్ధితో ప్రారంభించి, సత్యంవరకూ ఉన్న అన్ని అంశాలను దృష్టిలో ఉంచుకొని విద్యను నిర్వచించడం మహాభారతంలోని ప్రత్యేకవిషయం. మానవుని శారీరక మానసిక ఆధ్యాత్మిక శక్తుల సమ వికాసమే విద్య అని భారతకర్త అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని దృష్టిలో ఉంచుకొనే వ్యాసుడు పాండవులను సృష్టించినట్లు తెలుస్తుంది.

"యుధిష్ఠిరస్య శౌచేన ప్రీతాః ప్రకృతయోఽభవన్
ధృత్యా చ భీమసేనస్య విక్రమేణార్జునస్య చ
గురు శుశ్రూషయా క్షాన్త్యా యమ యోర్వినయేనచ
తుతోషలోకః సకలస్తేషాం శౌర్యగుణేనచ॥"2

---

1. నన్నయ, op. cit, పుట 151.
2. వ్యాసుడు, op. cit, పుట 10, శ్లో॥ 126.

పై శ్లోకాన్నిబట్టి యుధిష్ఠిరునిలో శౌచమూ, భీమునిలో ధృతి, అర్జునునిలో సర్వాతిశయ సామర్థ్యమూ, కవలలో గురుశుశ్రూష, వినయమూ, సహనమూ ప్రధానమైన గుణాలని బోధపడుతుంది. పంచపాండవులలోని ఈ విశిష్టమైన గుణాలు ఒకరిలో చేరితే అతడు సమగ్రమైనవ్యక్తి ఔతాడు.

మానవునికే విద్యాయోగ్యత కలదనీ, పురుషార్థాలకుత్తమసాధనమువిద్యఅనీ మానవుని శారీరక మానసిక ఆధ్యాత్మిక శక్తుల సమవికాసం విద్యఅనీ పై పరిశోధన వల్ల విదితమౌతుంది. తొలివేదయుగంలోని విద్యావిధానాన్ని గురించి వివరించడమే తరువాత ప్రకరణంలోని ముఖ్యాంశం.

# 2. శ్రుతిస్మృతులలో విద్యా విధానం:

## 2.1. తొలి వేదయుగంలో విద్యా విధానం :

"క్రీ. పూ. 1000 సంవత్సరాల వరకూ ఉన్న కాలాన్ని తొలి వేదయుగ"[1] మని పి. ఎల్. రావుత్ పేర్కొన్నాడు. తొలి వేదయుగంలోని విద్యా విధానాన్ని తెలుసుకోవడానికి ముందు వేద శబ్దానికి పర్యాయ పదాలైన 'శ్రుతి', 'ఆమ్నాయం', 'నిగమం' అనే శబ్దాలను పరిశీలించడం అవసరం. వేదకాలంలో బోధన మౌఖిక మైంది. వటువులు ఋషులుచెప్పే మంత్రాలను విని వల్లించడం ప్రధానంగా ఉండేది. "శ్రుతిః శ్రుశ్రవణే"[2] అని ఆర్యోక్తి. దేనిచే ధర్మాదులు వినబడునో అది శ్రుతి. అందువల్లనే వేదానికి 'శ్రుతి' అను పేరు వచ్చింది. వేదాల్లోని విషయాలు గురువునుండి శిష్యులకు సంక్రమించినందువల్ల వేదం, 'ఆమ్నాయ'మని చెప్పబడింది. "ఆమ్నాయతే పారంపర్యేణే త్యామ్నాయః మ్నా అభ్యాసే"[3] పారంపర్యంగా అభ్యసించబడేది కాబట్టి, 'ఆమ్నాయ' మనే పేరు వేదానికి కలిగింది. వేదంలోని జ్ఞానం నిశ్చయమైంది కాబట్టి దానికి 'నిగమ' మనే పేరు వచ్చింది.

విద్యా విధానాన్ని గురించి వేదాల్లో వేరుగా చెప్పకపోయినా, కొన్ని అంతర్గత మైన ఆధారాలనుబట్టి ఆనాటి విద్యా లక్ష్యాలూ, గురుశిష్య నియమాలూ, బోధన పద్ధతులూ మొదలైనవాటిని గురించి తెలుసుకోవచ్చు.

ఋగ్వేదంలోని ఈ ఋక్కులను పరిశీలించండి.

"దివ్యాఆపో అభియదేన మాయన్ దృతిం నశుష్కం సరసీశయానమ్।

గవామహాన మాయుర్వత్సినీనాం మండూకానాం వగ్నురత్రా సమేతి

1. Rawut, P. L. Education in ancient India, Page 3; Prakashan Kendra, Lucknow, 1975.
2. అమరసింహుడు, అమరకోశము, పుట 124, V. R. సన్స్, మద్రాసు, 1962.
3. అమరసింహుడు, Ibid, పుట 124.

యదీమేనా ఉశతో అభ్యవర్షీ త్తృష్యావతః ప్రావృష్యా గతాయామ్

అఖ్ఖలీ కృత్యాపితరం నపుత్రో అన్యో అన్యముప వదంతిమేతి

యదేషామన్యో అన్యస్యవాచం శాక్తస్యేవ వదతి శిక్షమాణః

సర్వం తదేషాం సమృధేవ పర్వయత్సువాచో వదథనాధ్యప్సు

బ్రాహ్మణాసో అతిరాత్రేన సోమే సరోనపూర్ణమభితో వదంతః

సంవత్సరస్య తదహః పరిష్ఠయ న్మండూకాః ప్రావృషీణం బభూవ॥"[1]

బి. పి. రాయ్ పై ఋక్కులలోని అర్థాన్ని ఇట్లా వివరించినాడు.

"The above verses show that vedic education was carried on verbally; but there were two methods of vedic education. In first the Rigvedic, hymns were composed and in second they were preserved. The first was based on the inward meditation, which enabled the formation of the hymns, and the second was based on the onward learning method which enabled the preservation of the hymns."[2]

ఋగ్వేదకాలంలోని విద్యా విధానం పరతత్త్వజ్ఞాన సంపాదనమే లక్ష్యంగా అవతరించింది. ఋషులు తపోయోగాలద్వారా పరతత్త్వాన్ని దర్శించి ఋక్కులలో పొందుపరచినారు. ఋగ్వేదంలో గురువును 'అగ్నిప్రచేతను'డనీ, 'విశ్వవేదు'డనీ, 'సత్యజన్ము'డనీ పేర్కొన్నట్లు బి. సిరాయ్ అభిభాషణం.

"In Rigveda Acharyaguru is called, 'Agnicheta' which means specially learned; 'Viswaveda', knowing everything, 'Satyajanma' one who knows everything that is born."[3]

---

1. Rai, B. C. History of Indian Education Page 8. Prakashan Kendra, Lucknow, 1975.
2. Rai, B. C., Ibid, Page 8
3. Rai, B. C., Ibid, Page 8

ఋగ్వేదంలో, 'ఇంద్రుడు', 'అగ్ని' అను పేర్లు ఆచార్యునికిగల జ్ఞాన క్రియాశక్తులకు సంకేతాలుగ వాడినట్లు విదితమౌతుంది.

ఋగ్వేద కాలంలో ఋషులు నడిపే గృహ పాఠశాలలుండేవి. విద్యార్థులకు గ్రాసం వాసం గురుకులంలోనే ఉన్నట్లు విదితమౌతుంది. వారి నడవడికి కఠోర మైన నియమాలుండేవి. యోగ్యతగల విద్యార్థులకే విద్య పరిమితమై ఉండేది. పి. యల్. రావుత్ ఆనాటి గృహ పాఠశాలలను (domestic schools) గురించి ఇట్లా చెప్పినాడు.

"In the Rigveda era, there existed small domestic schools run by the teacher himself. The pupils would lodge and board at the house of their teacher. their mode of living was strictly guided by the prescribed disciplinary rules. Higher education was confined to those who proved worthy of it."1

ఆనాటి విద్యార్థికి గురువుగారి గృహమే విద్యాలయం. ఉపనయనం జరిగిన తరువాతనే విద్యార్థికి గురుకులంలో ప్రవేశించడానికి అర్హత ఉండేది. గురువు శిష్యుని తండ్రిలాగా కాపాడేవాడు. ఆనాడు శీలవృత్త సంపన్నుడైన వానికే గురుకులంలో ప్రవేశం దొరికేది. విద్యార్థి నడవడి సరిగాలేకపోతే అతన్ని గురుకులంనుండి బయటికి పంపించడం జరిగేది. శిష్యులందరూ బ్రహ్మచర్యాన్ని పాటించడం ముఖ్యంగా ఉండేది. సమిధలు తీసుకొనిరావడం, త్రికాల సంధ్యా వందనం, భిక్షాటనం, గురు శుశ్రూష మొదలైన నియమాలను శిష్యులు పాటించే వారు.

తొలి వేదయుగంలో, 'అనుకరణం' (Imitation). 'ధారణం' (Memorisation) అనే బోధనపద్ధతుల నెక్కువగా పాటించడం జరిగేది. గురువు చెప్పే ఋక్కులను శ్రద్ధగావిని అట్లాగే పలకడం అనుకరణం. వాటిని మనసులో ఉంచుకొని అవసరమైనప్పుడు ఒప్పచెప్పడాన్ని 'ధారణ' అంటారు. వేదకాలంలో అనుకరణ మెట్లాజరిగేదో ఈ క్రింది ఋక్కువల్ల విదితమౌతుంది.

"యదేషా మన్యో అన్యస్య వాచం శాక్తస్యేవ వదతి శిక్షమాణః
సర్వంతదేషాం సమృధేవ సర్వయత్ సువాసో వదథ నాధ్యప్సు॥"2

1. Rawut. P. L., op. cit, Page 3
2. సుబ్బారావు. మిక్కిలినేని. ఋగ్వేద ఆర్యులు పుట 150 – 151. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ-2, 1974.

వర్షాకాలంలో ఒక కప్పను మరొకటి అనుకరిస్తూ అరవడం ఋగ్వేదకాలపు గురు శిష్యుల పాఠంతో పోల్చడం జరిగింది. గురువు స్వరయుక్తంగా మంత్రాన్ని ఒక్కసారి చదివితే శిష్యులు దాన్ని రెండుమార్లు పలుకుతారు. ఈవిధంగా క్రమంగా పునరుచ్చారణ చేయడంవల్ల విద్యార్థులకు వేదం కంఠస్థమయ్యేది. వేద పఠనంలో ధ్వనులనూ ( sounds ), పదాలనూ (words) గురించి శ్రద్ధవహించడం జరిగేది. ఒక్కసారి వింటేచాలు ఋక్కులను నేర్చుకొనే విద్యార్థులు నాడుండే వారు. వారిని, 'శ్రుతధరు'లని పేర్కొనినారు.

"There were such students, who remembered the hymns by hearing only once and they were called Shrutdhars "1

వేదపఠనంలో పదపఠనం, క్రమపఠనం మొదలైన పద్ధతులుండేవి. " అగ్ని మీళే పురోహితమ్"2 అనే మంత్రభాగంలోని ఒక్కొక్క పదాన్ని 'అగ్నిమ్ ఈళే పురోహితమ్' అని విడదీసి పలకడం పదపద్ధతి. పై మంత్ర భాగంలోని రెండు పదాలను కలిపి పలుకుతూ, మొదటి పదాన్ని వదలి తరువాత రెండు పదాలను కలుపుకొంటూ—"అగ్నిమీళే ఈళే పురోహితమ్" అని పలకడం క్రమపద్ధతి అంటారు.

తొలివేదయుగంలో మతసంబంధమైన పాఠ్యాంశాలూ, వ్యాకరణమ్, శిక్ష, కల్పమూ, జ్యోతిషమూ, ఛందస్సు, నిరుక్తం, తర్కం, వేదాంతం మొదలైనవి పాఠ్యాంశాలుగ ఉండేవి. విద్యార్థులు వాటిని స్వాధ్యాయం (Self Study), మననం (Meditation), అనే పద్ధతులద్వారా అభ్యసించడం జరిగేది.

వేదకాలంలో విదుషీమణులున్నారని చెప్పడానికి ఆధారం ఋగ్వేదం. యజ్ఞయాగాదులు జరుగునప్పుడు స్త్రీలుకూడా పాల్గొనడంవల్ల వారు వేదాన్ని అధ్యయనం చేయవలసి ఉండేది. వేదకాలంనాటి విదుషీమణులను గురించి మల్లాది సూర్య నారాయణగారి క్రింది విధంగా చెప్పినారు. "వేద విద్యాభిలాషలై మంత్రదర్శనమున భరత ఖండమునకు ఖ్యాతి తెచ్చిన స్త్రీ రత్నముల నొక్కచో చేర్చి ఆనందింప వచ్చునుగదా. వారు రోమశ, వాగ్దేవి, జుహూదేవి, సరమ, లోపాముద్ర, శ్రద్ధ,

1. Rai, B. B., op. cit, Page9
2. పల్లయ్యశాస్త్రి, బంకుపల్లె. ఆంధ్రవేదములు పుట 1. ప్రథమాష్టకము ప్రథమాధ్యాయము ఋక్కు 1. వినయాశ్రమం. పొన్నూరు 1940.

అదితి, శిఖండిని, విశ్వవార, ఇంద్రమాత, సర్పరాజి, శచి, ఘోష, సూర్యరాత్రి, దక్షిణ, ఇంద్రాణి, గోధ." 1

ఋగ్వేదకాలంలోని విద్యాలక్ష్యాన్నీ, గురుశిష్య నియమాలనూ, బోధన పద్ధతులనూ, స్త్రీ విద్యను గురించి చెప్పడం జరిగింది. ఋగ్వేదంలోని విద్యా విధానం ప్రాచీనమైంది. వేదయుగం తొలి రోజులలో మత విద్య ప్రాధాన్యం వహించినా, మలి వేదయుగంలో బ్రహ్మవిద్యకు ప్రథమస్థానం వచ్చింది. విద్యారంగంలో తొలి రోజులలో ఆచార్యుడు ప్రధానపాత్రను వహించినాడు. మలి రోజులలో విద్యార్థికి ప్రాధాన్యం ఏర్పడింది. ఆనాటి గురుకుల పద్ధతిలోని గురు శిష్యుల సన్నిహితసంబంధం విద్యార్థి యొక్క సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడింది.

## 2.2. మలివేదయుగంలో విద్యా విధానం :

మలివేదయుగం క్రీ.పూ 1000 సంవత్సరాలనుండి క్రీ.పూ 600 సంవత్సరాల దాకా విస్తరించిఉందని పి. యల్. రావుత్ చెప్పినాడు. "The Post Vedic period falls between 1000 B. C. and 600 B. C. "2 మలివేదయుగానికి ఉపనిషత్తుల యుగమని మరొక పేరు. మలివేదయుగంలోని విద్యా విధానాన్ని గురించి, తెలుసుకోవడానికి ఆధారమైన గ్రంథాలలో బ్రహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులు ముఖ్యమైనవి. వీటివల్ల ఆనాటి స్వాధ్యాయ పద్ధతి, (Methcd of Self study) గురుకుల ప్రవేశం, శిక్షణపరిమితి, ప్రాథమికవిద్య, ఉన్నతవిద్య, బోధనపద్ధతులు, గురుశిష్య సంబంధం, మొదలైన విషయాలను గ్రహించడానికి వీలుపడుతుంది.

తొలివేదయుగంలో కర్మకాండకు ప్రాధాన్య మేర్పడినందువల్ల ఋత్విజులు విద్యారంగంలో ప్రముఖపాత్రను వహించినారు. కేవల కర్మలవల్ల తాత్కాలికమైన స్వర్గాదిసుఖాలు కలుగుతాయనీ, వ్యక్తి చేసుకొన్న పుణ్యం తరిగిపోతే పునర్జన్మతప్పదనీ నమ్మకం కొందరిలో ఉన్నందువల్ల, పునరావృత్తి రహితమైన బ్రహ్మజిజ్ఞాస మేధావులలో కలిగింది. ప్రకృతి, జీవుడూ, దేవుడూ: ఈ మూడింటికీ ఉన్నసంబంధాన్ని గూర్చి ఋషులు ఆలోచించినారు, వారు దర్శించిన సత్యాన్ని మంత్రాలలో నిక్షేపించినారు,

---

1. తెలుగువిజ్ఞాన సర్వస్వము ఆరవ సంపుటము, పుట 173.
2. Rawut, P. L. op. cit, P 12.

2 2.1. బ్రాహ్మణాలు :

బ్రాహ్మణాలు వేదమంత్రాలకు వ్యాఖ్యానరూపంలో ఉండే వచన గ్రంథాలు. వీటిలో కూడా సంహితలలోలాగా విధులూ, అర్థవాదాలూ, ఉపనిషత్తులూ అనే మూడు భాగాలుంటాయి. 'విధి' అనే భాగం మానవుడనుసరించవలసిన జీవన విధానాలను గురించి తెలుపుతుంది. వ్యక్తి జీవితంలో అనుసరించవలసిన ధర్మాలను, 'అర్థవాదాలు' స్తుతి నిందారూపంలో, కథాపద్ధతిలో వివరిస్తాయి. ఉపనిషత్తులు బ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదిస్తాయి.

2.2.2. ఆరణ్యకాలు :

ఆరణ్యకాలు బ్రాహ్మణాలకనుబంధమైన గ్రంథాలు. అరణ్యాలలో అధ్యయనం చేయడంవల్ల వీటికి 'ఆరణ్యకాల'నే పేరు వచ్చింది. ఈ ఆరణ్యక గ్రంథాలను గురించి బి. సి. రాయ్ ఇట్లా వివరించినాడు.

"Aranyak Books are appendices of Brahmanas. They are at the end of each Brahman, and were written for those sanyasis who were devoted to spiritual meditation and lived in lonely forests. They deal with theoretical and philosophical aspects of rituals." 1

*2.2.3. ఉపనిషత్తులు :

'ఉప', 'ని' అనే రెండుపసర్గలతో కూడిన 'సద్' ధాతువువల్ల 'ఉపనిషత్తు' అనే శబ్దమేర్పడింది. 'ఉప' = దగ్గరగా, 'ని' = తగ్గుస్థాయిలో, 'సద్' = కూర్చుండుట అని అర్థం.

---

1. Rai, B. C , op. cit, Page 15.

* 'ఉప' ఉపయంతి ఎవరు భక్తి శ్రద్ధలతో, బ్రహ్మవిద్యను తమ స్వరూపంగానే భావించి భజిస్తారో, వారికి జన్మ జరాది అనర్థాలను 'నిశాతయతి' నిర్మూలిస్తుంది. కనుక ఉపనిషత్.

* పరబ్రహ్మ తత్త్వాన్ని, 'గమయతి' చేరుస్తుంది. సంసార కారణమైన అవిద్యను 'అవసాదయతి' నశింపజేస్తుంది. కనుక ఉపనిషత్.

— శంకరభాష్యము, తైత్తిరీయోపనిషత్ ఉపోద్ఘాతము.

* 'నిషత్' నిశాతనం, లేదా అవసాదనం, బ్రహ్మతత్త్వాన్ని ఉపనిగమనం చేసేది అనగా దగ్గరకు తీసుకొని వెళ్ళేది కనుక ఉపనిషత్.

* దీనియందే నిశ్శ్రేయసమనేది 'ఉపనిషణ్ణం' కాబట్టి బ్రహ్మవిద్యకు ఉపనిషత్తనే పేరు వచ్చింది.

, శంకరభాష్యము, ముండకోపనిషత్ ఉపోద్ఘాతం.

శిష్యునికి 'అంతేవాసి' అని పేరు. దానికీ ఇదే అర్థం. 'అంతే' అనగా దగ్గర. 'వాసి' అంటే వసించేవాడు. అరణ్యాలలో గురువుకు సమీపంలో కూర్చుండి శిష్యుడు విద్యను గ్రహించేవాడు. ముఖ్యార్థమిదే ఐనా లాక్షణికంగా దీనికి మరొక అర్థం కూడా చలామణిలో ఉంది. దాన్నిబట్టి సమీపమనగా ఆత్మ సమీపమనీ, కూర్చుండుట అనగా ఆత్మ చైతన్యాన్ని అంటిపట్టుకొనుట అనీ అర్థం. మనస్సు ఆత్మస్వరూపానికి దగ్గరగా చేరడమని అర్థం. ఇది బ్రహ్మవిద్యకే సంబంధించిన విషయం కాబట్టి ఉపనిషత్తనగా బ్రహ్మవిద్య అనే అర్థం రూఢమైంది. ఆ విద్యకూ, విద్యను బోధించే శాస్త్రానికీ ఉపనిషత్తనే పేరు వర్తిస్తుంది. ఇది చాలా వైయక్తికమూ అతి గంభీరమూ ఐన విద్య కాబట్టి ఉపనిషత్తనే మాటకు రహస్య విజ్ఞానమని మన శాస్త్రజ్ఞులు అర్థం చెప్పినారు.

ఉపనిషత్తులు ఒక కాలానికి మాత్రమే చెందినవికావు. ఆనాటి ఋషులు బ్రహ్మతత్త్వాన్ని గురించి పెద్దపెద్ద పరిషత్తులలో చర్చలు సాగించి ఆ చర్చలవల్ల తేలిన విషయాలను ఉపనిషత్తులలో పొందుపరచినారు. వారు బ్రహ్మతత్త్వాన్ని గురించి శిష్యులకు బోధించడం జరిగింది. పరలోకంలో సుఖాన్ని కలిగించేది బ్రహ్మవిద్య అనీ, అదే నిజమైన విద్య అనీ ప్రాచీనుల నమ్మకం. బ్రహ్మవిద్య నధ్యయనం చేయడానికై విద్యార్థి ఆనాడు గురువును ఆశ్రయించేవాడు. పరవిద్య నిగూఢమైంది కాబట్టి ఆచార్యుని సహాయం లేకుండా అర్థం చేసుకోవడం కష్టం. అందువల్లనే శ్రేష్ఠులైనవారి దగ్గరకువెళ్ళి ఆ బ్రహ్మవిద్యను తెలుసుకొమ్మని పెద్దలు ఆదేశించినారు. "ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్ నిబోధత."[1] అని ఉపనిషద్వాక్యం.

### 2.2.4. స్వాధ్యాయం (Self Study) :

'స్వాధ్యాయ'మనే పదానికి, "Inaudible reading, muttering prayers, study of the Vedas"[2] అనే అర్థాలున్నాయి. వేదాధ్యయనము చేసే విద్యార్థిని స్వాధ్యాయి అంటారు. స్వాధ్యాయమంటే వేదాధ్యయనమనే అర్థం

---

1. యజుర్వేదీయ కఠోపనిషత్తు తృతీయవల్లి మంత్రము 13, పుట 137.
   వి. ఆర్. సన్స్, మద్రాసు, 1954.

2. Brown, C. P., Telugu English Dictionary, Page 1384.

ప్రసిద్ధమైంది. స్వాధ్యాయానికి కొన్ని నియమాలున్నాయి. మూడుమార్లు ప్రాణాయామం చేయడం, గాయత్రిని జపించడం వాటిలో ముఖ్యమైనవి.

2.2.5. గురుకులప్రవేశం .

తొలి వేదయుగంలో లాగా, మలి వేదయుగంలో కూడా విద్యార్థి నడవడిని, ప్రతిభను పరీక్షించిన తర్వాతనే గురుకులంలో ప్రవేశించడానికి, ఆచార్యుడు శిష్యుని అనుమతించడం జరిగేది. గౌతముడు సత్యకాముని శిష్యునిగా స్వీకరించడానికి ముందు అతని వంశాన్ని, తండ్రిని గురించి అడిగినాడు. సత్యకాముడు అమ్మనడిగి చెబుతానని ఇంటికి వచ్చినాడు. ఆమెను అడిగి తెలుసుకొని ఉన్నది ఉన్నట్లు గురువుతో చెప్పినందువల్ల గౌతము డతనిని శిష్యునిగ చేర్చుకొనినాడు.

2.2.6. శిక్షణ పరిమితి :

శిక్షణ పరిమితి తొలి వేదయుగంలో లాగా ఉపనిషత్తుల యుగంలో కూడా పండ్రెండేండ్లేనని విదితమౌతుంది. శ్వేతకేతువు పండ్రెండేండ్ల వయస్సులో గురుకులంలో ప్రవేశించి ఇరువదినాలుగేండ్లకు వేదజ్ఞుడై ఇంటికి తిరిగివచ్చినట్లు ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడింది. "సహద్వాదశవర్ష ఉపేత్య చతుర్వింశతి వర్షః సర్వాన్ వేదానధీత్య మహామనా అనూచాన మానీ స్తబ్ధ ఏయాయ."1 "ఏకశతం హవై వర్షాణి మఘవాన్ ప్రజాపతౌ బ్రహ్మచర్య మువాస" అనే ఛాందోగ్యోపనిషత్తు (పుట 373) లోని వాక్యాన్నిబట్టి ఇంద్రుడు ప్రజాపతిదగ్గర నూట ఒక్క సంవత్సరాలుండి బ్రహ్మవిద్యా రహస్యాలు గ్రహించినట్లు తెలుస్తుంది.

2.2.7. బోధన ప్రణాళిక (Syllabus) :

శిష్యుడు చదువవలసిన పాఠ్యాంశాలను గురించి ఛాందోగ్యోపనిషత్తులో చెప్పడం జరిగింది. ఋగ్వేదం మొదలుకొని దేవజనవిద్యల (Fine arts) దాకా అన్ని విషయాలను ఆయా విద్యార్థులు నేర్చుకొనేవారు. ముండకోపనిషత్తులో (పుట 35) అంగిరసుడు శౌనకునితో "తత్రపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వ వేదః శిక్షాకల్పో వ్యాకరణమ్ ఛందో జ్యోతిషమ్" అని చెప్పినదాన్నిబట్టి నాలుగు వేదాలూ, శిక్ష, కల్పమూ, వ్యాకరణమూ, నిరుక్తమూ, ఛందస్సూ, జ్యోతిషమూ విద్యార్థులు నేర్వదగిన విద్యలని బోధపడుతుంది.

---

1. గోపదేవ్, op. cit, పుట 272.

2.2.8. ప్రాథమిక విద్య :

ఉపనిషత్తుల యుగంలో విద్యార్థులకు మొదట శబ్దశిక్షనూ, తరువాత అర్థ శిక్షనూ గరపటం పరిపాటిగా ఉండేది. అక్షరాలూ, ఉచ్చారణ పద్ధతులూ, ఉదాత్తానుదాత్తాది విషయాలూ, హ్రస్వదీర్ఘప్లుతాలూ, బాహ్యాంభ్యంతర ప్రయత్నాలూ శబ్దశిక్షలో ప్రధానమైనవి. అర్థశిక్షలో పఠనం, పాఠనం, పదచ్ఛేదం, అన్వయం, భావం అనే దశలు ముఖ్యమైనవి.

2.2 9. ఉన్నత విద్య :

మలి వేదయుగంలో ఆత్మసాక్షాత్కారాన్ని పొందడమే పరవిద్య లక్ష్యంగా ఉండేది. నారదుడూ, పిప్పలాదుడూ, భృగువూ, జనకుడూ మొదలైనవా రున్నత విద్య నార్జించినవారిలో ముఖ్యులు. ఉన్నత విద్యను సాధించడానికి వారికి తపస్సూ, యోగమూ సాధనాలుగ ఉపకరించినాయి. "అథ పరాయయా తదక్షర మధి గమ్యతే."1 "జ్ఞాత్వా దేవమ్ సర్వపాశాప హానిః క్షీణైః క్లేశైః జన్మ మృత్యు ప్రహాణిః"2 అను ఉపనిషద్వాక్యాలనుబట్టి ఆత్మసాక్షాత్కారాన్ని కల్గించేది పరవిద్య అనీ, దాన్ని పొందిన తరువాత ప్రాపంచికమైన బంధాలూ, జనన మరణ క్లేశమూ తొలగిపోతాయని విదితమౌతుంది. ఆత్మసాక్షాత్కారాన్ని పొందడానికి, అనువైన విషయాన్ని గ్రహించడానికి శ్రవణ మననాది దశలున్నట్లు చెప్పడం జరిగింది. శ్రవణం, మననం, నిదిధ్యాసనం అను మూడూ నిజమైన జ్ఞానాన్ని కలిగించడానికి కారణాలని చెప్పవచ్చు. బి. సి. రాయ్ శ్రవణ మననాది దశలను గురించి ఇట్లా చెప్పినాడు.

"Knowledge should be heard from the guru and then it should be meditated over, and thus through 'Nididhyasan' enlightment of the soul is the way of gaining real knowledge." 3

2.2.10. బోధనపద్ధతులు :

ఉపనిషత్తుల యుగంలో ఆచార్యులు విద్యార్థులకు విషయాన్ని బోధించడానికి కొన్ని పద్ధతులను అవలంబించినారు. ఆనాటి బోధన పద్ధతులలో ముఖ్యమైనవి.

1. అష్టోత్తరశతోపనిషత్తులు, పుట 149, వి. ఆర్. సన్స్, మద్రాసు, 1954.
2 Ibid, పుట 354.
3. Rai, B. C., op. cit, Page 5.

1. ఉపాఖ్యాన పద్ధతి.
2. సంవాద పద్ధతి,
3. ఆలంకారిక పద్ధతి.
4. చర్చా పద్ధతి.
5. గోష్ఠి పద్ధతి.
6. ప్రయోగ పద్ధతి.

వీటినిగూర్చి క్రింద వివరించడం అవసరం.

2.2 10.1. ఉపాఖ్యాన పద్ధతి :

విద్యార్థులకు విషయాన్ని కథలద్వారా బోధించడం ఉపాఖ్యాన పద్ధతి. ఈ పద్ధతివల్ల విద్యార్థులకు జ్ఞానమూ, వినోదమూ కలుగుతాయి. కఠోపనిషత్తు (పుటలు 1–111)లో నచికేతునికథ, ఛాందోగ్యోపనిషత్తు (పుటలు 65–73)లో ఉషస్తికథ, (పుటలు 180–194)లో జానశ్రుతికథ, (పుటలు 302–303)లో గాంధారవాసి పురుష దృష్టాంత కథ, (పుటలు 361–374)లో ఇంద్ర విరోచనుల కథ మొదలైన కథలున్నాయి. ఐహిక సుఖాలపై ఆశవదలిన త్యాగపరుడైన నరునికే పరమాత్మతత్త్వం గోచరిస్తుందనే నీతి నచికేతుని కథలో ఉంది. ఆపత్కాలంలో ఉచ్ఛిష్టం గ్రహించడం దోషము కాదని చాటుతుంది ఉషస్తికథ. మానవుడు వాయువులాగా అన్నింటిని లోబరచుకోవాలనే నీతిని జానశ్రుతి కథ అందిస్తుంది. శ్రద్ధాసక్తుడైన శిష్యుని విపరీత గ్రహణాన్ని పోగొట్టడం ఆచార్యుని కర్తవ్యమని బోధిస్తుంది ఇంద్ర విరోచనులకథ. గాంధారవాసి పురుష దృష్టాంత కథ అంతరార్థ ప్రధానమైంది. కొందరు వ్యక్తులు గాంధార దేశీయుని కండ్లకు గుడ్డకట్టి తీసుకొని వచ్చి నిర్మానుష్యమైన అడవిలో వదలేసినారు. అతడాత్మరక్షణకై కేకలు వేస్తుంటే ఒక మహాపురుషుడు అతని దగ్గరకు వచ్చినాడు. అతని బంధనాలను తొలగించినాడు. తాను చేరవలసిన స్థానంవైపు దారి చూపించినాడు. అతడాదిక్కు ననుసరించివెళ్ళి స్వస్థలాన్ని చేరుకొనినాడు. ఇది బాహ్యార్థం మానవుడు 'సత్' నుండి రావడం, సంసారమనే అరణ్యంలో చేరడం, మోహమనే వస్త్రం అతని కన్నులకప్పి ఉండడం, భార్యా బిడ్డలూ మొదలైన బంధాలలో చిక్కుకోవడం, పుణ్యపాపాలనేదొంగలతని ఈ లోకానికి తీసుకొనిరావడం, గురువుచూపిన గురుతును పట్టుకొని అతడు స్వస్థలాన్ని చేరుకోవడం మొదలైన విషయాలు పై కథలో గర్భితంగా ఉన్నాయి.

2.2.10.2. సంవాద పద్ధతి :

సంవాద పద్ధతి చాలా ప్రాచీనమైన బోధన పద్ధతి. సంవాదంలో కనీసం ఇద్దరు వ్యక్తులు పాల్గొనవలసి ఉంటుంది. (జీవ) ఆత్మను ఎదుటి వ్యక్తిగా భావించి సంవాద పద్ధతిలో విషయ వివరణ చేసిన సందర్భాలు ఉపనిషత్తులలో ఉన్నాయి. వాటిలో తండ్రి కొడుకులకూ, స్నేహితులకూ, భార్యా భర్తలకూ, గురు శిష్యులకూ మధ్య జరిగిన సంవాదాలున్నాయి. కేనోపనిషత్తు (పుట 15)లో "కేనేషితం పతతి ప్రేషితం మనః" అనేది మొదటి ప్రశ్న. దీనికి సమాధానంగా కేనోపనిషత్తు గురు శిష్య సంవాద రూపంలో నడిచింది. ఛాందోగ్యోపనిషత్తులో శిష్యుడు గురువును, సూక్ష్మమైన సత్తునుండి మహత్తైన ప్రపంచ మెట్లు పుట్టిందని ప్రశ్నించినప్పుడు గురువు ఆ విషయాన్ని క్రింది సంభాషణ రూపంలో ఉపదేశించడం జరిగింది.

"గురువు: (శిష్యుని చూచి) ఒక మర్రిపండును తెమ్ము.
శిష్యుడు: ఇదిగో తెచ్చితిని.
గురువు: దానిని త్రుంపుము.
శిష్యుడు: త్రుంచితిని.
గురువు; దానియందేమికలదు?
శిష్యుడు: అత్యంత సూక్ష్మములైన విత్తనములున్నవి.
గురువు: వానిలో ఒక విత్తనమును చీల్చుము.
శిష్యుడు: చీల్చితిని.
గురువు: అందేమున్నది?
శిష్యుడు: ఏమియును లేదు."[1]

ఈ సంభాషణ జరిగిన తరువాత గురువు శిష్యునికి, సూక్ష్మమునుండి పెద్ద మర్రిచెట్టు ఎట్లావచ్చిందో అట్లే అతిసూక్ష్మమైన సత్తునుండి జగత్తు ఏర్పడిందనీ, సకల జగత్తునందాత్మ ఉందనీ, అది సత్యమైందనీ, అది 'నీవే' నని ఉపదేశించినాడు. యాజ్ఞవల్క్యుడు సన్న్యాసాన్ని స్వీకరిస్తూ కాత్యాయని, మైత్రేయి అను తన ఇద్దరు భార్యలలో మైత్రేయికి సంవాద పద్ధతిలో బ్రహ్మవిద్యా రహస్యాలనుపదేశించినాడు. ఉపనిషత్తులలో నారద సనత్కుమార సంవాదం, ఆరుణి శ్వేతకేతు సంవాదం మొదలైనవి ఉన్నాయి.

---

1. తెలుగు విజ్ఞాన సర్వస్వము, 6వ సంపుటము, పుట 589.

2.2.10.3. ఆలంకారిక పద్ధతి :

ఆచార్యుడు శిష్యునికి విషయాన్ని బోధించడానికి కొన్ని అభ్యసన నియమాలను ( laws of learning ) పాటించవలసి ఉంటుంది. అభ్యసన నియమాలలో సాదృశ్యపద్ధతి (Method of comparison). భేదపద్ధతి (Method of contrast). సామీప్య పద్ధతి (Method of contiguity) ఉన్నాయి.

ఈ అభ్యసన నియమాలకూ. ఆలంకారిక పద్ధతులకూ కొంత సాదృశ్యముంది. ఉపనిషత్తులలో రూపకాలంకార మాధారంగా విషయ వివరణ చేసిన సందర్భాన్ని క్రింద పరిశీలించండి.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు ।
బుద్ధింతు సారథిం విద్ధి. మనః ప్రగ్రహ మేవచ ॥"1

(శరీరమే రథము. ఆత్మ రథి. బుద్ధియే సారథి. మనస్సు పగ్గము అని తెలుసుకో.)

"ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష ముచ్యతే ।
అప్రమత్తే న వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥"2

(ప్రణవం [ఓంకారం] ధనుస్సు. జీవుడు బాణం. లక్ష్యం బ్రహ్మం. ఆ లక్ష్యం అప్రమత్తుడైనవానిచే భేదింప తగింది. అప్పుడు జీవుడు కూడా బ్రహ్మమనే లక్ష్యంతో ఏకమవుతాడు.)

ఉపమాలంకారమాధారంగా ఉపనిషత్తులలో. విద్యార్థులకు విషయాన్ని బోధించిన సందర్భాలున్నాయి.

"అరా ఇవ రథనాభౌ సంహతా యత్రనాడ్యః ।
స ఏషోంత శ్చరతే బహుధా జాయమానః ॥"

బండి కుండలో చక్రం. ఆకులు ఇమిడి ఉందేలాగా మానవుని హృదయంలో నాడులన్నీ చేరివున్నాయి. అట్టి హృదయంనందే యోగులు పరమేశ్వరుని గుర్తిస్తారు.

"యథానద్య స్స్యందమానా సముద్రే అస్తమ్ గచ్ఛన్తి"

1. గోపదేవ్. op. cit, పుట 58 మంత్రము 3.
2. అష్టోత్తరశతోపనిషత్తులు పుట, 152 మంత్రములు (4. 6.)

"తథా విద్వా న్నామరూపా ద్విము క్తః ।
పరాత్పరం పురుషముపైతి దివ్యమ్ ।"1

ప్రవహించేనదులు నామరూపాలను వదలి సముద్రంలో కలసి పోయినట్లు, ముక్తుడైన జీవుడు అవిద్యవల్ల కలిగే నామారూపాలను త్యజించి దివ్యపురుషుని పొందుతాడని పై శ్లోకానికి అర్థం. ఉపమాలంకారమాధారంగా విషయాన్ని బోధించడం సాదృశ్యపద్ధతి (Method of Comparison) ఔతుంది.

2.2.10.4. చర్చాపద్ధతి :

"చర్చ్యతే అనయేతి చర్చా" 2 పలువురు మేధావులు కలిసి తమ భావాలను తార్కిక పద్ధతిలో వ్యక్తంచేయడం 'చర్చ'. ఛాందోగ్యోపనిషత్తులో, 'ఆత్మ' 'పరమాత్మ' వీటి అర్థాన్ని నిర్ణయించడానికై చర్చ జరిగిందని చెప్పడానికి క్రింది ఉపనిషద్వాక్యాలాధారంగా ఉన్నాయి. "ప్రాచీనశాల ఔపమన్యవః సత్యయజ్ఞః పౌలుషి రింద్రద్యుమ్నో భాల్లవేయో జనః శార్కరాక్ష్యోబుడిల అశ్వతరాశ్విస్తేహై మహాశాలా మహాశ్రోత్రియాః సమేత్య మీమాంసాం చక్రుఃకోను ఆత్మా కిం బ్రహ్మేతి"3 అచట చర్చనీయాంశం ఆత్మ పరమాత్మల విషయం. ప్రాచీన శాలుడూ, సత్యయజ్ఞుడూ, ఇంద్రద్యుమ్నుడూ, జనుడూ, బుడిలుడూ అను మహా శ్రోత్రియులు చర్చలో పాల్గొనినట్లు విదితమౌతుంది. శ్వేతాశ్వరోపనిషత్తులో కూడా అలాంటి చర్చ జరిగినట్లు చెప్పబడింది. "కిం కారణం బ్రహ్మ కుతస్స్మజాతా జీవామకేన క్వచసంప్రతిష్ఠాః అధిష్ఠితాః కేన సుఖేతరేషు వర్తామహే బ్రహ్మవిదో వ్యవస్థామ్"4 జగత్తుయొక్క సృష్టికి కారణం కాలమా? స్వభావమా? నియతియా? యదృచ్ఛయా? పంచ భూతాలా? పురుషుడా? అను అంశాలను గురించి వారు చర్చించి నారు. చర్చలో మేటి అనిపించుకొనిన వ్యక్తికి బహుమతి నివ్వడం ఆనాడుండేది. విదేహ దేశాధిపతి ఐన జనకుడు యాగంచేస్తూ అచటికి వచ్చిన బ్రాహ్మణులలో మేటి వేదవేత్త అయినవాన్ని తెలుసుకోతలచి ఒక ఉపాయము పన్నినాడు. వేయి ఆవులకు ఒక్కొక్క ఆవు కొమ్ములకు దాదాపు ఎనిమిదితులాల బంగారాన్నికట్టి వాటిని

1. అష్టోత్తరశతోపనిషత్తులు పుట 152 మంత్రములు (4. 6.)
2. అమరసింహుడు, op. cit, పుట 112.
3. గోపదేవ్, op. cit, పుట 250 మంత్రము 1.
4. అష్టోత్తరశతోపనిషత్తులు, పుట 353.

కొట్టములో ఉంచి వేదవేత్తలలో మేటి ఐనవాడు గోవులను ఇంటికి తోలుకొని పోవచ్చునని చెప్పినాడు. యాజ్ఞవల్క్యుడు ముందుకువచ్చి తన శిష్యునితో ఆవులను ఇంటికి తోలుకొనిపొమ్మని చెప్పినాడు. అచ్చటి పండితులు, యాజ్ఞవల్క్యుని వేదాంత జ్ఞానాన్ని పరీక్షించడానికి ఎన్నో ప్రశ్నలను వేసినారు. అతడు వారిని తన సమాధానాలతో నిరుత్తరులను చేసినాడు. ఈ సంఘటనను గురించి పి. ఎల్. రావుత్ ఇట్లా చెప్పినాడు.

"King Janaka invited all the Brahmins of kuru-panchala on the occasion of horse - sacrifice where in the king offered a prize of 1000 cows with horns covered with gold to the most learned scholars. Yagnavalkya appropriated the prize."[1]

2.2.10.5. గోష్ఠి పద్ధతి :

"ష్ఠాగతినివృత్తౌ గావోనానావిధావాచస్తిష్ఠన్త్యత్రేతి గోష్ఠి".[2] అని అమరం. నానావిధాలైనవాక్కులు దేనియందుంటాయో అదిగోష్ఠి. ప్రశ్నోపనిషత్తులో పలువురు పండితులు గోష్ఠిలో పాల్గొనినట్లు క్రింది ఉపనిషద్వాక్యాలవల్ల విదితమౌతుంది. "సుకేశాచ భారద్వాజః శైబ్యశ్చ సత్యకామః సౌర్యాయణీచగార్గ్యః కబంధీకాత్యాయనస్తేహైతే బ్రహ్మపరాబ్రహ్మనిష్ఠా బ్రహ్మన్వేషమాణా ఏషహవైతత్సర్వం వక్ష్యతీతితేహసమిత్పాణయో భగవంతం పిప్పలాదముపసన్నాః."[1] భరద్వాజుని కుమారుడైన సుకేశుడూ, శిబికుమారుడైన సత్యకాముడూ, సౌర్యాయణి సంతానమైన గార్గ్యుడూ, అశ్వలుని పుత్రుడు కౌశల్యుడూ, భృగుగోత్రీయుడైన వైదర్భి, కాత్యాయనుడైన కబంధీ : ఈ ఆరుగురు తపస్వులు బ్రహ్మజిజ్ఞాసపరులై సమిధలు పట్టుకొని పిప్పలాదుని దర్శించినారు. ఆ ఆశ్రమంలో వారికీ పిప్పలాదునికీ మధ్య, ప్రజాసృష్టి, ప్రాణమాహాత్మ్యం, ఆనందానుభూతి, ఓంకారోపాసన మొదలైన విషయాలపై గోష్ఠి జరిగింది.

2.2.10.6. ప్రయోగపద్ధతి :

ఒక విషయాన్ని ఇతరులకు బోధించడానికిముందు తానాచరించి ఇతరుల ముందు ప్రకాశింపజేయడం ప్రయోగం అంటారు. ఈ పద్ధతివల్ల విద్యార్థులకు విషయం

1. Rawut, P. L. op, cit, P. 20
2. అమరసింహుడు op, cit, P. 445

సులభంగా బోధపడుతుంది. కేవల సిద్ధాంతజ్ఞానం (Theoritical Knowledge) వల్ల విద్యార్థికి పరిపూర్ణమైన జ్ఞానంకలుగదు. విద్యార్థి తానుగ్రహించిన విషయాన్ని ప్రయోగపద్ధతివల్ల అనుభవానికి తెచ్చుకొంటాడు. ఉపనిషత్తులయుగంలో ప్రయోగ పద్ధతిని పాటించినారని చెప్పడానికి ఆధారాలున్నాయి. ఆచార్యుడు శిష్యునికి పరతత్త్వాన్ని ప్రయోగపూర్వకంగా బోధించిన సందర్భాన్ని పరిశీలించాలి. ఆత్మ సకల జగత్తునందు వ్యాపించి ఉన్నదని ఆచార్యుడు చెప్పగా అది ఎందుకు కనబడుట లేదని శిష్యుడు ప్రశ్నించినాడు శిష్యుని సందేహాన్ని తీర్చడానికి గురువు అతనితో ఒక ఉప్పుగడ్డను తీసుకొని రమ్మని చెప్పినాడు. శిష్యుడు తెచ్చినాడు. ఆచార్యుడు దానిని చెంబెడు నీళ్ళల్లో రాత్రివేసి ఉంచి మరునాడుదయాన్నే విద్యార్థిని తన దగ్గరకు రమ్మనినాడు. గురువు ఆజ్ఞాపించినట్లే శిష్యుడు మరునాడు వచ్చినాడు. ఉప్పుగడ్డను నీటిలోనుండి బయటికి తెమ్మని గురువు శిష్యునితో చెప్పినాడు. శిష్యుడు దానికోసం వెదకినాడు. అది చేతికి తగలలేదు. కంటికి కనిపించలేదు. నీటిలో కరిగిన ఉప్పుగడ్డను గుర్తించడానికి కన్ను ఉపకరించదసీ, మరొక ప్రమాణంవల్ల దాన్ని తెలుసుకొనవచ్చునని ఆచార్యుడు చెప్పినాడు. చెంబులోని నీటిని త్రాగిచూడుమని గురువు చెప్పిన వెంటనే శిష్యుడు త్రాగి ఉప్పగా ఉందని చెప్పినాడు. అప్పుడు గురువు శిష్యునితో, "నీటియందు ఉప్పు కలిసిపోయినది. దాన్ని నీవు కంటితో చూడలేవు చేతితో తాకలేవు. నాలుకతో మాత్రమే తెలుసుకో గలుగుచున్నావు. అట్లే శరీరంలోనే ఉన్న ఆత్మను ఇంద్రియాలతో తెలుసుకొన లేవు. మరొకవిధంగా తెలుసుకొనవచ్చు" అని పరతత్త్వాన్ని గురించి శిష్యునికి బోధించినాడు.

### 2.2.11. గురుశిష్య సంబంధం :

ఉపనిషత్తుల యుగంలో గురు శిష్యులమధ్య సన్నిహిత సంబంధముండే దని క్రింది మంత్రాలవల్ల విదితమౌతుంది. గురుశిష్యులు పఠనమునకుపక్రమించ డానికి ముందు "ఓం శన్నో మిత్రః శం వరుణః శన్నో భవత్వర్యమా। శన్న ఇంద్రో బృహస్పతిః శన్నో విష్ణు రురుక్రమః నమో బ్రహ్మణే నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి. తన్మామవతు తద్వక్తార మవతు అవతు మామ్ అవతు వక్తారమ్ ఓం శాంతిః శాంతిః శాంతిః"[1] అని పరమేశ్వరుని ప్రార్థించేవారు.

1. పండిత గోపదేవ్, తైత్తిరీయోపనిషత్తు, (ఆంధ్ర టీకాతాత్పర్యోపేతము)పు. 1.

అభివృద్ధి చెందినాయి. బ్రాహ్మణాలూ, ఆరణ్యకాలూ, ఉపనిషత్తులూ మలి వేద యుగంలో అవతరించినవే. మలి వేదయుగంలో బోధన పద్ధతులలో కూడా వైవిధ్యం వచ్చింది. పాఠ్యాంశాలలో నైపుణ్యకాముల (Specialisation)కు ప్రాధాన్య మేర్పడింది. తొలి వేదయుగంలో వృత్తి ప్రాతిపదికపై కులాలు ఏర్పడినాయి. మలి వేదయుగంలో కులాల సంఖ్య పెరిగింది. సాధారణంగా బ్రహ్మజ్ఞాన సంపాదనకు బ్రాహ్మణులకే అధికారమున్నా, క్షత్రియులలో కూడా కొందరు బ్రహ్మజ్ఞాన సంపన్నులున్నట్లు విదితమౌతుంది. క్షత్రియులు రాజనీతి శాస్త్రాన్నీ, సమరశాస్త్రాన్నీ, బ్రాహ్మణులనుండి నేర్చుకొనేవారు. ఆనాడు చాలామంది బ్రాహ్మణులు ఉపాధ్యాయ వృత్తిని అవలంబించేవారు. తొలి వేద యుగంలో స్త్రీలకు సంఘంలో సమున్నతమైన స్థానం ఉండేది. మలి వేదయుగంలో స్త్రీలకువిద్యావకాశాలు తగ్గినాయి. ఐనా మతసంబంధమైన కార్యకలాపాల్లో వారికితగిన స్థానం ఉండేది. తొలి మలి వేదయుగాలలోని విద్యాలక్ష్యం ఆత్మసాక్షాత్కారమే. గురుకులాలు విద్యాసంస్థలుగ ఉండడం, గురువును ఆదర్శప్రాయునిగ గుర్తించడం, శిష్యులు సమిధలు తీసుకొని గురువుదగ్గరకి రావడం, త్రికాల సంధ్యావందనం చేయడం, విద్యార్థులు భిక్షకు వెళ్ళడం, గురుశుశ్రూష చేయడం, గురు శిష్యులమధ్య సత్సంబంధం ఉండడం, విద్యార్థులకు తగిన వయస్సులో విద్యను ప్రారంభించడం, మానసిక సూత్రాల కనుగుణంగా విద్యాబోధన జరగడం, విద్యార్థుల నడవడికి కఠోరమైన నియమాలుండడం, విద్యార్థుల అధ్యయన కాలపరిమితి సుదీర్ఘంగా ఉండడం, తొలి మలి వేదయుగాలలోని విద్యావిధానంలో చెప్పుకోదగిన సాదృశ్యాలు.

వేదవిద్యా విధానం వ్యక్తియొక్క సమగ్రవికాసానికి తోడ్పడింది. విద్యార్థుల నడవడిని తీర్చి దిద్దడానికి ఉపకరించింది. గురుకుల సంప్రదాయం, గురుశిష్యుల సత్సంబంధం, విద్యార్థులకు పాఠ్యాంశాలను వ్యక్తిపద్ధతిని (Individualmethod) బోధించడం ఆనాటి విద్యా విధానంలోని ముఖ్యమైనగుణాలు.

మతానికి ఎక్కువ ప్రాధాన్యమివ్వడం, ప్రజలలో ఐహికదృష్టికంటే ఆముష్మికదృష్టిని ఎక్కువ కలిగించడం. మతగ్రంథాలను పరమ ప్రమాణాలుగ నమ్మడంవల్ల ప్రజలలో తార్కికశక్తి తగ్గిపోవడం, దేవజనవిద్యలపై (Finearts) న్యూనతభావం కలగడం, వివిధ అధ్యయనశాఖలమధ్య చక్కని సమన్వయం లేకపోవడం మొదలైనవి వేద విద్యావిధానంలోని లోపాలుగ పరిగణించవచ్చు.

2.3. స్మృతులలో విద్యావిధానం :

శ్రుతులలోని ధర్మాధర్మాలు సాధారణమైన వ్యక్తులకర్థమగునట్లు బోధించడానికి స్మృతివాఙ్మయ మవతరించింది. విజ్ఞాన సర్వస్వము 6 (పుట201)లో స్మృతి వాఙ్మయాన్ని గురించి ఇట్లా నిర్వచించడం జరిగింది. "వేదభిన్నమై వేదోక్త ధర్మాధర్మ ప్రతిపాదకమగు వాఙ్మయము స్మృతివాఙ్మయము." శ్రుతులనాధారం జేసుకొని స్మృతిగ్రంథాలు వెలువడినాయి. అందువల్ల స్మృతిప్రామాణ్యం వేద ప్రామాణ్యంపై ఆధారపడుతుంది. స్మృతిగ్రంథం ఒక ధర్మాన్నిగూర్చి చెప్పిందంటే దానికాధారమైన శ్రుతివాక్యం తప్పక ఉంటుంది. స్మృతులను మొదట, బ్రహ్మ తన కుమారుడైన మనువుకు ఉపదేశించినాడనీ తరువాత అతడు స్మృతులను మరీచి మొదలైన ప్రజాపతులకు చెప్పినాడనీ సంప్రదాయవాదులు నమ్మినారు. గౌతమస్మృతి పరాశరస్మృతి, మొదలైన స్మృతిగ్రంథాలాయాఋషుల పేర్లతో వ్యవహరించడం జరిగింది. విద్యార్థుల మూర్తిమత్త్వాభివృద్ధినిగురించి ముందుయుగాలలో లాగా స్మృతి యుగంలోకూడా శ్రద్ధ వహించడం జరిగింది. సంస్కృతిని రక్షించడం, వ్యాప్తి చేయడం, జరుగుతూనే వచ్చింది. ద్విజులు (బ్రాహ్మణ క్షత్రియవైశ్యులు) నిర్బంధంగా విద్య నేర్వాలని స్మృతికారులు శాసించడంవల్ల స్మృతులయుగంలో నిబద్ధ విద్యాకేంద్రాలు (Formal centres of Education) అవతరించినాయి. విద్యార్థుల పాఠ్యప్రణాళికలో సూత్రగ్రంథాలను చేర్చినారు. రేఖాశాస్త్రం, అక్షర గణితం, ఖగోళశాస్త్రం, జ్యోతిషం, వ్యాకరణం, భాషాశాస్త్రం, ఆయుర్వేదం, వాస్తువూ మొదలైన శాస్త్రాలభివృద్ధి చెందినాయి. ఐతే స్త్రీవిద్యకు ప్రోత్సాహంలేక పోవడం స్మృతులయుగంలో లోపంగా పరిగణించబడింది.

స్మృతి గ్రంథాలలో ప్రధానమైనది మనుస్మృతి. అందులో గురుశిష్యుల నియమాలనూ, ఆచార్యుడూ, గురువూ, ఉపాధ్యాయుడూ, ఋత్విజుడూ. వీరి తారతమ్యాలనూ, బ్రహ్మచారి పాటించవలసిన విధినిషేధాలనూ, మొదలైన విషయాల గురించి మనువు వివరించినాడు.

విద్యాధిష్ఠాన దేవత ఆచార్యుని సమీపించి, "విద్యా బ్రాహ్మణమేత్యాహ శేవధిష్టేఽస్మిరక్షమామ్ అసూయ కాయమామ్మాదాస్తథా స్యాంవీర్యవత్తమా"1

1. కుల్లూకభట్టు, మన్వర్థముక్తావలీసంవలితా పుట 51 శ్లోకము 114.
నిర్ణయసాగర యంత్రాలయము.

అని చెప్పినట్లు మనుస్మృతిలోఉంది. విద్య బ్రాహ్మణునికి నిధివంటిది. ఆ నిధిని రక్షించడం బ్రాహ్మణుని కర్తవ్యం. అసూయాది దోషదూషితుడైనవానికి విద్యను బోధించకూడదు. ఈ నియమాలను పాటిస్తే బలవీర్యాలు బ్రాహ్మణునికి కలుగుతాయని విద్యాధిదేవత శాసించింది. ఇది ఆచార్య నియమం.

శిష్యనియమాన్ని గురించి తెలుసుకోవడానికి మనుస్మృతిలోని క్రింది శ్లోక మాధారంగాఉంది.

"యమేవతుశుచిం విద్యాన్నియతబ్రహ్మచారిణమ్
తస్మైమాంబ్రూహి విప్రాయనిధిపాయాప్రమాదినే".1

నియతేంద్రియుడూ, శుచీ, విప్రుడూ, నిధిపాలకుడూ, ప్రమాదరహితుడూ ఐన బ్రహ్మచారికి విద్యను బోధించమని విద్యాధిష్ఠానదేవత ఆచార్యుని ఆదేశించింది.

ఆచార్యునికీ, ఉపాధ్యాయునికీ, గురువుకూ, ఋత్విజునికీ ఉండే తారతమ్యాన్ని వివరిస్తూ మనువు ఇట్లా చెప్పినాడు.

"ఉపనీయతుయః శిష్యం వేదమధ్యాపయేద్ద్విజః
సకల్పం సరహస్యంచ తమాచార్యమ్ ప్రచక్షతే".2

ఏద్విజుడైతే శిష్యునికి ఉపనయనంచేసి కల్పరహస్య సహితంగా వేదంలో ఒక శాఖను బోధిస్తాడో అతడాచార్యుడని చెప్పవలసిఉంది. ఆచార్యుడు పదవాక్య ప్రమాణజ్ఞుడు. వ్యాకరణమూ, వేదాంతమూ, తర్కమూ బాగా తెలిసినవాడు. అందువల్ల అతనికి సంఘంలో ప్రత్యేకమైన స్థానం ఆనాడు ఉండేది. వేదంలో పూర్వభాగమైన యజ్ఞవిద్యను గురించి, ఉత్తరభాగమైన ఉపనిషత్తును గురించి చెప్పడం ఆచార్యుని విధి.

వేదంలోని మంత్ర బ్రాహ్మణాల్లో ఒక భాగాన్నిగానీ, వేదాంగాలనుగానీ జీవనంకోసం బోధించేవాడుపాధ్యాయుడని క్రింది శ్లోకం చాటుతూఉంది.

"ఏకదేశంతువేదస్య వేదాంగాన్యపివాపునః
యోఽధ్యాపయతివృత్త్యర్థముపాధ్యాయఃసఉచ్యతే".3

---

1. కుల్లూకభట్టు, Ibid, పుట 52 శ్లోకము 115.
2. కుల్లూకభట్టు, Ibid, పుట 57 శ్లోకము 140.
3. కుల్లూకభట్టు, Ibid, పుట 57 శ్లోకము 142.

గర్భాధానాది సంస్కారాలను శాస్త్రోక్తంగాచేసి, అన్నంపెట్టి విద్యార్థిని పోషించే వాడు గురువని క్రింది శ్లోకంవల్ల బోధపడుతుంది.

"నిషేకాది కర్మాణియఃకరోతియథావిధి
సంభావయతిచాన్నేన సవిప్రో గురురుచ్యతే."1

ఋత్విజుని విశిష్టతను గుర్తించడానికి క్రింది శ్లోకమాధారం.

"అగ్న్యాధేయంపాకయజ్ఞానగ్నిష్టోమాదికాన్ మఖాన్
యఃకరోవృతోయస్య తస్యర్త్విగి హోచ్యతే".2

యజమానునిచే వరింపబడి ఎవడాహవనీయాది అగ్నులతయారుచేసే కర్మలనూ, పాకయజ్ఞాదులనూ, అగ్నిష్టోమాదులనూ ఆచరిస్తాడో అతడు ఋత్విజుడని విదిత మౌతుంది.

విప్రుని అధ్యయనాన్ని గురించి మనువు చెప్పిన వాక్యాలను పరిశీలించాలి. ద్విజుడధ్యయన తత్పరుడై లౌకికవైదిక ఆధ్యాత్మికరంగాలలో నిష్ణాతుడుగ ఉండడం అవసరం. అతనికి నైతికవర్తనం ప్రధానమైంది. యమసమన్వితుడైన విప్రునికి సావిత్రీ మంత్ర మొక్కటి తెలిసినాచాలు. శీలంలేనివానికి ఎన్ని వేదాలు తెలిసినా ప్రయోజనంలేదు.

అధ్యయనంలేని విప్రుడు కొయ్యతోచేసిన ఏనుగులాగా, చర్మంతో చేసిన జింకలాగా, నామమాత్రుడని క్రింది శ్లోకంవల్ల బోధపడుతుంది.

"యథాకాష్ఠమయో హస్తీ యథాచర్మమయోమృగః
యశ్చ విప్రోఽనధీయానః త్రయస్తేనామబిభ్రతి".3

ఆచార్యుడు నామమాత్రంగా ఉండడం నిరుపయోగం. శిష్యునికి జ్ఞానాన్ని ప్రసాదించడంవల్లనే ఆచార్యునికి కీర్తి కలుగుతుంది.

బ్రహ్మచారి పాటించవలసిన విధినిషేధాలను గురించి మనువు చెప్పినాడు. ఉపనయనం జరిగినతరువాత బ్రహ్మచారి గురుసాన్నిధ్యంలో నివసిస్తూ నియమాలను పాటించడం ముఖ్యం. దేవతలకూ, పితృదేవతలకూ, ఋషులకూ ఉదకదానం చేయడం అతని విధి. యజ్ఞం చేసనందువల్ల దేవతల ఋణాన్ని, సంతానోత్పత్తివల్ల

1. కుల్లూకభట్టు, Ibid, పుట 60 శ్లోకము 141.
2. " " " " 143.
3. " " " " 157.

పితృదేవతల ఋణాన్నీ, అధ్యయనంవల్ల ఋషుల ఋణాన్నీ తీర్చుకోవడం అతని కర్తవ్యం. వటువు మధువును స్వీకరించరాదు. మగువజోలికి పోకూడదు. కర్పూరం, చందనం, కస్తూరి మొదలైన వస్తువులనుపయోగించరాదు. పూలమాలలను ధరించరాదు. వటువు పన్నీటిస్నానం చేయకూడదు. కాటుకపెట్టుకోరాదు. పాదుకలు ధరించకూడదు. గొడుగు పట్టుకోకూడదు. వటుడు కామక్రోధలోభాలను దగ్గరికి రానీయరాదు నర్తనం గీతావాదనం అతనికి పనికిరావు. బ్రహ్మచారి ఒంటరిగా శయనించవలసి ఉంటుంది. అతడు రేతస్సునుచిందించకూడదు. అతనికి స్వప్నస్ఖలనం జరిగితే ప్రాయశ్చిత్తంచేసుకొనవలసిఉంది. బ్రహ్మచారి పూవులనూ, ఆవుపేడనూ, మట్టినీ, దర్భలనూ అతిగా సేకరించరాదు. ప్రశస్తులైన గృహస్థులనుండి భిక్షాన్నాన్ని సేకరించడం, గురుకులాలకు దూరంగా ఉన్నవనాలనుండి సమిధలు తెచ్చి రోజుకు రెండుమార్లు హోమంచేయడం, గురువుయొక్క ప్రేరణలేకపోయినా వేదాధ్యయనం చేయడం అతని విధులు. ఆచార్యుడుపయోగించే వాటికంటే ఉత్కృష్టమైన వేషాన్నీ, ఆహారాన్నీ బ్రహ్మచారి పరిహరించవలసిఉంది. విద్యార్థి గురుసన్నిధిలో అధ్యయనం చేస్తున్నప్పుడు కాళ్ళనూ చేతులనూ ఇష్టము వచ్చినట్లు కదిలించకూడదు. గురు నింద వినడం పాపం. అట్లు నిందించేవారినుండి వటుడు దూరంగా పోవడం మంచిది. యానాసనస్థుడైన శిష్యుడు గురువును చూడగానే దిగి నమస్కరించవలసిఉంది. శిష్యుడు గురువుయొక్క గమనాన్నీ, మాటలనూ, చేష్టలనూ, అనుకరించరాదు. శ్రీకారంచేర్చకుండా గురువుపేరుచ్చరించుట తగదు. గురువును పూజించినట్లే వటువు, గురుపత్నినికూడా పూజించవలసిఉంది.

మనువు, తన స్మృతిగ్రంథంలో అధ్యయనకాలాన్ని గురించి చెప్పినాడు. విద్యానైపుణ్యకాములు ఆసనశుద్ధినీ, శరీర శౌచాన్నీ పాటిస్తేచాలు. ఇంతకుముందు చెప్పిన నియమాలను అన్నింటినీ పాటించనవసరంలేదు. విద్యార్థికి శారీరక మానసిక పరిసరాదిశుద్ధిని ప్రసాదించడానికి పైనియమాలను మనువు విధించినట్లు విదితమౌతుంది.

శ్రుతి స్మృతుల్లోని విద్యావిధానం పురాణేతిహాసయుగంలో స్పష్టంగా బహుముఖంగా ప్రకాశించింది. విద్యావిధానం క్రమబద్ధం కావడం, వేదధర్మాలను ఆఖ్యాన ఉపాఖ్యానాలద్వారా బోధించడం, లౌకిక విద్యలకూ, పారలౌకిక విద్యకూ సముచితమైన స్థానాన్ని కలిగించడం, స్త్రీలకూ, శూద్రులకూ విద్య అందుబాటులో ఉండడం

వల్ల పురాణేతి హాసాలలోని విద్యావిధానం విలక్షణమైంది. ఆనాటి విద్యావిధానాన్ని తెలుసుకోవడానికి పురాణాలన్నింటినీ చూడనక్కరలేదు. పురాణేతిహాసవాఙ్మయాని కంతటికీ ప్రతినిధిగా భారతాన్నే తీసుకోవచ్చు. విద్యావిధానానికి సంబంధించిన అన్ని భూమికలు అందులో ఉన్నాయి. మహాభారతంలోని విద్యావిధానాన్ని వివరించడం తరువాత ప్రకరణంలోని ముఖ్యాంశం.

# 3. మహాభారతంలో విద్యావిధానం :

## 3.1. మహాభారత గ్రంథ మాహాత్మ్యం :

భారతదేశ విద్యాచరిత్రలో ధర్మశాస్త్రాల ఇతిహాసాల యుగం క్రీ.పూ 600 సంవత్సరాలనుండీ, క్రీ.పూ. 200 సంవత్సరాలదాకా విస్తరించిఉంది.1 మహాభారతం ధర్మశాస్త్రాల - ఇతిహాసాలయుగానికి చెందింది.

మహాభారతం పరిమితమైన విషయాన్ని మాత్రమే తెలియజేసే గ్రంథంకాదు అది ఒక పెద్దవిజ్ఞానభాండారం. అందులో భారతీయుల ఐహికవిద్యలకూ, ఆముష్మిక విద్యకూ సమన్వయముంది. మానవునికి, ఆధ్యాత్మిక విజ్ఞానరహస్యాలను ఇంత గొప్పగా విప్పిచెప్పగల గ్రంథం ఏ ఒక్కటిగాని విద్యాక్షేత్రంలోలేదు. అది భారతీయ సనాతనధర్మాన్ని పరిరక్షించడానికి పూనుకొన్న మహావీరుల గాథలను చాటడానికి సంకేతంగా నిలిచిన గ్రంథరాజం. అది ఒక ఇతిహాసం. భారతం, న్యాయమూ, నీతి, ధర్మమూ మొదలైన విషయాలకన్నింటికీ ప్రామాణికమై ధర్మార్థకామాలనే త్రివర్గాన్ని మానవుడు పొందడానికి కావలసిన నియమాలనందిస్తూ, అతడు తరించడానికి తగిన ఉత్తమమార్గాన్ని నిరూపిస్తూ, నరనారాయణ సరస్వతీ నామకమైన మూర్తిత్రయాన్ని వర్ణించిమానవుని అభ్యుదయ నిశ్శ్రేయసాలకు తోడ్పడుతూ ఉంది. భారత తాత్పర్యాన్ని మూడు భూమికలలో మేధావంతులు వ్యాఖ్యానించినారు. ఆ భూమికల వృత్తాంతం క్రింది శ్లోకంలో ఇట్లా చెప్పబడింది.

> "మన్వాది భారతం కేచిదాస్తీకాది తథాపరే।
> తథోపరిచరాదన్యే విప్రాః సమ్యగధీయతే ॥"2

మూడు భూమికలలో మొదటిది 'ఆస్తీకాది', రెండవది 'మన్వాది', మూడవది 'ఉపరిచరాది'. 'ఆస్తీకాది' అనగా ఐతిహాసిక లేదా చారిత్రకమైన స్థాయి. (Historical level). భారతం శ్రీకృష్ణ పాండవవీరులకు సంబంధించిన

---

1 "The period of Dharma Sastras and epics falls between 600 B. C. and B. C."
Rawut, P. L., op. cit, Page 22.

2. వ్యాసుడు, op. cit, పుట 5, శ్లోకము 52.

చరిత్ర. ఇందులో జరిగిన ప్రతి సంఘటన చారిత్రకమే అని మొదటి వాదం. రెండవది ధార్మికమైన స్థాయి. (Religious and moral level). ఈ దృష్టితో భారతాన్ని పరిశీలించడంవల్ల అందులోని నీతీ, సద్గుణ సంపత్తీ, భగవద్భక్తీ, ధర్మానుష్ఠానమూ మొదలై నవన్నీ మానసికమైన, నైతికమైన స్థాయికి చెందినట్లు బోధపడుతుంది. మూడవది నైతికాన్ని కూడా దాటిన తాత్త్విక దృక్పథం. (Transcendental level). ఈ దృష్టితో వ్యాఖ్యానిస్తే భారతంలో ప్రతి వాక్యమూ, ప్రతి పదమూ, చివరకు ప్రతి అక్షరం కూడా భావగర్భితమేననీ, ప్రతి ఒక్కటీ ఈశ్వర మాహాత్మ్యాన్ని ప్రతిబింబించే పలుకుబడే అని గ్రహించవచ్చు. ఈ మూడు భూమికల స్వరూపాన్ని చూపడానికే మూడుపేర్లు కూడా సార్థకంగా ఉన్నాయి.

నన్నయ భారతమాహాత్మ్యాన్ని గురించి ఇట్లా చెప్పినాడు.

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
ఆధ్యాత్మ విదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవి వృషభులు మహా కావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాస మనియు
పరమ పౌరాణికుల్ బహు పురాణ
సముచ్చయంబని మహిఁ గొనియాడుచుండ

వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసు
డాది ముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు."[1]

నన్నయ 'విశ్వజనీనమై' అని చెప్పడంవల్ల విశ్వమంతటా జరిగిన భారత ప్రచారాన్ని సూచించినట్లయినది.

---

1. భారతము. ఆదిపర్వము 1 ఆశ్వాసము, పద్యము 32.
Telugu Department, Osmania University, Hyderabad, 1968.

3.2. మహాభారతంలోని విద్యా సంస్థలు :

ఒక కాలానికి చెందిన ప్రజలయొక్క ఆశయాలనూ, ఆచార వ్యవహారాలనూ వేష భాషలనూ ఆనాటి విద్యా విధానాన్నిబట్టి తెలుసుకోవచ్చు. అన్ని దేశాలలో అన్ని కాలాలలో ఒకే విద్యావిధానం ఉండదు. భౌగోళిక మత రాజకీయాది పరిస్థితులను బట్టి విద్యా విధానం మారుతూ ఉంటుంది. ఒక వ్యక్తి తన ఆశయాలను సాధించడానికి ఒక ప్రదేశం అవసరం. వ్యక్తి సంఘంలో ఒకడు. సంఘాన్ని విశాలమైన అర్థంలో తీసుకొంటే అప్పుడు సంఘమే దేశమౌతుంది. జాతియొక్క ఆశయాల కనుగుణంగా జ్ఞానాన్ని ప్రసాదిస్తూ మన సంస్కృతికి ప్రతిరూపాలుగ విద్యాసంస్థలు నిలిచినాయి. విద్యా సంస్థలు రెండు విధాలు. 1. నిబద్ధ విద్యా కేంద్రాలు. (Formal Centres of Education). 2 అనిబద్ధ విద్యా కేంద్రాలు. (Informal Centres of Education).

3.2.1. నిబద్ధ విద్యా కేంద్రాలు :

కట్టుదిట్టమైన నియమ నిబంధనలతో నిర్ణీతమైన పాఠ్యాంశాలను బోధించుట కుపయోగపడు విద్యాసంస్థలకు నిబద్ధ విద్యా కేంద్రాలని పేరు. బౌద్ధ యుగంలోనే సువ్యవస్థితమైన విద్యా సంస్థలున్నట్లు పి. యల్ రావుత్ చెప్పినాడు. "The Buddhist Viharas were the educational centres Used not only for religious learning but also as the Centres for secular arts and Crafts. Painting, sculpture and architecture were also taught in these Viharas:"[1] బౌద్ధ విహారాలలో వివిధ అధ్యయనశాఖలకు వేరు వేరు అధిపతులుండేవారు. విద్యార్థులను చేర్చుకోవడానికీ, పరీక్షలను నిర్వహించడానికీ, పాఠ్య ప్రణాళికను తయారు చేయడానికీ వసతి గృహాలూ, భోజన సదుపాయాలూ, వైద్య సౌకర్యాలూ, గ్రంథాలయాలూ మొదలైన వాటికి సంబంధించిన కార్యాలను నిర్వహించడానికీ అధికారులుండేవారు. మత విద్యను మాత్రమేగాక, కళలనూ, వృత్తులనూ, నేర్పే కేంద్రాలుగ బౌద్ధ విహారాలు ప్రసిద్ధి చెందినాయి.

3.2.1.1. ఆశ్రమాలు :

'శ్రమ' అనుధాతువునకు, 'తపస్సు,' 'సేవయు,' అనే అర్థాలున్నాయి. "ఆశ్రామ్యంతి అస్మిన్ ఇతి ఆశ్రమః"2 దీనియందు వ్యక్తులు తపోయుక్తులౌతారో

1. Rawut, P. L. op. cit., Page 57
2. అమరసింహుడు. op. cit., పుట 438

అది ఆశ్రమం. ఋషులు ఆశ్రమాలలో తపస్సు చేస్తుంటారు. తపస్సు జ్ఞాన సాధనం, తపస్సంటే తీవ్రమైన ఆలోచనమే. ఆలోచనయే విద్యకు ఆది అని చెప్పవలసి ఉంది. మహాభారతంలోని ఆశ్రమాలు నిబద్ధ కేంద్రాలుగా ప్రసిద్ధి చెందినట్లు విదితమౌతుంది. సుబల మార్కండేయాది మునులు ఆయా ఆశ్రమాల నుండి ధర్మరాజు సభకు వచ్చిన వృత్తాంతాన్ని నన్నయ ఇట్లా వర్ణించినాడు.

"సుబల మార్కండేయ శునక మౌంజాయన మాండవ్య శాండిల్య మందపాల
బక దాల్భ్య రైభ్యక భాలుకి జతుకర్ణ గౌతమ కౌశిక కణ్వవత్స
సావర్ణి పర్ణాద సత్యగోపతి గోపవేష మైత్రేయ పవిత్రపాణి
ఘటజానుకాత్రేయ కఠకలాప సుమిత్ర హారీత తిత్తిరి యాజ్ఞవల్క్య
వాయుభక్ష భార్గవ వ్యాసజైమిని శుకసుమంతు పైలసువ్రతాదు
లయిన మునులు.......... ఎమ్యక్షైన ధర్మరాజు సభకు."1

సుబల మార్కండేయ శునక మౌంజాయనాది ఆశ్రమాలు మహాభారతంలో పేర్కొనబడినా విద్యా విషయాలను తెలుసుకోవడానికి శౌనకాశ్రమం, కణ్వాశ్రమం, మొదలైనవి ఆధారంగా ఉన్నాయి. ఆశ్రమాలకు మునుల పేర్లు పెట్టడం, రాజులాశ్రమాలలో ప్రవేశించు సమయంలో నిరాడంబరమైన వేషాన్ని ధరించడం వల్ల ఆనాటి విద్యా సంస్థల విశిష్టత విదితమౌతుంది. ఆశ్రమాలకు కావలసిన పాత్రలూ, భోజన సామాగ్రీ మొదలైన వాటిని రాజులు పంపేవారని క్రింది శ్లోకం వల్ల బోధపడుతుంది.

"ఆశ్రమేషు యథాకాలం చైలభాజన భోజనమ్
సదైవోపహరేద్ రాజా సత్కృత్యాభ్యర్చ్య మాన్యచ."2

శౌనకాశ్రమం నైమిశారణ్యంలో ఉంది. ఆ ఆశ్రమానికి కులపతి శౌనకుడు. ఆయన పదివేల మంది విద్యార్థుల భరణ పోషణభారాన్ని వహించేవాడు. జ్ఞానాన్నీ, సదాచారాన్నీ గురించి చర్చించడానికి శౌనకుడు సమావేశాన్ని ఏర్పాటు చేసినాడు. నిఖిల పురాణ విజ్ఞాన నిరతుడూ, శీల సంపన్నుడూ ఐన ఉగ్రశ్రవసుడా ఆశ్రమంలోని మునులకు భారత కథను వినిపించినాడు.

---

1. భారతము (ఆంధ్ర) సభాపర్వము ఆశ్వాసము పద్యము 21 పుట 55
Telugu Department, Osmania University, Hyderaban. 1968.
2. వ్యాసుడు, op. cit., పుట 1648.

కణ్వాశ్రమం ఆరణ్యక విశ్వవిద్యాలయంగా ప్రసిద్ధిచెందింది. మాలినీ దీన తీరంలోని తపోవనంలో *కణ్వాశ్రమం ఉంది. దానికి కులపతి కణ్వుడు. అచటి వాతావరణం విద్యార్జన కనుకూలమైంది. ఆకుపచ్చని తివాచీ పరచినట్లున్న పచ్చిక బయళ్ళూ, పూలతో పండ్లతో నిండి కన్నులపండువుగా ఉండే వృక్షాలూ, కలకంఠాల క్రేంకారాలూ, చిలుకల పలుకులూ, తుమ్మెదల ఝంకారాలూ అందరినీ ఆకర్షిస్తున్నాయి. చల్లని కమ్మని గాలి మెల్లగా వీస్తుంటే ఎన్నో జంతువులు జాతివైరం మాని ఆ ఆశ్రమంలో జీవిస్తున్నాయి. అచట ద్విజుల స్వాధ్యాయధ్వనులు వినిపిస్తున్నాయి. కొందరు హోతలు ఋక్కులను పదక్రమాది పద్ధతులలో పఠిస్తున్నారు. యజుర్వేద పారంగతులూ, సామవేద నిష్ణాతులూ, అధర్వ వేదతత్త్వజ్ఞులూ అయిన ద్విజులా ఆశ్రమంలో ఉన్నారు. శబ్ద సంస్కార సంపన్నులైన బ్రాహ్మణ వటువులు స్థానకరణ ప్రయత్నాలను పాటిస్తూ వేదమంత్రాలను పలుకుతూ ఉంటే ఆ ఆశ్రమం రెండవ బ్రహ్మలోకంలాగా ఉంది. ఆ ఆశ్రమంలో క్రమశిక్షా విశారదులూ, న్యాయశాస్త్రజ్ఞులూ, ఆత్మజ్ఞాన సంపన్నులూ, వేదవాక్యాలను సమన్వయం చేయగలవారూ, వేదంలోని పూర్వోత్తర భాగాలను కలుపుకొని చూడగలిగినవారూ, ఉపాసనాది విశేష కర్మలను తెలిసినవారూ, మోక్షధర్మజ్ఞులూ, పూర్వపక్షుల సిద్ధాంతాన్ని ఆక్షేపించి తమ సిద్ధాంతాన్ని స్థాపించుటలో ప్రవీణులైనవారూ, వ్యాకరణమూ, ఛందస్సూ, నిరుక్తమూ, జ్యోతిషమూ, శిక్ష, కల్పమూ తెలిసినవారూ, పదార్థతత్త్వజ్ఞులూ, శుభాశుభ కర్మలు తెలిసినవారూ, సత్త్వాదిగుణాల తత్త్వాన్ని తెలిసినవారూ, కార్యకారణజ్ఞాతలూ, పక్షులభాషలు తెలిసినవారూ, వానరుల భాషలు తెలిసినవారూ,

---

* యజ్ఞ సంస్తర విద్భిశ్చ క్రమశిక్ష విశారదైః
న్యాయతత్త్వాత్మ విజ్ఞాన సంపన్నైర్వేద పారగైః
నానావాక్య సమాహార సమవాయ విశారదైః
విశేష కార్య విద్భిశ్చ మోక్షధర్మ పరాయణైః
స్థాపనాక్షేప సిద్ధాంత పరమార్థ జ్ఞతాంగతైః
శబ్దచ్ఛందో నిరుక్తజ్ఞైః కాలజ్ఞాన విశారదైః
ద్రవ్య కర్మగుణజ్ఞైశ్చ కార్య కారణవేదిభిః
పక్షి వానరరుత జ్ఞైశ్చ వ్యాసగ్రంథ సమాశ్రితైః
నానాశాఖేషు ముఖ్యైశ్చ సమంతాదను నాదితమ్."

వ్యాస వహాస పద్ధతులలో విభిన్న శాస్త్రాలలో ప్రముఖులైనవారూ, లోకాయతిక ముఖ్యులూ అయిన ఆచార్యులున్నట్లు మహాభారతంలో వర్ణింపబడింది.

పైలుని ఆశ్రమంలో ఉదంకుడు విద్యనభ్యసించిన తీరును నన్నయ ఇట్లా వర్ణించాడు.

"గురుకులము నందు గురులకు బరిచర్యలొనర్చి తానపరిమిత నిష్ఠాపరుఁడై
జ్ఞానము వడసెను గురుదయ నణిమాది క్రాష్ట గుణములతోడన్.[1]

అపరిమితమైన నిష్ఠ, గురు శుశ్రూష విద్యార్థికి ముఖ్యమని అవి ఉన్న విద్యార్థికి గురువు దయవల్ల జ్ఞానం సిద్ధిస్తుందని దీన్నిబట్టి విదితమౌతుంది.

కచుడు, శుక్రుని ఆశ్రమంలో, నియమపరుడై గురుశుశ్రూష చేస్తూ అతని దయవల్ల సంజీవని విద్యను పొందినాడు. గురుకులాల్లోని అధ్యయన కాలపరిమితిని గురించి డా॥ ఉమామహేశ్వరరావు క్రింది విధంగా చెప్పినాడు. "గురుకులాల్లో అధ్యయనము ప్రతి సంవత్సరము సాధారణముగ శ్రావణ పూర్ణిమ (జులై - ఆగష్టు) నుండి ప్రారంభమై 4 1/2 మొదలు 5 1/2 నెలలు కాలము సాగుచుండెను.[2] కచుడు చాలా సంవత్సరాలు నిష్ఠతో గురువును సేవించినట్లు (ఆదిపర్వము 3వ ఆశ్వాసము 110వ పద్యంలో) నన్నయ వర్ణించినాడు.

తక్షశిల, మిథిల, ఉజ్జయిని మొదలైనవి భారత కాలంలోని ప్రసిద్ధి చెందిన విద్యా సంస్థలని తెలుస్తున్నది.

తక్షశిల చాలా ప్రాచీనమైన విద్యా కేంద్రం. అది గాంధార దేశానికి రాజధాని. భరతుని కుమారుడైన తక్షుని పేరుతో తక్షశిల అవతరించిదని పి.యల్. రావుత్ చెప్పినాడు. "The Ramayana mentions that it was founded by king Bharata, who named it after his son Taksha."[3]

తక్షశిలలో విద్యా విధానం విస్తృతమైంది. ఉన్నత విద్యను అభ్యసించ డానికి పొరుగు దేశాల నుండి రాజకుమారులు తక్షశిలకు వచ్చేవారు. అచట వేదాలూ, వేదాంగాలూ, ఆయుర్వేదమూ, సమరశాస్త్రమూ, ఖగోళశాస్త్రమూ, వాణిజ్య

---

1. నన్నయ ఆదిపర్వము 1వ ఆశ్వాసము 92 పద్యము.
2. తెలుగు విజ్ఞాన సర్వము, IOV పుట 104, తెలుగు భాషా సమితి, హైదరాబాదు-1965.
3. Rawut, P. L. op. cit., Page 68.

శాస్త్రమూ, జ్యోతిషం, చేతిపనులూ, విషహారిణి విద్యలు మొదలైనవి బోధించడం జరిగేది. కొందరు బ్రాహ్మణ విద్యార్థులు సమరశాస్త్రాన్ని అభ్యసించేవారు. విషహారిణి విద్యలకు తక్షశిల పేరుగాంచింది. నన్నయ (భారతం ఆది పర్వం 2వ ఆశ్వాసంలో పుట 99 పద్యము 190 లో) వర్ణించిన వృత్తాంతాన్ని బట్టి తక్షకుని విషము వల్ల వటవృక్షం భస్మమైన విషయం విదితమౌతుంది. తక్షకుడు మర్రిచెట్టును కరచినప్పుడు ఆచెట్టుపై ఆకులు కోస్తున్న బ్రాహ్మణుడు మరణించినాడు. కశ్యపుడు తన విద్యాశక్తితో మర్రిచెట్టునూ, బ్రాహ్మణున్నీ బ్రతికించినాడు. ఈ ఉదాహరణల వల్ల తక్షశిల విషహారిణి విద్యలకు ప్రసిద్ధమైందని బోధపడుతుంది.

మిథిలకు మొదటి పేరు విదేహ. మిథిల చాలా ప్రాచీనమైన విద్యాకేంద్రం. ఉపనిషత్తుల కాలంలో జనకుడిచట వేదాంత చర్చను జరిపించిన వృత్తాంతాన్ని గురించి ఇంతకు ముందు ప్రకరణంలో చెప్పడం జరిగింది.

ఉజ్జయిని ఒక ప్రత్యేక విద్యా కేంద్రం. కృష్ణబలరాములచట వేదాలూ, వేదాంగాలూ, ధనుర్వేదం, తంత్రశాస్త్రం, మన్వాది ధర్మశాస్త్రాలూ, న్యాయతర్క-రాజనీతిశాస్త్రాలూ అభ్యసించినారు. వారు సాందీపనిని సేవించిన వృత్తాంతం మహాభారతంలో ఇట్లా వర్ణింపబడింది.

"తతస్తౌ జగ్మతుస్తాత గురుం సాందీపనిమ్ పునః
గురు శుశ్రూషయాయుక్తౌ ధర్మజ్ఞౌ ధర్మచారిణౌ."[1]

సాందీపని ఆశ్రమాన్ని గురించి వాకంకర్, "ఉజ్జయిని వద్ద బయల్పడిన ప్రాచీన అవశేషాలకూ, మహాభారతంలో గంగానది లోయలో ఉన్నట్లు వర్ణించిన ప్రదేశాలకూ అత్యంత సన్నిహితంగా పోలికలుండడంవల్ల ఆ ప్రాంతం శ్రీకృష్ణుని గురువైన సాందీపని ఆశ్రమ ప్రాంతం"[2] అని తన అభిప్రాయాన్ని వెల్లడించినాడు.

3.2.1.2. పరిషత్తులు :

శిష్టులైన కొందరు వ్యక్తులు సమావేశమై తాత్త్విక ధార్మిక విషయాలను చర్చించి వాటిని గురించి సామాన్యులకు చెప్పడం భారత కాలంలో ఉండేది. అట్టి పండితుల సమూహమే పరిషత్తు అని చెప్పబడింది. ఈ పరిషత్తులు చాలా ప్రాచీన

---

1. వ్యాసుడు, op. cit., పుట 802.
2. ఈనాడు, 21.12.1979.

మైనవి. భారతంలో వర్ణింపబడిన పరిషత్తుల స్వరూపాన్ని తెలుసుకోవడానికి మనుధర్మ శాస్త్రం ఆధారంగా ఉంది.

మనువు తన ధర్మశాస్త్రంలో శిష్టులను గురించి ఇట్లా చెప్పినాడు.

"ధర్మేణాధిగతో యైస్తు వేదః సపరిబృంహణః
తేశిష్టా బ్రాహ్మణాజ్ఞేయాః శ్రుతి ప్రత్యక్షహేతవః"1

బ్రహ్మచర్యాది ఆశ్రమాలలో చెప్పిన ధర్మం ప్రకారం ఎవరిచే అంగ, మీమాంస, ధర్మశాస్త్ర పురాణాదులతో కూడిన వేదం అభ్యసింపబడుతుందో, ఆద్విజులే శ్రుతిని సాక్షాత్తుగా అనుభవానికి తెచ్చుకోవడంలో యోగ్యులు. వారు శిష్టులు. వారు శ్రుతిని చక్కగా పఠించి దాని అర్థాన్ని ఇతరులకు బోధించడంలో సమర్థులు. 'దశావర', 'త్ర్యవర' అనే పేర్లుగల పరిషత్తులున్నాయి శిష్టుల సంఖ్యను బట్టి ఈ విభజన ఏర్పడింది. పరిషత్తులు దేనిని ధర్మమని నిర్ణయించినాయో దానినే సంఘంలోని వ్యక్తులు పాటించవలసి ఉంటుంది. 'దశావర' అంటే కనీసం పదిమంది పెద్దలుండే పరిషత్తు అని అర్థం. వేదశాఖలను మూడింటిని అధ్యయనం చేసినవారు ముప్వురూ, న్యాయశాస్త్రాన్ని పఠించినవాడూ, మీమాంసాత్మక తర్కాన్ని అభ్యసించినవాడూ, నిరుక్తం తెలిసినవాడూ, మానవాది ధర్మశాస్త్రవేత్తా, బ్రహ్మచారీ, గృహస్థుడూ, వానప్రస్థుడూ అనే పదిమంది కలిసినది 'దశావర' పరిషత్తు. ఒకవేళ, 'దశావర' పరిషత్తు లేకపోయినా 'త్ర్యవర' పరిషత్తుకు ధర్మాన్ని నిర్ణయించే అధికారముంది. ఋగ్యజుస్సామవేదాలు తెలిసిన ముప్వురు సదాచార నిష్ఠులు సభ్యులుగానున్న పరిషత్తును 'త్ర్యవర'గా పేర్కొని నారు. 'దశావర', 'త్ర్యవర' పరిషత్తులు లేని పక్షంలో, ఒక్క వ్యక్తి ఐనా వేదార్థాన్ని బాగా గ్రహించి ధర్మాన్ని నిర్ణయించగలిగితే దానినే ధర్మంగా తీసుకొనవలసి ఉంటుంది. అజ్ఞులు వేయిమంది చేరినా ధర్మనిర్ణయాన్ని చేయలేరు. వ్రత నియమం లేనివారూ మంత్రవేదాధ్యయన రహితులూ, ఎందరు చేరినా అది పరిషత్తు అనిపించుకోదు. వారు చెప్పింది పాపమై చివరకు వారినే నానా విధాలుగా బాధిస్తుంది. ఈ విషయాన్ని మనువు క్రింది శ్లోకంలో చెప్పినాడు.

"అవ్రతానామ మంత్రాణాంజాతి మాత్రోప జీవినామ్
సహస్రశః సమేతానాం పరిషత్త్వం నవిద్యతే."2

---

1. కుల్లూకభట్టు, op. cit., పుట 486 శ్లో 109
2. కుల్లూకభట్టు. op. cit., పుట 486 శ్లోకము 114.

వ్రతాలను పాటించనివారూ, వేదాలను పఠించనివారూ, జాతి మాత్రోప జీవులు ఎందరు చేరినా అది పరిషత్తు అనిపించుకోదు.

నన్నయ భారతంలో వర్ణించిన విద్వత్సభలు మనువు చెప్పిన పరిషత్తుల వంటివే, నన్నయ ఈ సభలను ఇట్లా వర్ణించినాడు.

" పరమ వివేక గౌరవ విభాసిత సద్గుణపుంజ వారిజో
త్కర రుచిరంబులై సకల గమ్య సుతీర్థములై మహా మనో
హర సుచరిత్ర పావన పయః పరిపూర్ణములైన సత్సభాం
తర సరసీవనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకన్."1

3.2.1.3. అరణ్యక విద్యా సంస్థలు. (Garden Schools)

ఉన్నత విద్య నధ్యయనంచేసే విద్యార్థులానాడు ఆరణ్యక గ్రంథాలను చదువవలసి ఉండేది. వారు గురువుల నాశ్రయించి వాటిలోని రహస్యాలను తెలుసుకొనేవారు. అలాంటి విద్యాబోధన జరిగే కేంద్రాలకు అరణ్యక విద్యా సంస్థలని పేరు. మహాభారతంలో రైభవత్యుడనే ఆచార్యుడు శాస్త్రాలలోనూ, ఆరణ్యకాలలోనూ విశేష పరిశ్రమ చేసినవాడని క్రింది శ్లోకం వల్ల బోధపడుతుంది.

" తత్రైవ మహానాసీత్ బ్రాహ్మణః సంశిత వ్రతః
రైభ్యస్తపోవృద్ధః శాస్త్రే చారణ్యకే గురుః"2

రైభవత్యుడు కఠోరమైన వ్రతపాలకుడు, తపస్సంపన్నుడు. అతడు శాస్త్రాలలోనూ, ఆరణ్యకాలలోనూ ఆరితేరినవాడై సద్గురువుగ పేరుగాంచినట్లు విదితమౌతుంది.

3 2.2. అనిబద్ధ విద్యా కేంద్రాలు : (In Formal Centres of Education)

నియమ నిబంధనలను కట్టుదిట్టంగా పాటించకుండా విద్యనునేర్పే కేంద్రాలకు 'అనిబద్ధ విద్యా కేంద్రాల'ని పేరు. గృహాలూ, దేవాలయాలూ, నాటకశాలలూ, రాజశాసన ప్రదేశాలూ మొదలైనవి అనిబద్ధ విద్యాకేంద్రాలకు చెందినవే. ఇల్లు ఒక విద్యా కేంద్రమని ఇంతకుముందు చెప్పడం జరిగింది. తల్లిదండ్రులు విద్య నేర్చిన వారైతే పిల్లలకు విద్య బాగా పట్టువడుతుంది. తండ్రులు తమ పిల్లలకు శిక్షణ నిచ్చిన సంఘటనలు మహాభారతంలో ఉన్నాయి. రాజాస్థానాలూ, జాతరలు

1. నన్నయ, op. cit., 1వ ఆశ్వాసము పద్యము 24.
2. వ్యాసుడు, op. cit., శ్లోకము 38 పుట 2198.

జరిగే ప్రదేశాలూ, విపణివీధులూ, తీర్థయాత్రా స్థలాలూ మొదలైనవి విద్యార్థికి జ్ఞానాన్ని కలిగిస్తాయి. 'విద్యయే జీవితం. జీవితమే విద్య' అని విద్యావేత్తలు చెప్పినందు వల్ల జీవితంలో జరిగే ప్రతి సంఘటన విద్యార్థికి జ్ఞానాన్ని ప్రసాదిస్తుం దని చెప్పవలసి ఉంది. అనిబద్ధ విద్యాకేంద్రాలు కూడ జ్ఞానసాధనాలుగ ప్రసిద్ధి వహించినాయి.

3.3. మహాభారతంలో వివిధ విద్యలు :

సత్యాన్వేషణకుపకరించేది 'విద్య' అని మొదటి ప్రకరణంలో చెప్పడం జరిగింది. సత్యం రెండు విధాలు. ఒకటి సాపేక్షం (Relative) రెండోది నిరపేక్షమైన సత్యం (Absolute truth). సాపేక్షమైన సత్యాన్ని గురించి చెప్పేవి లౌకిక విద్యలు. నిరపేక్షమైన సత్యాన్ని గూర్చి చెప్పేది పరవిద్య. ఐహికానికి పనికివచ్చేవి లౌకిక విద్యలు. ఆముష్మికాన్ని కల్గించేది పరవిద్య అదే బ్రహ్మ విద్య. పురుషార్థాలలో ధర్మం నుండి కామం వరకు పరిమితమైనవి లౌకిక విద్యలు, మోక్షపురుషార్థాన్ని గురించి చెప్పేది బ్రహ్మవిద్య లౌకిక విద్యలు జ్ఞానాన్ని ప్రసాదించినా ఆ జ్ఞానం సాపేక్షమైంది. శరీరపాతంతో నశించేదే, జీవిత గమ్యాన్ని చేర్చేదికాదు ఒకవేళ ధర్మజ్ఞానం శరీరంతోపాటు నశించకపోయినా, అదికూడా అర్థకామాలలాగా సాపేక్షమేకాబట్టి గమ్యాన్ని చేర్చడంలో సమర్థం కానేరదు అందువల్ల గమ్యాన్ని చేర్చేది పరవిద్య అని చెప్పవలసి ఉంది. అపరవిద్యలను గురించి నారదుడు సనత్కుమారునితో ఇట్లా చెప్పినాడు. "ఋగ్వేదం భగవో ఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థ మితిహాస పురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యం రాశిం దైవం నిధిం వాకో వాక్యమేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం క్షత్రవిద్యాం నక్షత్రవిద్యాం సర్పదేవ జనవిద్యాం ఏతద్ భగవో ఽధ్యేమి"1 నారద సనత్కు-

---

1. గోపదేవ్, పండిత, ఛాందోగ్యోపనిషత్తు ఆంధ్ర-టీకా తాత్పర్యోపేతము పుట 308, మంత్రము 2, వేదానామ్ వేదమ్ (Grammar). పిత్ర్యమ్, శ్రాద్ధకల్పము. (Nacro mancy). రాశిమ్ (Arithmetic). దైవమ్ ఉత్పాతజ్ఞానము (Prediction of things). నిధి. (మహాకాలాది నిధి శాస్త్రము. (Chronology). వాకోవాక్యం. తర్కము (Dialectics). ఏకాయనం. నీతిశాస్త్రం (Ethics). దేవ విద్య (Theology). బ్రహ్మవిద్య (Phonetics Kalpa Prosody)). భూతవిద్య (Biology). క్షత్రవిద్య (Science of archery). నక్షత్రవిద్య (Astronomy). సర్పవిద్య (Study of snakevenoms).

మార సంవాదాన్ని బట్టి, సంగీతము, శిల్పము మొదలైన లలితకళలనూ, జీవ శాస్త్రం, జ్యోతిషం, సమరశాస్త్రం మొదలైన శాస్త్రాలనూ విద్యలుగనే భావించినట్లు విదితమౌతుంది. విద్యల సంఖ్యను పరిశీలిస్తే, ఆన్వీక్షకీ, త్రయీ, వార్త, దండనీతి అను నాల్గింటిని చతుర్విద్యలుగా, ఆకర్షణం (Putting an enemy in Power), స్తంభనం. (Suppression of Power), మారణం, విద్వేషణం, ఉచ్చాటనం (Driving out evil Spirits), మోహనం అనేవి షడ్విద్యలుగా, వేదాలూ, వేదాంగాలూ, పురాణ మీమాంస ధర్మ న్యాయశాస్త్రాలూ కలిపి చతుర్దశ విద్యలుగా పరిగణించడం జరిగింది. ఈ చతుర్దశ విద్యలకు ధనుర్వేద ఆయుర్వేద నీతిశాస్త్ర అర్థశాస్త్రాలను చేర్చి అష్టాదశ విద్యలని చెప్పినారు. విద్యల వృత్తాంతాన్ని తిక్కన తన భారతంలో ఇట్లా వర్ణించాడు

"వినుము ఋగ్వేదాది వేదముల్ నాలుగుఁగల్పాదులైన యంగంబులాఱు
బెరసి విద్యలు పది పేర్చు పురాణంబులనియును నొక విద్యయధిప ధర్మ
విదులు సెప్పెడు శాస్త్ర వితతి యంతయు నొక విద్య సర్వన్యాయ విస్తరంబు
నొకటి మీమాంస దానొక్కటి యిట్టులు వివరింపఁబడునాల్గు విద్యలయ్యె
వైద్య కోదండ గాంధర్వ విద్యలర్థశాస్త్రమగు నీతివిద్యతత్సహిత వృత్తి
వెలయగా (బదునెనిమిది విద్యలనవుఁడేర్పరించె జగత్త్రయహితము పొంప"1

చతుర్విద్యలనీ, షడ్విద్యలనీ, చతుర్దశవిద్యలనీ, అష్టాదశవిద్యలనీ, అరువది నాలుగు కళలనీ విభజించినా, జ్ఞానం మాత్రం అఖండం. నేడు శిల్పమను మాటకు 'శిల్పకళ' అని అర్థం. భారతంలో వాడబడిన 'శిల్ప' మనే పదానికి కర్మయందలి నైపుణ్యమని అర్థం. 'శిల్పకళ' అని అర్థంకాదు. విరటుడు నకులునితో ఇట్లా చెప్పినాడు.

" దదామియానానిధనం నివేశనం
మమాశ్వ సూతో భవితుంత్వమర్హసి
కుతోఽసి కస్యాసి కథం త్వమాగతః
ప్రబ్రూహి శిల్పం తవవిద్యతేపయత్"2

పై శ్లోకంలోని 'శిల్పం' అనే పదానికి కర్మయందలి నైపుణ్యమని అర్థం.

---

1. భారతము శాంతిపర్వము 3వ ఆశ్వాసము పద్యము 119, పుట 103. V. R. సన్స్, మద్రాసు, 1965.
2. వ్యాసుడు, op. cit., పుట 21 871.

సంగీతమొక శాస్త్రంగా, విద్యగా, కళగా చెప్పబడింది. సంగీత జ్ఞానాన్ని కలిగించడంలో అది విద్యగా, సంగీతానికి సంబంధించిన నియమాలను చెప్పినప్పుడు శాస్త్రంగా అది అనుభవానికి వచ్చినప్పుడు కళగా మారుతుంది. ప్రాచీనులు కళలనూ, శాస్త్రాలనూ విద్యలలోనే చేర్చినారు. కళలు-శాస్త్రాలనే విభాగం తరువాత వచ్చింది. అన్నింటికి మూలం జ్ఞానమేకాబట్టి, జ్ఞానాన్ని ఒక నాణెంగా భావిస్తే దానికి ఒక వైపున నున్నవి కళలుగా, రెండవ వైపున నున్నవి శాస్త్రాలుగా చెప్పవలసి ఉంది.

భారతంలో వివిధ విద్యల గురించి వేరుగా చెప్పకపోయినా కొన్ని గ్రంథాంతర సాక్ష్యాలవల్ల వర్ణవిద్య, సంపన్నులవిద్య, సామాన్యులవిద్య, పురుషుల విద్య, స్త్రీవిద్య, బాలలవిద్య, వయోజనవిద్య, సాధారణ సాంకేతిక విద్యలు, వ్యాయామవిద్య, వికలాంగులవిద్య, నీతివిద్య, మతవిద్య, అన్నింటినీ మించి బ్రహ్మవిద్య అని పలురకాల విద్యలను తెలుసుకోవచ్చు.

### 3.3.1. వర్ణ విద్య (Caste System of Education).

జాతి శ్రేయస్సును దృష్టిలో నుంచుకొని ఆర్యులు వ్యక్తులను బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులుగ విభజించినారు. విరాట్పురుషుని ముఖము నుండి బ్రాహ్మణులూ, ఊరువుల నుండి వైశ్యులూ, బాహువుల నుండి క్షత్రియులూ, పాదాలనుండి శూద్రులూ అవతరించినారని క్రింది శ్లోకాన్ని బట్టి గ్రహించవచ్చు.

"బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ బాహూరాజన్యః కృతః
ఊరూ తదస్యయ ద్వైశ్యః పద్భ్యామ్ శూద్రో అజాయత"1

శరీరంలోని అవయువాలు కొన్ని మండలాలు (Systems)గ తయారై తమ తమ పనులను ఎట్లా నిర్వర్తిస్తున్నాయో, అట్లే సంఘం కూడా ఒక పెద్ద వ్యక్తిలాంటిది కాబట్టి సంఘంలోని వ్యక్తులు తమ తమ ధర్మాలను నిర్వర్తించినట్లయితే అది అభివృద్ధి చెందుతుందని, గుణకర్మలాధారంగా వారిని విభజించడం జరిగింది. ఈ విభజన లేని రోజులలో ఒకే వ్యక్తి పురోహితుడుగా, పాలకుడుగా, వర్తకుడుగా ఉండేవాడు. ఈ వర్ణవ్యవస్థ ఏర్పడిన తొలిరోజులలో, ఒక వర్ణములోని వారు మరొక వర్ణములోనికి పోవడం జరుగుతూ ఉండేది. దాను దాను సంఘంలో కుల వ్యవస్థ పాతుకొని పోయింది.

---

1. అష్టోత్తరశతోపనిషత్తులు. పురుషసూక్తమ్ ౧౧ పుట 87 V. R. సన్స్. మద్రాసు. 1954.

3.3.1.1. బ్రాహ్మణుల విద్య :

బ్రాహ్మణులు సత్వగుణం ప్రధానంగా ఉండేవారు. వీరు శ్వేత వస్త్రాలను ధరిస్తారు. శమమూ, దమమూ, తపస్సూ, శౌచమూ, శాంతీ, ఆర్జవమూ, జ్ఞానమూ, ఆస్తిక్యమూ వీరిగుణాలు. అధ్యయన అధ్యాపన యజన యాజన దానప్రతిగ్రహాలు వీరి నిత్య ధర్మాలు. ఒక వ్యక్తి బ్రాహ్మణుడని నిర్ణయించడానికి మొదట జ్ఞానమే ప్రాతిపదికగా ఉండేది. కులాన్ని ఆధారంగా చేసుకొని ఒకవ్యక్తి బ్రాహ్మణుడని నిర్ణయించడం కులవ్యవస్థ సంఘంలో పాదుకొన్న తరువాత జరిగింది. వ్యక్తికి గుణం ప్రధానం, కులం ప్రధానం కాదని చెప్పడానికి, 'బ్రహ్మబంధూ' 'క్షత్రియబంధూ' అని కొందరిని వ్యపదేశించడమే నిదర్శనం. ఆనాడు చాలామంది బ్రాహ్మణులాచార్య పీఠాన్ని అలంకరించేవారు. వారిని రక్షించడం క్షత్రియుల కర్తవ్యం. బ్రాహ్మణులే ఆచార్యులుగాఉన్నా, జనకుడూ, అజాతశత్రువూ, అశ్వపతీ, శిబీ మొదలైన రాజర్షులు కూడా జ్ఞానోపదేశం చేయడానికి పూనుకొనినట్లు విదితమౌతుంది. బ్రాహ్మణ వటువులు ఉపనయనానికి ముందు పఠనం, లేఖనం, వ్యాకరణం నేర్చుకొనేవారు. రెండవ దశలోవారు వేదవేదాంగాల నధ్యయనం చేసేవారు. నైపుణ్యకాములైన విద్యార్థులకు ఉన్నత విద్య ఐచ్ఛికంగా ఉండేది. భూసురులలో, వేదవేదాంగాలలోనేగాక, ధనుర్విద్యలో విశారదులైన పరశురాముడూ, కృపుడూ, ద్రోణుడూ మొదలైనవారున్నారు. బ్రాహ్మణులలో కొందరు పురోహిత వృత్తిని స్వీకరించి గర్భాధానాది సంస్కారాలను జరిపిస్తుండేవారు. వారు తరువాత తమ కుమారులకు సంస్కారాలు జరిపే విధానాన్ని గురించి చెప్పేవారు. పురోహితులు యజ్ఞయాగాది కర్మలను నిర్వహించడం జరిగేది. యజ్ఞ విద్య ఉన్నతమైనదిగా భావింపబడే ఆరోజులలో ఒకే వ్యక్తి హోతగా, ఉద్గాతగా, అధ్వర్యుడుగా, కార్యకలాపాన్ని నిర్వర్తించవలసి ఉండేది. ఋక్కులను పఠిస్తూ ఆయాదేవతల నాహ్వానించడం హోత కర్తవ్యం. సామవేదంలోని మంత్రాలను గానం చేయడం ఉద్గాత వంతు. యజుస్సులు పఠిస్తూ యాగకార్యాన్ని నిర్వర్తించడం అధ్వర్యుని వంతు. 'బ్రహ్మ' అనే ఋత్విజుడు ఈ కార్యక్రమాన్ని పర్యవేక్షించేవాడు. మొదట ఒకే వ్యక్తి హోతగా, ఉద్గాతగా, అధ్వర్యుడుగా పనిచేస్తున్నా క్రీ.పూ. 1000-800 సంవత్సరాల మధ్యకాలంలో ఋత్విజులకు విడివిడిగా శిక్షణనిచ్చే ఏర్పాట్లు జరిగినాయని కీ అను విద్యావేత్త ఇట్లా చెప్పినాడు. "The Priests respectively represented

each one of the Vedas. They had separate training centres. It was so about 1000 B. C. to 800 B. C."[1] రాజసూయ యాగానికి వచ్చిన ఋత్విజులను గురించి నన్నయ చెప్పిన మాటలివి. "అనంత వేదమూర్తులైన పైలధౌమ్యులు హోతలుగా, యాజ్ఞవల్క్యుండధ్వర్యుండుగా, ద్వైపాయనుండు బ్రహ్మగా సుసాముండు ద్గాతగా........నారదాది బ్రహ్మర్షులు సదస్యులుగా భీష్మాదిరాజర్షులు సహాయులుగా సర్వక్రియా సమగ్రంబయి........సకల జనానందకరంబయి రాజసూయంబతిరమణీయంబయిన."[2] నన్నయ (ఆదిపర్వం ౧ ఆశ్వాసం 208 వ పుట 103 లో) వర్ణించిన జనమేజయుని సర్పయాగంలో శార్ఙ్గరవుడు బ్రహ్మగా, చండభార్గవుడు హోతగా, పింగళుడధ్వర్యుడుగా కౌత్సుడు ద్గాతగా వ్యాసవైశంపాయన పైలజైమిని సుమంతు శుకశ్వేతకేతు మౌద్గల్యోద్దాలక మాండవ్య కౌశికకౌండిన్యాది మునులు సదస్యులుగా వ్యవహరించినట్లు విదితమౌతుంది.

3.3.1.2. క్షత్రియుల విద్య :

"క్షతాత్ త్రాయతే క్షత్త్రః తస్యాపత్యం క్షత్త్రియః"[3] అని లింగయసూరి క్షత్రియ శబ్దాన్ని వాఖ్యానించినాడు. క్షతము నుండి రక్షించేవాడు క్షత్రుడు. అతని అపత్యం క్షత్రియుడు. క్షత్రియులు రజోగుణ ప్రధానులు. వారు రక్తాంబరాలను ధరిస్తారు. శౌర్యమూ, తేజస్సూ, ధైర్యమూ, సామర్థ్యమూ, అపలాయనమూ, దానమూ, ఈశ్వరత్వమూ క్షత్రియులకు స్వాభావికమైన గుణాలు. "ఆన్వీక్షకీ, త్రయీ, వార్త, దండనీతి"[4] విషయాలను క్షత్రియులధ్యయనం చేయడంవల్ల వారికి సాంఖ్యయోగ లోకాయతుల దర్శనాలకూ, మూడు వేదాలకూ, కృషిపశుపాలన వాణిజ్య శాస్త్రాలకూ, దండనీతికి అంటే పరిపాలన వ్యవహారాలకూ సంబంధించిన జ్ఞానం సిద్ధించేది. సమరశాస్త్రంలో వారు ప్రావీణ్యం సంపాదించవలసి ఉండేది. నన్నయ, (సభాపర్వము ౧వ ఆశ్వాసము పద్యము 26 పుట 560లోని.) "ధర్మార్థ కామంబులొండొంటి బాధింపకుండనుచితకాల విభక్తములగా లీల సేవింతె" అను మాటలను

---

1. Key, Fe. Indian Education in Ancient and latter times. P. 5. Prakashankendra, Lucknow. 1965.
2. నన్నయ, op cit. ౧వ ఆశ్వాసము పద్యము 293 పుట 634.
3. లింగయసూరి. గురుబాల ప్రబోధిక ౨ కాండము ౧ క్షత్రవర్గము పుట 468 వి. ఆర్. సన్స్, చెన్నపురి. 1962.
4. తిక్కన, op. cit., శాంతిపర్వము ౧ ఆశ్వాసము వచనము 182 పుట 19.

ఇట్టి క్షత్రియులేయే జాములలో ఏయే పనులు చేయవలసి ఉంటుదో విదితమౌతుంది. రాజు పగటిపూట ఎనిమిది జాములలో వరుసగా అంతఃపుర విషయ విచారణమూ, దండనీతి విషయమూ, స్నాన భోజనాలూ, ద్రవ్యార్జన విచారణమూ, పరాక్రమ చింతను గురించి ఆలోచించవలసి ఉంది. రాత్రి ఎనిమిది జాములలో గూఢచారి పరిశీలనమూ, భోజనమూ, శాస్త్రావలోకనమూ, గీత నృత్య వాద్య వినోదాలూ, నిద్రా, శాస్త్రచింతా, కార్యచింతా, వైదిక విషయ విచారణమూ, స్నానాది విధులూ సాగించవలసి ఉంది. ఆనాటి క్షత్రియులు సమరశాస్త్ర పారంగతులని చెప్పడానికి కురుక్షేత్ర యుద్ధమే నిదర్శనం. వారుపయోగించిన అస్త్రశస్త్రాలనూ, పన్నిన వ్యూహాలనూ గురించి సైనిక శాస్త్రమనే విద్యావిభాగంలో వివరంగా చర్చించడ మైంది.

3.3.1.3. వైశ్యుల విద్య :

వైశ్యులు పసుపురంగులో నున్న వస్త్రాలను ధరించేవారు. కృషి, గోరక్షణం, వాణిజ్యం, వైశ్యుల ధర్మాలు. వీరికి వేదవేదాంగాలతో పరిచయముంచేవాలు. ఐతే కృష్యాది శాస్త్రాలలో వీరు ప్రావీణ్యాన్ని సంపాదించవలసి ఉంది. బంగారును, రత్నాలను పరీక్షించడం, సుగంధ ద్రవ్యాలను అమ్మడం, వ్యవసాయానికి అను కూలమైన నేలలను పరిశీలించడం, ఎరువులూ, విత్తనాలూ, వివిధ కొలపాత్రలూ, మొదలైన వాటికి సంబంధించిన జ్ఞానం కలగడానికి వైశ్యులు వాణిజ్య భూగోళం, ఆర్థిక శాస్త్రం అభ్యసించేవారు. విదేశీయులతో వర్తకం సాగించడానికి వారు బహుభాషలను నేర్వవలసి ఉండేది. నన్నయ సభాపర్వము (౧ఆశ్వాసము పద్యము 44 పుట 564)లోని "మానుగ వణిజులకున్ శతైక వృద్ధి ననూనముగా ఋణములిత్తె" అనే మాటల వల్ల రాజు, వైశ్యులకు, తక్కువ వడ్డికి ఋణాల నిచ్చెడి వాడని తెలుస్తుంది.

సంస్కృత భారతం (విరాటపర్వం శ్లోకం 5 పుట 1867)లో సహదేవుడు విరటునితో చెప్పిన, "వైశ్యోఽస్మి నామ్నాహ మరిష్టనేమీ గోసంఖ్య ఆసంకురు పుంగవానామ్" అనే మాటల వల్ల వైశ్యులకు గోపాలనం వృత్తి అని విదిత మౌతుంది. వైశ్యులు వేదాధ్యయనం కోసం గురుకులాలకు వెళ్ళినా, మిగిలిన విద్యలను తల్లిదండ్రుల నుండి నేర్చుకొనడం జరిగేది.

3.3.1.4. శూద్రుల విద్య :

శూద్రులు తమోగుణభరితులు. వీరు నల్లని వస్త్రాలను ధరించేవారు. వీరికి ప్రత్యేకమైన విద్యా సంస్థలు లేవు. అగ్రవర్ణాల వారి కనుసైగలలో మెలగుతూ వారికి సేవచేయడం శూద్రులపని, నృత్య సంగీతాది కళలలోనూ, నూలువడకడం, నేయడం, రంగుల అద్దకం లాంటి వృత్తులలోనూ శూద్రులకు శిక్షణ వంశపారం పర్యంగా తల్లిదండ్రుల నుండి సంక్రమించేది. ఆయుధాలనూ, మందు సామానులనూ, రథాలను తయారు చేయడంలో శూద్రులకు నైపుణ్యముండేది.

మాన్యుల విద్య, సామాన్యుల విద్య అనే విభాగం సమాజంలోని వర్గాలను బట్టి వచ్చింది. అగ్రవర్ణాల నుండి అధమ వర్ణాలకు సంస్కృతి సంక్రమిస్తుందనే ఉద్దేశంతో ఆనాడు మాన్యుల విద్యకు ప్రాధాన్యమివ్వడం జరిగింది.

3.3.2. స్త్రీ విద్య :

మహాభారతంలో విదుషీమణులుగా, సంస్కారవతులుగా వీరమాతలుగా స్త్రీలు సాక్షాత్కరిస్తారు. వేద యుగంలో, మహిళలకు విద్యావకాశాలుండేవి. స్త్రీలకు ఉపనయనం చేయకూడదని ధర్మశాస్త్రకారులు శాసించినందువల్ల, వారికి వేదాధ్యయన యోగ్యత లేకపోయింది. ఐనా వారి గౌరవానికి మాత్రం ఏలోటూ రాలేదని చెప్ప వలసి ఉంది. మన్వర్థ ముక్తావలీసంవలిత (శ్లోకము 14 పుట 56) లోని,

"ఉపాధ్యాయాన్ద శాచార్య ఆచార్యాణాం శతం పితా
సహస్రంతు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే" అనే

శ్లోకాన్ని బట్టి పది మంది ఉపాధ్యాయులకన్న ఒక ఆచార్యుడు గొప్ప వాడనీ, నూటి మంది ఆచార్యుల కంటే తండ్రి అధికుడనీ, వేయి మంది తండ్రులకన్నా తల్లి మిన్న అని తెలుస్తున్నది, భారతంలోని బ్రహ్మ వాదినుల గురించిన శ్రీరామచౌదరి మాటలివి. "The Celebrated Brahmavadins of the Mahabharata are the daughter of Sandilya, described as brahmani who has adopted the vow of Celibacy and Purity, who has Practised Yoga, who has reached heaven, who has attained Perfection in austerity and who is an ascetic and Siva described as brahmani who has attained Perfection and who has mastered the vedas."1

1. The Cultural Heritage of India volume II Page 606. The Rama Krishna Mission Institute of Culture, Calcutta-29, 1962.

శాండిల్యుని పుత్రిక బ్రాహ్మణి బ్రహ్మచర్యాన్ని పాటించి పవిత్ర మూర్తియై యోగం అభ్యసించి స్వర్గాన్ని చేరుకొని క్రమంగా పరిశుద్ధురాలై చివరకు అపవర్గాన్ని పొందింది. స్థితప్రజ్ఞురాలుగ పేరుగాంచిన శివ ఒక బ్రహ్మవాదిని. గృహిణులైనా, భారతంలో గాంధారీ, కుంతీ, ద్రౌపదీ సావిత్రీ, దమయంతీ, శకుంతలా మొదలైన వారు ప్రవర్తించిన తీరును బట్టి వారి పై దుష్యమవగత మౌతుంది.

3.3.3. బాలల విద్య :

చిన్న వయస్సులో నున్న వారికే ఈ విద్య పరిమితం. ప్రతి బాలునిలోను కొన్ని శక్తులంతర్గతంగా ఉంటాయి. వాటిని బహిర్గతం చేయడం ఆచార్యుని కర్తవ్యం. బాలురు వినయ విధేయతలతో మెలగుచూ చెప్పిన విషయాన్ని గ్రహించడానికి సుముఖంగా ఉంటారు. కొత్త గుడ్డకు రంగు బాగుగా పట్టినట్లు పిల్లల మనస్సులలో ఉపాధ్యాయులు చెప్పే విషయాలు బాగుగా నాటుకొంటాయి. బాలురను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దాలంటే ఉపాధ్యాయులు తల్లిదండ్రులుగా, తల్లిదండ్రులు ఉపాధ్యాయులుగా మెలగవలసి ఉంటుంది. భారతంలోని సంఘటన లను బట్టి శిశువిద్యపై శ్రద్ధవహించాలనే విషయం విదితమౌతుంది. కచుడు సంజీవని విద్యను శుక్రుని గర్భంలో నున్నప్పుడే నేర్చుకొనినాడు. దీర్ఘతముడు తల్లి గర్భంలో నుండి వేదవేదాంగాలను అధ్యయనం చేసినాడు. శక్తికుమారుడు తల్లి గర్భంలో ఉన్నప్పుడే సకల వేదాల నభ్యసించినాడు, పాండురాజు కుమారులు శతశృంగంపై నున్నప్పుడే అధ్యయనం ప్రారంభించినారు. ధర్మజాదుల విద్యాభ్యాసాన్ని గురించి గురుశిష్య సంబంధం' అనే శీర్షిక క్రింద వివరంగా చర్చించడ మైంది. పిల్లల సర్వతోముఖాభివృద్ధికై వారికి ఆత్మవిశ్వాసం, ఉత్సాహం, దయ మొదలైన గుణాలు సిద్ధించేలాగా ప్రేమపూరితమైన వాతావరణంలో పాఠ్యాంశాలను బోధించవలసి ఉంటుంది.

3.3.4. వయోజన విద్య :

విద్య సాధారణంగా బాల్యకౌమార వయోదశలకు సంబంధించి ఉంటుంది. బాల్య కౌమార దశలలో విద్యనభ్యసించడానికి వీలులేనివారు వయస్సు వచ్చిన తరువాత విద్యనేర్పవలసి ఉంటుంది. జీవిత పరిసరాలకు పనికివచ్చే సామాన్య జ్ఞానాన్ని కల్గించడం, నీతిని నేర్పడం, విశ్రాంతి సమయాన్ని సద్వినియోగం చేసుకొనేలాగా వృత్తి ప్రావీణ్యాన్ని పెంపొందించడం వయోజన విద్యాలక్ష్యాలు. మహాభారతంలోని

సంఘటనలను బట్టి నాడు కూడా వయోజనుల విద్యను గురించి శ్రద్ధ వహించినారని చెప్పవలసి ఉంది. పండితులకు మాత్రమే పరిమితమైన వేదరహస్యాలను సామాన్యులకు అందించాలనే ఉద్దేశంతో ఇతిహాస పురాణాలను రచించడం జరిగింది. వేదాలలోని విషయాలను ఆఖ్యానాలాధారంగా వివరించవలసి వచ్చింది. వయోజన విద్యావ్యాప్తికి దేవాలయాల గోడలపై చెక్కిన శిల్పాలూ, చిత్రాలూ, నాటకాలూ, సూతుల ఉపన్యాసాలూ మొదలైనవి తోడ్పడినాయి. సంస్కృత భారతం (విరాటపర్వము శ్లోకము 2 పుట 1869)లోని, "క్లీబేషు బాలేషు జనేషు నర్తనే శిక్షా ప్రదానే షుచ యోగ్యతామమ." అనే శ్లోకంలో బృహన్నల, విరటునితో చెప్పిన మాటలను బట్టి ఆనాడు బాలలకూ, షండులకూ, వయోజనులకూ నర్తనాన్ని అభ్యసించే అవకాశాలున్నట్లు బోధపడుతుంది.

3.3.5.1. ఆయుర్వేదం :

ఆయుర్వేదం ఉపవేదం. ఈ శాస్త్రం వేదయుగంలోనే పుట్టింది క్రమంగా అభివృద్ధి చెందింది. మానవుడు ఆరోగ్యంగా బ్రదకడానికీ, ఆయుష్షును పెంచుకోవడానికీ ఇది ఉపకరిస్తుంది. సంస్కృత భారతం (ఉద్యోగ పర్వం పుట 2445 శ్లోకము 12)లోని- "సర్వోపకరణైర్యుక్తా వైద్యాః శాస్త్ర విశారదాః" అను శ్లోక పాదాన్ని బట్టి కురుక్షేత్ర యుద్ధ సమయంలో, శాస్త్ర విశారదులూ సర్వోపకరణ సంపన్నులూ ఐన వైద్యులు నియమింపబడినట్లు విదితమౌతుంది. ఆనాటి వైద్యుల వృత్తాంతాన్ని నన్నయ ఇట్లా వర్ణించినాడు-

"అనిశము సేవింతురెవ్విన్న నఘాయష్టాంగమైన యాయుర్వేదం
బునదక్షులైన వైద్యులు, ఘనముగననురక్తులై జగద్ధితబుద్ధిన్"[1]

ఆనాటి వైద్యులు ఆయుర్వేదానికి చెందిన అష్టాంగాలలో విశారదులని పై పద్యము వల్ల విదితమౌతుంది. అష్టాంగాలలో మొదటిది కాయ చికిత్స. ఇది రక్తపిత్తమూ, జ్వరమూ, అతిసారమూ మొదలైన వ్యాధులకు సంబంధించింది. తల్లి పాలలోగానీ, దాది పాలలోగానీ దోషాలుంటే, వాటిని పరిహరించడాన్ని వివరించేది బాలచికిత్స. గ్రహపీడన పద్ధతులను తెలిపే గ్రహ చికిత్స, ఊర్ధ్వాంగాలైన కన్నూ, ముక్కూ, చెవీ, నోరూ, తల పీటికి వచ్చే

1. సభాపర్వము ౧ ఆశ్వాసము పద్యము 34 పుట 561

రోగలక్షణాలనూ, నివారణ పద్ధతులను తెలిపేది ఊర్ధ్వాంగ చికిత్స. శరీరంలో గుచ్చుకొన్న బాణాలనూ, కురుపులలో కూడుకొన్న చెడు పదార్థాన్ని తొలగించే పద్ధతులనూ వివరించేది శల్య చికిత్స, విషజంతువుల కోరలవలన కలిగిన బాధను నివారించే పద్ధతిని తెలిపేది దంష్ట్రా చికిత్స, సహజంగా సంక్రమించే వార్ధక్యాన్ని లేదా విషప్రయోగాలవల్ల కలిగిన వార్ధక్యాన్ని తొలగించే పద్ధతులు 'జరాచికిత్స' అనే విభాగంలో వివరింపబడి ఉంటాయి. రేతోధాతువుచెడినప్పుడు, సురతంలో తృప్తినీ స్వస్థతను పొందడానికి లేదా మగతనం లేని వానికి మగతనం కల్గించడానికి చేసే చికిత్సను వృషచికిత్స అంటారు. అనాడు రసాలనూ, విషాలనూ ఉపయోగించి కొన్ని వ్యాధులను నయము చేసేవారు. శరీరంలో చెడిపోయిన భాగాలను కత్తిరించి మిగిలిన అవయవాలకు రక్షణను కల్గించేవారు. భారతదేశంలోని ప్రాచీన శస్త్ర చికిత్సాలయాలను గురించి పెల్నన్ కోలమన్ ఇట్లా చెప్పినాడు. "In India 4000 years ago operating theatres were purified with fragrant smoke Sheets were cleaned with steam and instruments boiled before use. Hospitals were filled with soothing music, perfumed flowers and decorated in attractive colours aswell as having many windows to let in sunshine. Surgeons had to keep their hands scrubed, wear white clean clothing, keep their nails short, and their mouths closed during the operations in case the breath Contaminated the wound"[1] మహాభారతంలో, మనుష్యలకు సంక్రమించే రోగాల గురించి ఇట్లా చెప్పడం జరిగింది.

" జలోదరే తృషారోగే జ్వరగండే విషూచకే
శ్విత్రకుష్ఠేఽగ్ని దగ్ధేచ సిధ్మాపస్మారయోరపి."[2]

దీన్నిబట్టి జలోదరమూ, తృషారోగమూ, గళగండమూ, విషూచికమూ, తెలుపు రోగమూ, [illegible]మూ సిధ్మమూ, అపస్మారమనే రోగాలు సంక్రమించేవని బోధపడు[illegible] [illegible]లుపయోగించి, స్త్రీలు భర్తలను తమవశంలో ఉంచుకోవాలనుకొ[illegible] [illegible] కాదని, అలా చేయడం వల్ల వారు రోగాలకు గురిఔతారని దౌ[illegible] చెప్పిన సందర్భములో ఎర్రన ఇట్లా వర్ణించినాడు.

---

1 Indian Express. P 3 2-1-1982.

2 వ్యాసుడు. op. cit, శ్లోకము 6 పుట 5235.

"మగువ యొనర్చు వశ్యవిధి మందులు మాయలు నొండు చందమై
మగనికిఁదెచ్చు రోగములు మానక మూకజడాదిభావముల్
మొగినొనరించు నద్దురితముల్ తనచేసిన చేతలై తుదిన్
జగమునకెక్కు నిందయును సద్గతి హానియు వచ్చునింతికిన్"[1]

ఆనాడు విషహారకులూ, గాయాలను నివారించే వారూ, రోగనివారకులూ, గ్రహపీడను తొలగించేవారు అనే నాలుగు రకాల వైద్యులున్నట్లు సంస్కృత భారతం (శాంతి పర్వము శ్లోకము 59 పుట 4605)లో వర్ణింపబడింది.

"ఔషధానిచ సర్వాణి మూలానిచ ఫలానిచ
చతుర్విధాంశ్చ వైద్యాన్ వై సంగృహ్ణీయాద్ విశేషతః"

రాజయక్ష్మం, కుష్ఠమూ మొదలైన భయంకరమైన వ్యాధులున్నాయి. ఇద్దరు ముద్దుగుమ్మలతో నిరంతరం రతిలో మునిగితేలి చివరకు రాజయక్ష్మంతో మరణించిన విచిత్ర వీర్యుడూ, కుష్ఠవ్యాధిచే శరీరంలోని కండలు కరిగిపోయి, రక్తము శూన్యమై, ఎముకలూ, నరాలూ, చర్మమూ మాత్రం మిగిలిన మౌద్గల్యుడూ, ఉగ్రరోగ బాధితులు. అలాంటివారు ఇంకా మహాభారతంలో కనిపిస్తారు. సంతానం లేని వారికి సంతానాన్ని కలిగించడం, వికలాంగులను సర్వాంగ సంపన్నులుగా చేయడం. ఆయుస్సును మార్చుకోవడం, వార్ధక్యాన్ని బదిలీచేయడం, పుంస్త్వాన్ని కలిగించడం. తొలగించడం, వృషణాలను మార్చడం, శరీరాన్ని ముక్కలుగాచేసి వాటిని సంధించి ప్రాణులను బ్రదికించడం, భస్మమైన ప్రాణులను మరల బ్రదికించడం ఇలాంటి సంఘటనలు మహాభారతంలో కనిపిస్తాయి. కద్రువ పెట్టిన గ్రుడ్లను పరిచారికలు నేతి కుండలలో భద్రపరచడం వల్ల వాటి నుండి కొంత కాలానికి నాగులు జన్మించడం జరిగింది. వసురాజు వీర్యాన్ని ఒక చేప త్రాగి గర్భం ధరించడంవల్ల మత్స్యగంధి మత్స్యరాజు అనేవారు జన్మించినారు. గాంధారి గర్భశకలాలను నేతి పాత్రల్లో భద్రపరచడం మూలాన కౌరవులవతరించినారు. శరద్వంతుని రేతస్సు శరస్తంబంలో పడడంచే కృపుడూ, కృపీ అనేవారు పుట్టినారు. భరద్వాజుని వీర్యాన్ని ద్రోణంలో భద్రపరచడంవల్ల ద్రోణుడు జన్మించినాడు. రేతస్సుతో కలసిన నీటిని త్రాగినందువల్ల లేడికడుపున ఋశ్యశృంగుడు పుట్టినాడు. అగ్నితో స్వాహాదేవి కలిసినందువల్ల జారిపడిన రేతస్సును రెల్లుగడ్డిలో

1. ఎఱ్ఱన, అరణ్య పర్వము op. cit., P 249.

బంగారు కుండలలో పెట్టడంవల్ల కుమారస్వామి కలిగినాడు. ఈ సంఘటనలన్నీ పిండోత్పత్తికి సంబంధించినవే. జీవశాస్త్రంలో ప్రత్యుత్పత్తి (Reproduction) కి సంబంధించినంత వరకు శుక్లకణమూ (Sperm), అండకణమూ (Egg) కలియక పోతే పిండోత్పత్తి జరగదని చెప్పబడింది. శుక్లకణమూ, అండకణమూ కలిసి నప్పుడు సంయుక్తబీజం ఏర్పడుతుంది అది పెరగడానికి అనుకూలంగా ఉండే ఏ ఉపాధిలోనైనా పిండం వృద్ధిచెందుతుంది. ఆనాడు అండాలను ఘృతకుండాలలో ఉంచడంలో ఉద్దేశం వాటి జీవశక్తిని కాపాడడమే. సంయుక్త బీజం పిండంగా అభివృద్ధి చెందడానికి ఒక ఉపాధి అవసరం. ఆ ఉపాధి లేడి గర్భం కావచ్చు. మత్స్య గర్భం కావచ్చు. శరస్తంబమైనా కావచ్చు. ద్రోణం కావచ్చు, చివరకు ఒక తామర తూడైనా కావచ్చు. ఆ ఉపాధులలో పిండం అభివృద్ధి చెందుతుంది. మునీశ్వరుల ప్రభావంతో సంతానం లేని వారికి సంతానం కలిగినట్లు చెప్పబడిన సందర్భాలు మహాభారతంలో ఉన్నాయి. చండకౌశికుడభిమంత్రించి ఇచ్చిన మామిడిపండు మహిమచే బృహద్రథునికి జరాసంధుడు జన్మించినాడు. అష్టావక్రుడు సమంగలో మునిగి తన వక్రత్వాన్ని తొలగించుకొనినాడు. రురుడు తన ఆయుస్సులో సగ మిచ్చి ప్రమద్వరను బ్రతికించుకొనినాడు. యయాతి తన వార్ధక్యాన్ని పూరునకిచ్చి, అతని యౌవ్వనాన్ని తాను గ్రహించి, కొంతకాలం సుఖమనుభవించిన తరువాత తన వార్ధక్యాన్ని తాను పొంది, కుమారునికి యౌవ్వనాన్ని ఇవ్వడం. శంతనుని చేయి తగిలితే చాలు వృద్ధుడు యువకుడుగా మారడం, ఊర్వశి శాపంవల్ల అర్జునుడు షండుడుగా కొంత కాలం గడిపి మరల మగతనాన్ని పొందడం, శివుని వరంచే అంబకు పుంస్త్వం సిద్ధించడం, స్థూలకర్ణుడనే యక్షుడు శిఖండికి తన పుంస్త్వాన్ని ఇచ్చి స్త్రీగా మారిపోవడం. గౌతముని శాపంచే వృషణాలను పోగొట్టుకొన్న ఇంద్రునికి మేష వృషణాలనతికించడం, రాక్షసులు కచుని ముక్కలుగాచేసి తోడేళ్ళకు వేసినా, కచుని శరీరాన్ని పిండిచేసి నీటకలిపినా, కాల్చి భస్మంచేసి సురతో కలిపి త్రాగించినా, సంజీవనివిద్య మహిమచే శుక్రుడు కచుని బ్రతికించడం, కశ్యపుడు తన మంత్ర బలంతో పాముకాటుచే భస్మమైన మఱ్ఱిచెట్టునూ, బ్రాహ్మణునీ బ్రతికించడం. అశ్వనీదేవతలిచ్చిన అతిరసాన్ని తిని ఉపమన్యుడు దృష్టిని పొందడం, విషాన్నాన్ని తినినా, పాములు కరచినా, భీముడు బ్రదకడం, అశ్వనీ దేవతలు జరాభార పీడితుడైన చ్యవనునికి జవ్వనాన్ని ప్రసాదించడం మొదలైన సంఘటనలు మహాభారతంలో ఉన్నాయి. రజస్సూ, వీర్యమూ కలసిన తరువాత

ఒక రాత్రి జరిగితే కలలమౌతుందని, ఐదు రాత్రులు గడిస్తే బుద్బుదంగా మారు తుందని క్రింది శ్లోకంలో చెప్పబడింది.

"జన్మప్రభృతి భూతానాం క్రియా సర్వోపలక్ష్యతే
పూర్వమేవేహ కలలే వసతేకించిదంతరమ్
తతః స పంచమేఽతీతే మాసే వాసముకల్పయత్
తతః సర్వాంగ సంపూర్ణో గర్భోపై సతు జాయతే"1

రజస్సూ, వీర్యమూ గర్భంలో ఎప్పుడు సంయోగం చెందుతాయో, అప్పటి నుండే ప్రాణుల గర్భవృద్ధి రూపక్రియలన్నీ కనిపిస్తాయి. మొదట జీవుడు కలల రూపంలో ఉంటాడు. ఐదవ నెల దాటిన తరువాత జీవుడు చైతన్యంతో పిండంలో నివసిస్తూ ఉంటాడు. తరువాత ఆ పిండం సర్వాంగ పూర్ణంగా తయారౌతుంది. భారతంలో పిండోత్పత్తికి సంబంధించిన విషయాలే గాక జీర్ణక్రియనూ, నాడుల వర్తనాన్నీ, ధాతుపోషణాన్నీ గురించి ధర్మవ్యాధుడు కౌశికునికి చెప్పినాడు. భీష్ముడు ధర్మరాజుకు ఆహారవిహార నియమాలను ఉపదేశించినాడు. మానవుడేయే మాసాలలో మాంసం తినకూడదో, తినకపోవడంవల్ల కలిగే ఫలితాలేమిటో క్రింది పద్యంలో చెప్పడం జరిగింది.

"అధిపయాషాఢ ముఖ్యంబులైన నెలలు నాలుగింటను మాంసంబు నపులకడుగు
టాయురారోగ్యబల కీర్తులను ఫలములు నాలుగింటినినిచ్చు నన్నరునకంద్రుడు."2

### 3.3.5.2. పశువిద్య : (Veterinary Education)

మన దేశంలో వ్యవసాయం ముఖ్యవృత్తి. పొలము పనులకు పశువులు పయోగపడడం, కొన్ని పాడిపశువులుండడం వల్ల, వాటి పోషణనూ, చికిత్సనూ గురించి శ్రద్ధ వహించడంవల్ల పశువైద్యం అభివృద్ధి చెందింది. రాజుల చతురంగ బలాలలో ఏనుగులనూ, గుర్రాలనూ చేర్చడం వల్ల వాటి పాలన పోషణలకు సంబంధించిన శాస్త్రాలు వృద్ధి చెందినాయి. పశువులను బలియిచ్చు సమయంలో వాటి శరీర భాగాలను వేరుచేసి మంత్రాలుచ్చరిస్తూ యజ్ఞకుండలో పడవేసేవారు. అందువల్ల వాటి శరీర నిర్మాణాన్ని తెలుసుకోవడానికి వీలుండేది. మహాభారతం

1. వ్యాసుడు, op. cit., పుట 4379.
2. తిక్కన, op. cit., అను శాసనిక పర్వము పద్యము 301 పుట 145.

లోని ఆధారాలను బట్టి ఆనాడు పశువిద్యపై శ్రద్ధవహించినారని తెలుస్తుంది. క్షత్రియుని అంగరక్షకులలో. అశ్వవైద్యులనూ, అశ్వాధికారులనూ, ఉష్ట్రాధికారులనూ, గజవైద్యులనూ, గజాధికారులనూ, గోష్ఠాధికారులనూ చేర్చినారు. ఈ పశువిద్యకు మూలపురుషుడు శాలిహోత్రుడని పి. యల్. రావుత్, "Education in Ancient India Page 37. లో") ఇట్లా చెప్పినాడు.

"Side by side with medical Science for human beings, Veterinary Education too developed Considerably. Salihotra Canbe-regarded as the origin of it" మహాభారతంలో. నకులుడు అశ్వశాస్త్రంలో. సహదేవుడు గోశాస్త్రంలో, భీముడు గజశాస్త్రంలో ప్రసిద్ధులని తెలుస్తుంది. నకులుడు తనకుగల అశ్వశిక్షణ కౌశలాన్ని గురించి ధర్మరాజుతో చెప్పిన మాటలివి.

> "గోడిగ జాతిలో గొదమ పెంటులనేర్చి. మావుల హత్తించు మార్దవంబుఁ
> ద్రాళ్ళఁబట్టింపంగఁదటియైన కొదమల, సంచంబులెటఁగి శిక్షించునేర్పు
> గళ్యాలఁబదిలంబుగాని గుఱ్ఱంబుల, గ్రొత్తముట్టునకియ్య కొలుపు వెరవు
> బెనగుహాకలముల బిరుదుతనంబులఁజలముడింపక తీర్పఁజాలుటయును
> నలవరించిన వాడలాయమున నున్నయపుడు దొడకించుకయులేని యట్లుగాగ
> మాటిమాటికిఁబరికించి మందడీలకెల్ల నూఱటయగుచు వర్తిల్లనేర్తు "1

అశ్వశాస్త్రం ప్రాచీనమైంది. అశ్వమేధయాగం చేస్తున్నప్పుడు గుర్రం యొక్క అవయవాలను వేరువేరుగా మంత్రాలను పఠిస్తూ అగ్నికుండంలో పడవేసేవారు. అందువల్ల వాటి శరీర నిర్మాణాన్ని గురించి తెలుసుకోవడానికి వీలుండేది. ఆనాడు అశ్వశాస్త్రం వద్ధిపొందడానికి కారణం రాజపోషణ. అశ్వపోషణ, శిక్షణ, చికిత్స మొదలైన విషయాలు తెలిసినవారికి రాజాదరణ దొరికేది. అంగ నిర్మాణమూ, రంగూ, మొదలైన వాటిని ఆధారంగా జేసుకొని గుర్రాలను వర్గీకరించినారు. ఎరుపు నలుపు రంగులుకల గుర్రాన్ని సారంగ మంటారు. తెలుపు నలుపు కలిసిన రంగు కలది పారావతం. విశాలమైన నొసలూ, జఘనమూ, స్కంధమూ, రొమ్మూ, పొడవూ పలుపూగలమెడా చిన్న అండకోశం ఉండేవి కాంభోజ గుర్రాలు. వీటికి వేగం ఎక్కువగా ఉంటుంది. నొసట తెల్లని మచ్చ ఉండే గుర్రాన్ని లలామమన్నారు. సైంధవజాతి గుర్రాలకు మెడ పొడవుగా ఉంటుంది. కన్నులు పెద్దవి, మూత్రేంద్రియం పొడవుగా ఉంటుంది. వీటికి జూలు బాగుగా పెరిగి ఉంటుంది. పద్మక్రౌంచ వర్ణంగల గుర్రాలూ, బాహ్లికదేశపు గుర్రాలూ అని

ఇంకా కొన్ని జాతులున్నాయి. గుర్రాల ప్రతి కదలికకూ అర్థముంటుంది. సకిలించడంలో, గిట్టల నేలపై కొట్టడంలో, కాళ్ళను జాడించడంలో, ప్రతి చేష్టకూ అర్థముంటుంది. దాన్ని కనిపెట్టగల శక్తి నకులునికి ఉంది. అతడు దామగ్రంథి అను పేరుతో విరటుని కొలువులో చేరినాడు. నకులునిలాంటి వారుంచడం వల్లనే ఆనాడు అశ్వశాస్త్రం బాగుగా వృద్ధిచెందింది. సహదేవునికి గోవులను పోషించే పద్ధతులు, వాటి చికిత్స విధానం తెలిసినట్లు క్రింది మాటలవల్ల బోధపడుతుంది. "నాచేతం గ్రేపులు పురాణించుటంజేసి కొండొక కాలంబునన కదుపులంబెనుచు నేనగుననిక్కై కానిన యాబోతు పంచితంబు మూర్కొనినను దైగాలి వీచినను గొడ్డునకైనం జూలునిలుచు నుంగిడి యదురు ద్రిక్కయనువానికి నాపేరు సెప్పినం జూలు మటియునుఁబసికివలయు తెఱంగులెల్ల నెఱుంగుదు."[1]

సంస్కృత భారతం (కర్ణపర్వము. శ్లోకము 46 పుట 3924) లోని శ్లోకాన్ని బట్టి, భీమునికి ఏనుగుల మర్మస్థానాలకు చెందిన జ్ఞానమున్నట్లు విదితమౌతుంది.

" దంతవేష్టే షునేత్రేషుకుంభేషుచకటేషుచ
మర్మస్వపిచ మర్మజ్ఞస్తాన్ నాగానవధీద్ బలీ "

ఆనాడు పశువిద్యను బోధించడానికి ప్రత్యేక సంస్థలు లేకపోయినా వంశ పారంపర్యంగా ఈ విద్య సంక్రమించేదని తెలుస్తున్నది.

### 3 3.6. సైనిక విద్య. (Military Education) :

ధర్మాన్ని స్థాపించడానికి క్షత్రియులు, దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించవలసి ఉంటుంది. దుష్టశక్తులను తొలగించడానికి క్షత్రియులకు యుద్ధనైపుణ్యం అవసరం. అది భారత వీరుల ప్రవృత్తిలో మనకు గోచరిస్తుంది. యుద్ధనైపుణ్యం కలగడానికి క్షత్రియులు అస్త్రశస్త్రాలకు సంబంధించిన విద్యను అధ్యయనం చేయవలసి ఉంటుంది. సమరవిద్య సైనికవిద్య అనేపదాలు ఇంచుమించు సమానార్థకాలే. సమర శాస్త్రంలో శిక్షణపొందే రాజకుమారులకు ఉపనయనం చేయడం సాంప్రదాయం. ఆ సమయంలో గురువు వేదమంత్రాలను పఠిస్తుంటే శిష్యులు ధనుర్ధారులై నిలిచేవారు. క్షత్రియులు ధనుర్వేదాన్ని సంపూర్ణంగా అధ్యయనం చేయవలసి ఉంటుంది. ధనుర్వేదంలో, ఆయుధాల రకాలనూ, వివిధ వ్యూహాలను శిష్యునికి ఉండవలసిన లక్షణాలనూ, అధ్యయన పద్ధతులనూ, అస్త్రాలనూ, అస్త్రాధి

1. తిక్కన, విరాటపర్వము పద్యము 286 పుట 27.

దేవతలనూ అస్త్రప్రయోగోప సంహారాలనూ గురించిచెప్పడం జరిగింది. ధనుస్సులలో చాలారకాలున్నాయి. తాళప్రమాణమనే వింటిపొడవు తొంభై అంగుళాలు. దున్నపోతు కొమ్ములనూ, రేగుచెక్కలనూ, మేక నరాలనూ ఉపయోగించి దీనిని తయారుచేస్తారు. దూరంగాఉండే లక్ష్యాలను ఛేదించడానికి తొంభై అంగుళాల పొడవుండే విల్లు ఉపయోగపడుతుంది. స్థిరలక్ష్యాలను భేదించడానికి కార్ముకం పనికివస్తుంది. మామూలు యుద్ధాలు చేయడానికీ, వేటాడడానికీ ముప్పైఎనిమిది అంగుళాల పొడవుండే వింటిని వాడతారు. వెదురుబద్దనుగానీ, తడకొయ్యనుగానీ. రెండు అల్లెత్రాళ్ళతో బిగించి. వాటిమధ్య ఉండే ప్రదేశాన్ని ఉడుముచర్మముతోగానీ, దారాలతోగానీ నింపి ఉంటవిల్లును తయారు చేస్తారు. దీనితో రాళ్ళను చాలాదూరము చిమ్మవచ్చు. శత్రువు చాలా దగ్గరికి వచ్చినప్పుడు మూరెడు పొడవుండే వింటిని వాడడం జరుగుతుంది. దీనికి జానెడు పొడవుండే బాణాన్ని వాడతారు. ధనుస్సులలో వివిధ ప్రమాణాలున్నట్లే లక్ష్యాలలో కూడా పలురకాలున్నాయి. నీటికుండలకు తూట్లు పొడవడం సుకుమార లక్ష్యం. కొండలకు రంధ్రాలు వేయడం దాల్యం. రాక్షసుల శరీరాలలోగానీ, ఏనుగుల శరీరాలలోగానీ బాణాలు దూరేలాగా వేయడంగురులక్ష్యం. వెంద్రుక చివరి భాగంలో గురుగింజను కట్టి, దానిని వ్రేలాడదీసి వెంద్రుకను నరకడం సూక్ష్మలక్ష్యం. శబ్దాన్ని బట్టి బాణాన్ని ప్రయోగించడం, ప్రతిబింబాన్ని చూచి వస్తువును ఛేదించడం సూక్ష్మమైన లక్ష్యాలు. భారతం (ఆదిపర్వం ఆరవ ఆశ్వాసం వచనం 28 పుట 328)లో నన్నయ వర్ణించిన "రజ్జు సమాలంబితంబైన గోశృంగంబు నందేక వింశతి శరంబులు వరుస నాటవేసియు" అను మాటలను బట్టి అర్జునుడు సూక్ష్మ లక్ష్యాన్ని ఛేదించడంలో సమర్థుడని విదితమవుతుంది.

యుద్ధంలో ప్రయోగించే ఆయుధాలలో చక్రం, తోమరం, శక్తి మొదలైనవి ముక్తకాలు. పరశువూ, ముద్గరమూ, ముసలమూ, అముక్తకాలు. వీటిని చేతిలో పట్టుకొని యుద్ధము చేయవలసిందే. చేతినుండి వదలడానికి వీలులేదు.

చతురంగ బలాలకు చెందిన అక్షౌహిణీ సంఖ్యను గురించి నన్నయ ఇట్లా వర్ణించినాడు.

"వరరథమొక్కండు వారణమొక్కండు తురగముల్ మూడు కాల్వురును నేవు
రనుసంఖ్య గలయదియగుఁబత్తియద్త్రి గుణంబైన సేనాముఖంబు దీని
త్రిగుణంబు గుల్మంబు దీవి మున్మడుఁగగు గణము తద్గణము త్రిగుణితమైన
వాహినియగు దానివడిమూట గుణియింపఁబృతన నాబరగుఁదత్పృతనమూట

గుణితమైన(జమువగుస్ మఱిదాని ముమ్మడుఁగనీకినీ సమాఖ్య నొనరు
నదియుఁబదిమడుంగులైన నక్షౌహిణియౌ నిరంతర ప్రమానుసంఖ్య"1

మహాభారతంలో సైన్య వ్యూహాలను వర్ణించడం జరిగింది. నైపుణ్యంగల సేనా నాయకుడు బలాలను యథాస్థానంలో తీర్చిపెట్టవలసి ఉంటుంది. అదే బల విన్యాసం, వ్యూహం. వ్యూహాలలోని భేదాలను గురించి ఖండవల్లి లక్ష్మీరంజనం ఇట్లా చెప్పినాడు.

"వ్యూహాలలో దండం, మండలం, భోగం అసంహతం అనే భేదాలున్నాయి. బలాలను అడ్డంగా తీర్చడం దండం. చతురంగ బలాలను ఒకదానివెనుక ఒకటి నిలపడం భోగం. గుండ్రంగా తీర్చడం మండలం. బలాలను వేరువేరుగా తీర్చడం అసంహతం"2

భీష్ముని మూడోరోజు యుద్ధాన్ని తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"రేపకడ రభసమున గంగాపుత్రుడు సేనగూర్చి గరుడ వ్యూహం
బేపారదీర్చుకొని ముక్కై పొలుపును బలుపుమెఱయునట్లుగ నిలిచెన్"

"దానికి కృతవర్మద్రోణులు కన్నులయిరి. కృపాశ్వత్థామలు శిరంబయి నిలిచిరి త్రిగర్తులతోఁగూడిభూరిశ్రవశ్శల్య భగదత్తులును సౌవీర జయద్రథులును గంఠత్వంబు నొందిరి. మనుజ పతి యనుజులుందానును వెన్నయ్యె. విందాను విందులుంగాంభో జుండును శూరసేనుండునుం బుచ్ఛంబైరి మాగధకళింగాది గణంబులు దక్షిణ పక్షంబయ్యును గర్ణాటకోసల ప్రముఖనికాయంబులు వామపక్షంబయ్యును బొలిచిరి."3

భీష్ముడు కౌరవసేనాధిపతియై గరుడవ్యూహాన్నిపన్ని దానికి ముక్కు స్థానంలో పొలుపూ. బలుపూ మెరిసేలాగా నిలిచినాడు. అప్పుడు ధృష్టద్యుమ్నుడు అర్జునుని మాటపై దుర్యోధనుని సైన్యాన్ని ఎదుర్కొనడానికి తన సైన్యాన్ని అర్ధచంద్ర కారముగా తీర్చిన పద్ధతిని తిక్కన ఇట్లా వర్ణించినాడు.

1. నన్నయ, op. cit., ఆదిపర్వము ౧అశ్వాసము పద్యము 80 పుట 30
2. లక్ష్మీరంజనం, ఖండవల్లి, లక్ష్మీరంజన వ్యాసావళి. పుట 64 లక్ష్మీరంజ షష్టిపూర్తి మహోత్సవ సంఘము, హైదరాబాదు 1968.
3. తిక్కన. భీష్మపర్వము 2-3 ఆశ్వాసము పద్యము 95. వచనము 96.

"పాండవ మహాయోధుల పరివృతుండై భీమసేనుండు దక్షిణ శృంగంబున నిలిచెదదనంతరంబ విరాట ద్రుపదులును మఱియు నీలుండును గాళకరూశగణ సమేతుండై ధృష్టకేతుండును నిలిచిరి. శిఖండి సహితుండగు ధృష్టద్యుమ్నుని మున్నిడుకొని యుధిష్ఠిరుండు ఘుండాల మాలికాభీలంబుగా మధ్యప్రదేశంబలంకరించె నవ్వలన సాత్యకి మొదలుకొని యోలినకవలును ద్రౌపదేయులు నభిమన్యుండు ఘటోత్కచుండుఁగేకయ పతులుంబున్నిరి. సకల లోకంబులకు రక్షకుండైన రాజీవాక్షుండెవ్వానికి రక్షణంబొనర్చునట్టి రధికశ్రేష్ఠుండు డాపలికొమ్మై వంబన్నెఁ దక్కటి దొరలుంగలయ మోహరించిరి."[1]

భీష్ముడైదవరోజు సైన్యాన్ని మకరవ్యూహంలోపన్ని యుద్ధానికి సంసిద్ధుడైనాడు. పాండవులు శ్యేనవ్యూహంబుగా బలంబుల మోహరించినారు. ధనంజయుని ఆజ్ఞపై సేనాపతి ఆరవరోజు మకరవ్యూహాన్ని సంఘటించగా, భీష్ముడు క్రౌంచ వ్యూహాన్నిపన్ని పాండవ సైన్యాన్ని ఎదుర్కొన్నాడు. భారతంలో ఆయాసమయాలలో వజ్ర శృంగాటక కూర్మ సర్వతోభద్రాది వ్యూహాలను నిర్మించినట్లు వర్ణింపబడింది. జంతువులనూ, పక్షులనూ మొదలైన వాటిని దృష్టిలోనుంచుకొని వ్యూహాలను నిర్మించడం జరిగింది. పలురకాలైన వ్యూహాలను పన్నడం, ఛేదించడం, రాజకుమారులానాడు నేర్వవలసి ఉండేది. ఆయుధ విద్యలలో, ఆరోహణ విద్యలలో క్షత్రియులు నైపుణ్యాన్ని సంపాదించవలసి ఉంది. ధనుర్వేదాన్ని అధ్యయనంచేసే రాజకుమారులకు జ్ఞానంతోపాటు కండబలం, గుండెబలం, సహసం ముఖ్యం. అభ్యాసదక్షుడైన ఆచార్యుడే ధనుర్వేదాన్ని నేర్పగలడు. మిగిలిన శాస్త్రాలలోలాగా ధనుర్వేదంలో కూడా సిద్ధాంతజ్ఞానానికి ప్రయోగజ్ఞానానికీ ప్రాధాన్యమివ్వబడింది. ధనుర్వేదంలో అంతకసంహారాద్యస్త్రాలను గురించి చెప్పడం జరిగింది. 'అస్' అనే శబ్దానికి, 'త్రోయుట' అని అర్థం వాటిని శత్రువులపై విసరడంవల్ల అస్త్రాలనే పేరు వచ్చింది. క్షత్రియులకు అస్త్రప్రయోగోప సంహారాలు తెలిసి ఉండడం ముఖ్యం. ధనుర్వేదాచార్యులకానాడు రాజాదరణ ఉండేది. మహాభారతంలోని సైనిక శిక్షణ కేంద్రాల గురించి పి. యస్. రాపుత్ ఇట్లా చెప్పినాడు.

"Military Education was not only organised by the State; but on the other hand, Private individual instructors too would undertake this duty. In every village there were Military train-

---

1. తిక్కన, op. cit., భీష్మపర్వము 2వ ఆశ్వాసము వచనము 98 పుట 45

ing camps where villagers were given military education for self defence."1

ప్రాచీనుల సమరకళ పరాకాష్ఠదశను చేరిందని చెప్పడానికి భారతయుద్ధం నిదర్శనం. వేలాది ప్రజలకు జీవనోపాధిని కల్పించిన సమరవిద్య దేశరక్షణకా నాడు పటిష్ఠమైన సాధనంగా అభివృద్ధిచెందింది.

3.3.7. వృక్షశాస్త్రం :

మహాభారతంలో వృక్షశాస్త్ర మూలసూత్రాలను గురించి చెప్పడం జరిగింది. ఒక వ్యక్తి నోటిలో గొట్టాన్ని పెట్టుకొని చెట్టు తొట్టిలలో ఉన్ననీటిని పీల్చినట్లు, వృక్షాలు వేర్లద్వారా నీటినిపీల్చి వాయువుతోనూ, అగ్నితోనూ కలిపి ఆహారపదార్థాలను తయారు చేసుకొంటాయి. వాటికి సుఖదుఃఖాది అనుభవంకూడా ఉంది. వాటికి, "దృష్టి"2 "శబ్ద"3 "గంధ"4 "రస"5 "స్పర్శ"6 లకు సంబంధించిన జ్ఞానముంది. లత వృక్షాన్ని అల్లుకొంటూ అన్నివైపులకు పోతుంది. దానికి చూచేశక్తి లేకపోతే అలాగా మార్గాన్ని వెదకుతూ ముందుకుపోవడం జరగదు. లతయొక్క దృష్టిజ్ఞానానికిది నిదర్శనం. అగ్ని, పిడుగూ, వల్ల కలిగే భయంకరమైన శబ్దంవల్ల వృక్షాలనుండి పూలు పండ్లూ రాలడంవల్ల వాటికి శబ్దజ్ఞానము ఉందని చెప్పవచ్చు. సువాసనలనుగానీ, దుర్వాసనలనుగానీ, ధూపాలనుగానీ అఘ్రాణించడం

---

1. Rawut, P. L, op. cit, Page 37.
2. వల్లీ వేష్టయతే వృక్షం సర్వతశ్చైవ గచ్ఛతి
   నహ్యదృష్టేశ్చ మార్గోఽస్తి తస్మాత్ పశ్యంతి పాదపాః
3. వాయ్వగ్న్యశని నిర్ఘోషైః ఫలం పుష్పం విశీర్యతే
   శ్రోత్రేణగృహ్యతే శబ్దస్తస్మాత్ శృణ్వంతిపాదపాః
4. పుణ్యాపుణ్యైస్తథా గంధైర్ధూపైశ్చ వివిధైరపి
   అరోగాః పుష్పితాః సన్తి తస్మాజ్జిఘ్రంతి పాదపాః
5. పాదైః సలిలపానాచ్చ వ్యాధీనాం చాపిదర్శనాత్
   వ్యాధి ప్రతిక్రియత్వాచ్చ విద్యతే రసనంద్రుమే
6. ఊష్మతోమ్లాయతేవర్ణం త్వక్ఫలం పుష్పమేవచ
   మ్లాయతే శీర్యతే చాపిస్పర్శస్తేనాత్ర విద్యతే
   1-5. వ్యాసుడు. op. cit., 13, 12, 14, 15, 11 శ్లోకాలు పుట 4883

మూలాన చెట్లు ఆరోగ్యంగా బ్రతుకుతూ ఉన్నాయి. వాటి గంధజ్ఞానానికిది ప్రమాణం. చెట్లు వేర్లద్వారా నీటిని పీల్చడంవల్ల, రోగాలు వస్తాయని ముందే తెలుసుకొని వాటికి తగిన ప్రతిక్రియను చేసుకోవడంవల్ల వాటికి రసనేంద్రియం ఉందని చెప్పవచ్చు. వృక్షాలలోని ఊష్మంవల్ల వాటి ఆకులూ, బెరడూ, పూలూ, పండ్లూ వాడి రాలిపోవడం వాటిస్పర్శజ్ఞానానికి నిదర్శనం. వృక్షాలలో పంచభూతాలు న్నాయి. వాటి గుణాలను తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"అశని నిర్ఘోషంబు నాకర్ణనములేక వికృతి నెట్టులవొందు వృక్షమాక
సముశక్తి సూవె శ్రోత్రము నిదాఘంబుచోఁకున వాడుఁజోకెఱుంగుట సమీర
శక్తి మార్గముఁగని చాఁగెడుఁగనుట తేజశ్శక్తి పాదపసంజ్ఞఁబరగుఁ
బాద జిహ్వలగొని పానంబుసేయుట జలశక్తి జిహ్వనై జంబులైన
కుసుమమధుపాది గంధముల్గొనుట నెలమిదాల్చునని చెప్పఁదరువు
వేదంబుఘ్రాణ
మిర్విశక్తి యిట్లయిదును నుల్లసిలుట ననఘభూజంబు పంచభూతాత్మకంబు"1

3.3.8. సాధారణ విద్య (General Education) సాంకేతిక విద్య (Technical Education)

జీవితాన్ని సుఖంగా గడపడానికి, పొరుగువారితో మంచి సంబంధాన్ని పెంచు కోవడానికి వ్యక్తికి ఉపయోగపడే విద్య సాధారణవిద్య. ఒక వ్యక్తి ఏప్రక్రియ లోనైనా విశిష్టతను సంపాదించడానికి ముందు కొంత సాధారణ విద్య అవసరం. దీనివల్ల మానవునికి, వ్యక్తిగత సమస్యలనూ, సామాజిక సమస్యలనూ పరిష్క రించుకొనేశక్తి కలుగుతుంది. సాంకేతిక విద్యకూ, సాధారణ విద్యకూ భేదముంది. వ్యక్తి ఒక ప్రక్రియలో విశిష్టతను సంపాదించడానికి సాంకేతిక విద్య ఉపయోగపడుతుంది. వృత్తివిద్యలు కూడా సాంకేతిక విద్యకు సంబంధించినవే. ఐతే వృత్తి విద్యలు మానవులకు పరిమితస్థాయిలో జీవనోపాధిని కలిగిస్తాయి. సాంకేతికవిద్య విశిష్టమైన జ్ఞానాన్ని కలిగిస్తుంది. మహాభారతంలో కర్మకారులను గురించి వర్ణించడం జరిగింది. ఏనుగు దంతాన్ని ఉపయోగించి ఆసనాలను తయారుచేసేవారూ, రథములు తయారుచేసేవారూ, వడ్రంగి, కమ్మరి, కుమ్మరి కంసాలి మొదలైనవారు ఆనాడున్నట్లు విదితమౌతుంది. ఆనాటి సాంకేతిక విద్య

---

1. తిక్కన, శాంతిపర్వము 4వ ఆశ్వాసము op. cit., పద్యము 88 పుట 145.

నై పుణ్యాన్ని తెలుసుకోవడానికి లక్క-యిల్లు, మయసభ, గంగానదిని దాటడానికి పాండవులకోసం విదురుడు తయారు చేయించిన పడవ మొదలైనవి ఆధారాలుగా ఉన్నాయి. భారతంలోని (ఆదిపర్వము 6వ ఆశ్వాసము గద్యము 149 పుట 355) "లాక్షాసర్జకరస మిశ్రంబై ఘృత తైలార్ద్రింబయిన మృత్తికా పుంజంబున నొక్క-చతుశ్శాల విశాలంబుగా నాయుధశాల సమీపంబున మనోహరంబుగా నవిరళ సుధాధవళితంబుగా నిర్మించి" అనేభాగంలో నన్నయ లక్క- ఇంటిని గురించి వర్ణించినాడు.

మయుడు శిల్పకళాకుశలుడు. అతడు నిర్మించిన సభ అద్భుతమైనది. రాజులెవ్వరైనా దానిదగ్గరకు వచ్చి బాగుగాచూచి కూడా అందులో ఉండే మర్మాన్ని తెలుసుకోలేరు. ఆసభ రారాజుకే మోహాన్ని కల్గించింది. దాన్ని నిర్మించడానికి మయునికి పద్నాలుగు నెలలు పట్టింది. ఎనిమిదివేల మంది రాక్షసకింకరుల సహాయంతో మయుడు దాన్ని మోయించుకొనివచ్చి ధర్మరాజుకు ఇచ్చినాడు. నన్నయ మయసభను ఇట్లా వర్ణించినాడు.

"విమల మణిమయములగు దూలములంగంబములఁ గోడలను వేదులఁగు
ట్టిమములఁ జుట్టిన ప్రాకారములను గరమొప్పుచుండ రచియించె సభన్"[1]
సురుచిర హరినీల కిరణజాలంబులఁ బద్మరాగారుణ పద్మములను
రాజితరాజీవరాజహంసావళి నిర్మల సౌవర్ణ కూర్మములను
గమనీయ వైడూర్య కుముదంబులను వజ్రమీన మౌక్తిక నవఫేనములను
మరకత శైవలోత్క-రముల విలసిల్లఁ గొలనని సన్మణి స్థలముచూచి
పలుగుసరాల కుడ్యముల రుచుల్ గప్పిన జలములున్నయెడల వెలయజూచి
యనను స్థలంబులని జనువెఱుగక యుండునట్లుగా మయుండు సేసె."[2]

పాండవులకోసం విదురుడు తయారు చేయించిన పడవను గురించి క్రిందిశ్లోకంలో వర్ణించడం జరిగింది.

"తతోవాతసహాం నావం యంత్రయుక్తాం పతాకినీమ్
ఊర్మిక్షమాం దృఢాంకృత్వా కుంతీమిద మువాచహ"[3]

1. నన్నయ, op. cit., సభాపర్వము 1వఆశ్వాసము పద్యము 11, పుట 558.
2. నన్నయ, op. cit., 1వఆశ్వాసము పద్యము 13
3. వ్యాసుడు, op. cit., పుట 29

మామూలు పడవలు వాయువేగానికి తట్టుకొనలేవు. విదురుడు తయారు చేయించినపడవ వాయువేగానికీ, అలలతాకిడికి నిలువగలిగింది. దానికి యంత్రము కూడా ఉంది. దీన్నిబట్టి ఆనాడు దృఢమైన పడవలను తయారుచేసే వారని విదిత మౌతుంది.

3.3.9. వ్యాయామవిద్య :

వ్యాయామవిద్య ప్రాచీనమైంది. అస్త్ర శస్త్ర, మల్లవిద్యలలో ఆరితేరిన వారిని వీరులుగ పూజించడం ఆనాడు జరిగేది. వీర్యమే శుల్కంగా కన్నెలను వివాహమాడిన రాజకుమారుల కథలు భారతంలో ఉన్నాయి. వ్యాయామాన్ని నేర్పే వారికీ, నేర్చుకొనేవారికీ హనుమంతుడారాధ్య దైవముగా ఉన్నాడు శరీరదార్ఢ్యాన్ని కలిగించడం, కష్టసహిష్ణుతను పెంపొందించడం, క్రమశిక్షణను నేర్పడం, స్వామి భక్తిని కల్గించడం, ఆర్తులను రక్షించడం వ్యాయామ విద్యా ఆశయాలు. భారతం లోని గురుకులాలలోని శిష్యులు గృహకృత్యాలు నిర్వర్తిస్తుండడంవల్ల వారికి ప్రత్యేకముగా శారీరకమైన శిక్షణ ఇవ్వవలసిన అవసరం లేకపోయింది, మహా భారతంలో వర్ణింపబడిన ఆయుధ విద్యలూ, ఆరోహణవిద్యలూ, క్రీడలూ మొదలైనవి వ్యాయామ విద్యకుచెందినవే. వసుదేవుడు, పాండురాజుకు ఐదుగురు కుమారులు జన్మించినారని విని సంతోషించి వారికోసం తన పురోహితుడైన కశ్యపునితో ఆటవస్తువులను పంపినట్లు భారతంలో వర్ణింపబడింది. పాండవులు శుకుని దగ్గర అస్త్రవిద్యలూ, సామూ నేర్చుకొనినారు. నన్నయ, (ఆదిపర్వము 7వ ఆశ్వాసము పద్యము 236 పుట 459.) భారతంలో పాండవులను, "ఆజాను లంబిమహాబాహు పరిఘుల నత్యున్నతాంసుల నతివిశాల వక్షుల నవిరళ వ్యాయామ దృఢకఠినాంగుల" అని వర్ణించడంవల్ల నిత్యమూ వారువ్యాయామము చేసే వారని విదితమౌతుంది. కురుపాండుకుమారుల బాలక్రీడలను నన్నయ ఇట్లా వర్ణించినాడు.

"గెలుపునెడ నేయునెడవడిఁ బలుచునెడం బెనగునెడ నపారబలంబుల్
మెలయునెడ భీమునకు నందొలుఁగీడ్పడ ఁదొడగిరుద్ధతులు రాజసుతుల్"1
"వదలక పెనగి పదుండ్రం బదియేవుర నొక్క పెట్టపట్టి ధరిత్రిం
జెదరఁబడపైచి పవనజుఁడదయుండయి వీపుబొలియ నందరనీడ్చున్."2

---

1. నన్నయ, op. cit., 5వ ఆశ్వాసము పద్యము 164 పుట 297.
2. నన్నయ, op. cit , 5వ ఆశ్వాసము పద్యము 165.

"కూడి జలక్రీడలాడుచోఁ గడగి యాధృతరాష్ట్ర తనయుల నతులశక్తి
లెక్కించియుఁబదుండ్ర నొక్కొక్క భుజమున నెక్కించుకొని వారియుక్కడంగ
గ్రుంచుచు సిరిలో ముంచుచు నెత్తుచు గారించి తీరంబు చేరఁబెట్టు
గోరి ఫలార్థులై వారల యెక్కిన క్రమాకుల మొదవుల నీకబట్టి
పడిగదల్చుఁబండ్లు దడఁబడు వారలతోన ధరణిమీద దొరగుచుండ
నిట్టి పాటగాడ్పు పట్టిచే దుశ్శాసనాదులెల్ల బాధితాత్ములైరి"[1]

ఒకడు నూరుమందికి ఎదురు నిలిచి చల్లుపోరులాడడం, పులులూ, సింహాలూ, మొదలైన జంతువులతో యుద్ధం చేయడం, చుట్టూతిప్పి విసరికొట్టడం మొదలైనవి వ్యాయామ విద్యకు చెందినవే. అస్త్రశస్త్రవిద్యలలో ఆరితేరిన కుమారుల వృత్తాంతాన్ని ద్రోణుడు. ధృతరాష్ట్రునికి వినిపించినాడు. కుమారుల విద్యలను ప్రదర్శించడానికి తగిన రంగస్థలాన్ని సిద్ధము చేయించమని అడిగినాడు. ధృతరాష్ట్రుడు విదురుని పిలిపించి రంగస్థలాన్ని రమ్యముగా చేయించమని ఆజ్ఞాపించినాడు. విదురుడు దాని, "శాస్త్రవిహిత ప్రమాణోపేత వృత్తాయామంబును నపాకృత వృక్ష గుల్మ వల్మీకంబును నంగీకృత పూర్వోత్తర ప్లవంబును సమీకృత నిమ్నోన్నత ప్రదేశంబును దూరీకృత కంటక పాషాణశల్య శకలంబును విరజీకృతర జోధూసర స్థలంబును విరచిత బహువిధ ప్రేక్షాగారాంచిత మణిమయమంచ ప్రపంచంబును నానాధ్వజనవ పల్లవ రంభాస్తంభ మాలాలంకృత ద్వారతోరణంబును ప్రతిదిశ నిర్వర్తిత శాంతిక బలివిధానంబునుంగా"[2] చేయించినాడు. రాజకుమారులను పౌరులకు పరిచయంచేయడానికి ద్రోణుడు ముందుకు వచ్చినాడు. భూసురులపుడు స్వస్తి వాచకాలు పలికినారు. రాజకుమారులు తనుత్రాణాదులను ధరించి, ధర్మరాజును అనుసరించినారు. వారు వరుసగా నిలబడినారు. ఆచార్యుని అనుమతితో వారు బాణాలను చిత్రవిచిత్రంగా ప్రయోగించినారు. వారు నేలపైనుండేగాక, ఏనుగుమీదా, గుర్రాలపైనా, రథాలమీద నిలబడి లక్ష్యాలను పడగొట్టినారు. కొందరు గదాయుద్ధంలో మునిగిఉన్నారు. మల్లయుద్ధ నైపుణ్యాన్ని చూపిస్తుంటే మరికొందరు ఆసమయంలో భీమదుర్యోధనుల గదాయుద్ధం ప్రేక్షకులకు విస్మయాన్ని కలిగించింది. అర్జునుడు రంగంలో ప్రవేశించి ఆగ్నేయాస్త్రంతో అగ్నినీ, మేఘాస్త్రంతో మేఘాలనూ సృష్టించినాడు. ఉన్నతమైన ఆకారంలో గోచరించడం, అంతలోనే పొట్టివాడుగ

1. నన్నయ, op. cit., 5వ ఆశ్వాసము పద్యము 166 (పుట 287-288).
2. నన్నయ, op. cit., ఆదిపర్వము 6వ ఆశ్వాసము వచనము 4 పుట 322

ఘూరడం, రథ మధ్యభాగంలో ఉండడం, మరుక్షణంలో రథాగ్రభాగంలో కనిపించడం మొదలైన అద్భుతకర్మలను ప్రదర్శించినాడు. అతడు గాలిపోకి తేవాలు కదిలే వస్తువులను కదలకుండా, సూక్ష్మ వస్తువులను గురితప్పకుండా, స్థూలమైన వస్తువులు కదలుతూఉన్నా, బాణాలను సూటిగా ప్రయోగించినాడు. లోహంతో నిర్మింపబడిన వరాహం గుండ్రంగా తిరుగుతూఉంటే, దాని ముఖంపై ఐదుబాణాలను ఒక్కసారిగా వేసినాడు. అర్జునుడు కత్తియుద్ధంలోనూ, గదాయుద్ధంలోనూ నైపుణ్యాన్ని చూపించినాడు. తరువాత కర్ణుడు రంగంలో ప్రవేశించి అర్జునుడు ప్రదర్శించిన విద్యలను ప్రదర్శించినాడు. వారిద్దరికీ యుద్ధం జరిగింది. సూర్యాస్తమయం వరకు రాజకుమారుల అస్త్రవిద్యా ప్రదర్శన జరిగింది.

3.3.10. వికలాంగుల విద్య :

వ్యక్తుల అవసరాలను, అభిరుచులను తీర్చడానికి పలువిధాలైన విద్యాబోధన జరుగుతూఉంటుంది. వికలాంగుల అవసరాలను, అభిరుచులను తీర్చడానికి వారికి ప్రత్యేకమైన విద్యావిధానం అవసరం. శారీరక మానసిక అశక్తతలుగానీ, లోపాలుగానీ గలవారు వికలాంగులు. చెవిటివారూ, గ్రుడ్డివారూ, కుంటివారూ వికలాంగులే. మహాభారతంలో దీర్ఘతముడూ, ధృతరాష్ట్రుడూ, అష్టావక్రుడూ మొదలైన వికలాంగులున్నారు. దీర్ఘతముడూ, ధృతరాష్ట్రుడూ జాత్యంధులు, అష్టావక్రుడు కుంటివాడు. నన్నయ భారతం (ఆదిపర్వం 4వ ఆశ్వాసం 227 వచనం) లో, "దీర్ఘతముండు నాఁబుట్టి సకల వేదవేదాంగ విదుండయి జాత్యంధుం డయ్యును తన విద్యాబలంబున" అనివర్ణించడంవల్ల అతడు వేదవేదాంగాలలో ఆరితేరినవాడని విదితమౌతుంది. ధృతరాష్ట్రుడు కూడా పుట్టుగ్రుడ్డిఐనా వేదవేదాంగాలలో, అర్థశాస్త్రంలో, విశేషమైన జ్ఞానాన్ని ఆర్జించినాడు. అష్టావక్రుడు గర్భంలో నున్నప్పుడే తన తండ్రియైన కహోళుని అధ్యాపన విధానాన్ని ఆక్షేపించినట్లు భారతంలో వర్ణింపబడింది. కహోళుని శిష్యులు రాత్రింబవళ్ళూ వేదాధ్యయనం చేయడంవల్ల నిద్రలేక బుద్ధిమాంద్యంకలవారైనారని తండ్రితో చెప్పినాడు. కహోళుడు కుమారుని శపించినాడు. అష్టావక్రుడు వికలాంగుడుగ జన్మించినాడు. అష్టావక్రుడు, జనకుని సభలో వంది అనే పండితుని ఓడించినాడు. "త్రయోదశితిథిరుక్తా ప్రశస్తా, త్రయోదశద్వీపవతీ మహీచ"[1] అని శ్లోకంలో పూర్వార్థాన్ని

1. వ్యాసుడు. op. cit., శ్లోకము 20 పుట 1323.

చెప్పి. వంది దిక్కుతోచక నిలిచినాడు. అష్టావక్రుడు, "త్రయోదశాహాని ససార కేశీ త్రయోదశాదీన్య తిచ్ఛందాంసిచాహుః"1 అని ఉత్తరార్థాన్ని పూరించినాడు. పండితులు అష్టావక్రుని ప్రశంసించినారు. తిథులలో త్రయోదశి ప్రశస్తమైనదనీ. భూమి పదమూడు ద్వీపాలచే ఏర్పడిందని వంది చెప్పి. శ్లోకముయొక్క ఉత్తరార్ధాన్ని పూరించలేక విచారంతోనున్నప్పుడు, అష్టావక్రుడు, కేశి అనే రాక్షసునితో విష్ణువు పదమూడు దినాలు యుద్ధం చేసినాడనీ, ఛందస్సులలో అతిజగతీ అనే పేరుగల ఛందస్సుకు, ప్రతిపాదానికి పదమూడక్షరాలుంటాయని ఉత్తరార్ధాన్ని పూరించి తన ప్రజ్ఞను నిరూపించుకొనినాడు. దీర్ఘతముడూ, ధృతరాష్ట్రుడూ గ్రుడ్డివారైనా ఎన్నోవిషయాలను, ఎంతోకాలం విన్నందువల్ల జ్ఞానాన్ని ఆర్జించినారు.

### 3.3.11. అక్షహృదయం :

గురుశుశ్రూషవల్లగానీ, ధనాన్ని పుష్కలంగా సమర్పించిగానీ. తనకు తెలిసిన విద్యను ఇతరులకు చెప్పడంవల్లగానీ విద్యను నేర్చుకోవాలని ఆర్యోక్తి.2 అక్ష హృదయమనే విద్య సంఖ్యలకు సంబంధించినది. ఋతుపర్ణుడు, నలునికి అక్ష హృదయమునుపదేశించినాడు, ఋతుపర్ణుడు బాహుకునితో చెప్పినమాటలను నన్నయ ఇట్లావర్ణించినాడు.

" ఎల్లవారు నెరుగరెల్ల వానిని భిన్నవిషయులెల్లవారు విద్యలందుఁ
దొలగకే నెరుంగుదును దృష్టిమాత్రన సకలమైన వస్తుచయము సంఖ్య"3

"ఇవ్విభీతకంబున ఫలపర్ణ సముదాయ సంఖ్య చెప్పెదవిను
మీ రెండు శాఖలంగల పర్ణఫలంబులు పదివేలు నొక్కండు
దక్కిన శాఖలంగలయవి రెండువేలుం దొంబదేను"4

ఋతుపర్ణుడు చెప్పినట్లు తాండ్ర చెట్టుకొమ్మలయందుండే ఆకులూ, పండ్లూ బాహుకుడు లెక్కించి, అన్నే ఉన్నాయని నిశ్చయించి అవిద్యనుపదేశింప వలసినదని తాను అడిగినాడు. అప్పుడు ఋతుపర్ణుడు, అక్షహృదయమును ఉపదేశముగా

---

1. వ్యాసుడు, op. cit., శ్లోకము పుట 1323
2. గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేనవా అథవా విద్యయా విద్యా
3. నన్నయ, op. cit., అరణ్యపర్వం 2వ ఆశ్వాసము పద్యము 174, పుట 77.
4. నన్నయ, op. cit., పుట 77, వచనము 175.

తెలిసినవాడు సంఖ్యావిదుడౌతాడనీ, పాపదోషవిషాల నుండి విముక్తుడౌతాడనీ, అవిద్యామహిమను వివరించి సకలగుణ సంపన్నుడైన బాహుకునికి ప్రీతితోనుప దేశించినాడు. నలుడు సంతోషపడినాడు. తనకు తెలిసిన, 'అశ్వహృదయ' మనే విద్యను పరిగ్రహింపుమని అడిగినాడు. తనకు కావలసినపుడు దానిని గ్రహిస్తానని ఋతుపర్ణుడు బాహుకునితో చెప్పినాడు. చూచినంతమాత్రాన్నే ఒక చెట్టుపై నుండే ఆకులనూ పండ్లనూ లెక్కించడం సామాన్యమైనపనిగాదు. లెక్కించ కుండానే, ఋతుపర్ణుడువాటి సంఖ్యను చెప్పడంవల్ల అతని ప్రజ్ఞవిదితమౌతుంది.

మహాభారతంలో. కాలగమన గ్రహనక్షత్రాదుల వృత్తాంతం క్రింది శ్లోకంలో వర్ణింపబడింది.

"తత్రగర్గేన వృద్ధేన తపసా భావితాత్మనా
కాలజ్ఞాన గతిశ్చైవ జ్యోతిషాంచ వ్యతిక్రమః
ఉత్పాతా దారుణాశ్చైవ శుభాశ్చ జనమేజయ
సరస్వత్యాః శుభేతీర్థే విదితా వై మహాత్మనా
తస్యనామ్నాచ తత్తీర్థం గర్గస్రోత ఇతిస్మృతమ్"[1]

గర్గుడు తపస్సంపన్నుడు, భావితాత్ముడు. అతడు కాలజ్ఞానాన్నీ, కాలగమనాన్నీ, గ్రహనక్షత్రాల ఉచ్చనీచగతులనూ, దారుణమైన ఉత్పాతాలనూ, శుభాశుభశకునాలనూ సరస్వతీ తీర్థంలో ఉండగా తెలుసుకొనినాడు. ఆతీర్థానికి గర్గస్రోతమనే పేరు అతనివల్లనే వచ్చింది.

భారతంలో ఒకపర్వంలో భాగమైన భగవద్గీతలోని విజ్ఞానయోగము 4, 8, 9, 10 శ్లోకాలలోని విజ్ఞానాంశాలే పడమటి శాస్త్రజ్ఞులు క్రింది విషయాలుగ బోధిస్తున్నా

1. వ్యాసుడు, op. cit., భీష్మపర్వము 4234.

భూమిరాపోఽనలో వాయుః ఖంమనో బుద్ధిరేవచ
అహంకార ఇతీయంమే భిన్నా ప్రకృతిరష్టధా 4
రసోఽహమప్సు కౌంతేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖేపౌరుషంనృషు 8
పుణ్యోగంధః పృథివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌ
జీవనమ్ సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు 9
బీజంమాం సర్వభూతానాం విద్ధి పార్థసనాతనమ్
బుద్ధిర్బుద్ధి మతామస్మి తేజ స్తేజస్వినా మహమ్. 10

రని వేంకటానందరావు చెప్పినాడు. "Acoustiscs (శబ్ద) (నాద) శాస్త్రము 2 Astronomy జ్యోతిశ్శాస్త్రము. 3. Biology జీవశాస్త్రము. 4. Botany వృక్ష, ఓషధి శాస్త్రములు, 5. Geography భూగోళశాస్త్రము. 6. Geology భూతత్త్వశాస్త్రము, 7. Hydrostatics జలశాస్త్రము, 8. Meteorology వాతావరణ శాస్త్రము, 9. Military Science సమరశాస్త్రము. 10 Physics, Heat and light భౌతికశాస్త్రము, తేజఃశాస్త్రములు, 11. Physiology శరీర నిర్మాణ శాస్త్రము, 12. Psychology మానసిక నైతిక శాస్త్రములు, 13. Zoology జంతుశాస్త్రము[1] ఈ శాస్త్రాలేగాక, వ్యక్తికి ముల్లోకాలను దర్శించ గల శక్తిని ప్రసాదించే 'చాక్షుషి' దేవతలను ప్రత్యక్షం చేసుకోడానికి పనికివచ్చే 'ప్రతిస్మృతి,' జలస్తంభన వాయుస్తంభనాది విద్యల గురించి మహాభారతంలో వర్ణింపబడింది.

3 3.12. నీతివిద్య :

మానవుని శీలాన్ని తీర్చిదిద్దడానికి పనికివచ్చేది నీతివిద్య. ఆత్మోద్ధరణమూ, సాంఘిక సంక్షేమమూ నీతివిద్యవలన కలిగే ప్రయోజనాలు. మహాభారతం నీతి కథలకు నిధి వంటిది. అందులో విదురనీతికి ప్రత్యేక స్థానముంది. వ్యాసుడూ, మార్కండేయుడూ, బృహదశ్వుడూ, భీష్ముడూ, సంజయుడూ మొదలైనవారు చెప్పిన నీతికథలు భారతంలో ఉన్నాయి. యయాతి పూరునికి బోధించిన నీతులను నన్నయ ఇట్లా వర్ణించినాడు.

"ఎఱుకగలవారి చరితలు గఱచుచు సజ్జనులగోష్ఠి గదలక ధర్మం
బెఱుగుచు నెఱిగిన దానిని మఱవకనుష్ఠించునది సమంజస బుద్ధిన్
ఇచ్చునది పాత్రునకు ధనమిచ్చుగ నోరువేడకుండునది యధిముఖులై
వచ్చిన యాశార్థుల వృథపుచ్చక చేయునది సర్వభూత ప్రీతిన్.

మనమునకుఁ బ్రియంబును హితమును బథ్యము దథ్యమును నమోఘము మధురం
బును బరిమితమునునగు పలుకొనరగ బలుకునది ధర్మయుతముగ సభలన్.

---

1. వేంకటానంద రాఘవరావు, గౌబ్బూరి నన్నయభట్టు విజ్ఞాననిరతి, పుట 16 అద్దేపల్లి అండ్ కో, రాజమండ్రి, 1959.

మదము గామము క్రోధంబు మత్సరంబు లోభమును మోహమును నను
లోని సహజ
వైరి వర్గంబు నోడిచినవాడ యొడుచు నశ్రమంబున వెలపలి యహితతతుల."[1]

మహాభారతంలో విదురుడు ధృతరాష్ట్రునికి చెప్పిన నీతుల గురించి తిక్కన ఉద్యోగపర్వం (2వ ఆశ్వాసం పద్యములు 31-48, 56-62)లో వర్ణించినాడు. లోకులు మెచ్చుకొనే విధంగా నడుచుకోవడం మానవుని విధి. మానవుడు లోక నింద్యమైన పనిని చేయరాదు. ఇతరుల సంపదనుచూచి అసూయపడరాదు. కోపమూ, ఈర్ష్యా, గర్వమూ, దురభిమానమూ, నిర్వ్యాపారత్వమూ నీచుల గుణాలు. దైవాన్ని, రాజునూ, తన భార్యనూ, బంధువులనూ తగిన విధంగా సత్కరించని వాడు పాపఫలాన్ని పొందుతాడు. తనమీద ప్రేమను చూపేవారలను పరిత్య జించడం అవివేకం. తన్ను ఒల్లనివాని దగ్గర చేర్చుకోవడం మంచిదికాదు. తన శత్రువు బలవంతుడని తెలిసి, అతనిపైకి యుద్ధానికి పోవాలనుకొనేవాడు మూర్ఖుడు. ధనమూ, విద్యా, కులమూ దుర్మార్గులకు గర్వాన్ని కలిగిస్తాయి. కాని సజ్జనులకు అవి నీతిని నేర్పుతాయి. మిక్కిలి నైపుణ్యంగల విలుకాడు బాణాన్ని ప్రయోగిస్తే అది ఒక్కని మాత్రమే చంపవచ్చు లేదా గురి తప్పినా తప్పవచ్చు. కాని బుద్ధిమంతుని రాజనీతి రాజునూ, రాజ్యాన్నీ హరిస్తుంది. మానవుడు బుద్ధిని ఆధారంగా చేసుకొని, కార్యాకార్యాలను నిశ్చయించి మిత్రులనూ, శత్రువులనూ, ఉదాసీనులనూ, సామ దాన భేద దండోపాయాలతో తనవశం చేసుకొని, పంచేంద్రి యాలను జయించి, సంధి విగ్రహాదులనే ఆరింటిని తెలుసుకొని, ఏడు వ్యసనాలువీడి నడుచుకోవలసి ఉంటుంది. అతడే వివేకధనుడు. ఎందరో ఉండగా తానొక్కడు మధుర పదార్థాన్ని తినకూడదు. ఒకేవ్యక్తి కార్యాలోచన చేయడం మంచిదికాదు. సముద్రాన్ని దాటడానికి ఓడ ఎట్లా పనికివస్తుందో అట్లాగే నడవడి అనే సముద్రాన్ని దాటడానికి సత్యమే సాధనం. దాన్ని మించినది లేదు. ఓర్పువహించినవాని జూచి మూఢులు చేతగానివాడని ఎగతాళి చేస్తారు. కాని క్షమయే మనుష్యునికి భూషణం. మానవుడు పరుషపు మాటలు మానుకోవాలి. పాపపుపనులు చేయరాదు. తనమాటలు చెల్లుబడి ఐనా సహనంతో ఉండడం, తాను పేదవాడైనా అడిగినవానికి ఉన్నంతలో ప్రేమతో దానంచేయడం శ్రేయస్కరం. న్యాయార్జితమైన ధనాన్ని

1. నన్నయ, op. cit., P 249. ఆదిపర్వము 3వ ఆశ్వాసము పద్యము 203-206, పుట 171.

అపాత్రులకు దానంచేసినా, పాత్రులకు దానం చేయకపోయినా కీడు మూడుతుంది, మానవునికి ఆత్మస్తుతి పనికిరాదు. తాను బాధపడినా ఇతరులను నిందించడం మంచిదికాదు. నెయ్యానికీ, కయ్యానికీ సమానత్వం ముఖ్యం. అధికులతోగాని, అల్పులతోగాని స్నేహవివాదాలు పనికిరావు. ఫలాశచే ఎవ్వడైనా చెట్టునుండి లేత కాయనుకోస్తే, వాడాఫలరసాన్ని ఆస్వాదించలేడు. వానికి విత్తనంకూడా దక్కదు. ఎవడు సకాలంలో పండిన పండును కోస్తాడో, వాడు ఫలరసాన్ని పొందడమేగాక వాటి విత్తనాలవల్ల మరల మరల ఫలాలను స్వీకరించడం జరుగుతుంది. పుష్పాలకు బాధను కలిగించకుండా తుమ్మెదలు మకరందాన్ని సేకరించినట్లు, ఇతరుల మనస్సును నొప్పించకుండా మానవుడు ధనాన్ని కూడబెట్టవలసి ఉంది. పూలమాలను తయారు చేసేవాడు దండను కూర్చటానికి ఒక్కొక్క పూవునే కోస్తూ చెట్టుకు బాధను కలిగించడు. అట్లే మానవుడు ఇతరులను నొప్పించకుండా ధనాన్ని సంపాదించ వలసి ఉంది. బొగ్గులమ్మేవాడు చెట్టును మొదలంట నరికినట్లు చేయడం మంచిదికాదు. ఎదుటివాడిని నాశనంచేసి ఒక పనిని సాధించడం తగదు. పరుల సంపదనూ, బలాన్నీ, విద్యనూ, అభ్యుదయాన్నీ, తేజస్సునూ సహించనివాడు రోగంలేని దుఃఖంతో బాధపడతాడు సర్వప్రాణులకు త్రికరణశుద్ధిగా మేలు చేయడం శీలవంతుని లక్షణం శీలమే మానవునికి శ్రేయస్సును కలిగిస్తుంది. మౌనంగా ఉండడంకంటే ఇతరులు ఒప్పుకొనేలా మాట్లాడడం, దానికంటే సత్యాన్ని పలకడం, దానికంటే అందరికీ ప్రియం కలిగేలాగా మాట్లాడడం శ్రేయస్కరం, మాటల చేతనే చెలిమీ, ద్వేషమూ, జ్ఞానమూ, ధర్మమూ, పాపమూ, అభ్యుదయమూ, కులవతనమూ సిద్ధిస్తాయి. కత్తిచేగానీ, గొడ్డలిచేగానీ ఒక కొమ్మను నరికితే అది కొన్నాళ్ళకు చిగురు తొడుగుతుంది కాని నిష్ఠురపు మాటలవల్ల కార్యం నెరవేరదు. శరీరంలో గ్రుచ్చుకొన్న బాణాలను బయటికి తీయవచ్చుగాని మనస్సులో నాటుకొన్న మాటలను ఏ ఉపాయముచేతనైనా బయటికి తీయడం కష్టం. ఇతరులు తనపై కోపించినా తానుమాత్రం కోపపడరాదు. ఒకవ్యక్తి తనను కీడుమాటలాడినా విననివానిలాగా నటించవలసి ఉంది. అవమానాన్ని పొందినా, మానవుడు దానిని గురించి ఆలోచించరాదు. అలాంటివాడే ధర్మజ్ఞుడు. ఇతరులు ఏవిచేస్తే తనకు ప్రియము కలుగుతుందో వాటిని తాను ఇతరులకు చేయకపోవడం ధర్మమార్గాలలో ఉత్తమమైనదని తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబునకగుఁ దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్."[1]

---

1. తిక్కన op. cit., శాంతిపర్వము 5వ ఆశ్వాసము పద్యము 220, పుట 194.

భీష్ముడు పై పద్యంలో ధర్మరాజుకు ధర్మ సర్వస్వ స్వరూపాల్ని గురించి చెప్పినాడు.

3.3.13. మతవిద్య :

అతీంద్రియ శక్తిపై మానవునికిగల విశ్వాసమే మతముగ ఆవిర్భవించింది. ఆర్థిక, సాంఘిక, విద్యా, రాజకీయరంగాలు మతంచే ప్రభావితమౌతాయి. మతానికి చెందిన ఆచారాలగురించి ఉపదేశించడం మతవిద్యాలక్ష్యం. ప్రాచీన భారతదేశంలో మతవిద్య వైదిక బ్రాహ్మణవర్గానికి పరిమితమై ఉండేవి. మహాభారతముకూడా మతము ప్రధానంగా అవతరించిన గ్రంథమే. అందులో వర్ణాశ్రమ ధర్మాలనూ, పుణ్య పాపాలనూ, లోకాంతర జన్మాంతరాలనూ గురించి చెప్పడంజరిగింది. ఈ ప్రకరణంలో వర్ణవిద్య అనే విభాగంలో వర్ణధర్మాల గురించి చెప్పడమైంది. మహాభారతంలోని ఆశ్రమ ధర్మాలను తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"గురు శుశ్రూషయు నాగమాధ్యయనమున్ గోష్ఠినిరాసంబుఁ ద
త్పరతన్ మేన్ దొడయంగఁ దాఁ జొరమియున్ భైక్షాశనత్వంబు ష
ట్వర కర్మంబులయందు రాగభర గాఢద్వేషముల్ లేక యె
వ్వరి తోడన్ బగగాక యున్కియును భవ్య బ్రహ్మచర్యోక్తముల్ "[1]

"నిజ దారైకపరత్వమున్ గరుణయున్ నిక్కంబునుం దాల్మియున్
సుజనాసంగము దేవ పిత్రతిథి సంశుద్ధార్చనల్ హవ్య భు
గ్భజనంబున్ సకలాశ్రమస్థులను శక్య ప్రక్రియం బ్రోవుఁ బం
కజగర్భుండు గృహస్థ ధర్మములుగాఁ గల్పించె నుర్వీశ్వరా."[2]

"తానున్ భార్యయు నేఁగుఁ బేరడవికిన్ దా నొక్కడై నం జనున్
మానాహంకృతులూడ్చి నింద్రియములన్ మర్దించు నచ్చో జడల్
పూనుం దాపస శాస్త్రముల్ సదువుఁ జల్పున్ గోష్ఠి తజ్జాలితో
వానప్రస్థ విధావ్రవిష్టుడు ప్రజావాత్సల్య నిష్ణాత్మతన్."[3]

1. తిక్కన op. cit., శాంతిపర్వము 2వ ఆశ్వాసము పద్యము 230 పుట 70
2. ,, ,, ,, ,, 231 ,,
3. ,, ,, ,, ,, 232 ,,

"ఎచ్చోనైనను నిల్చి నాఁకటికి నేమేనిన్ గొనున్ రాత్రియై
నచ్చో నెమ్మి శయించు నగ్ని పరిచర్యంబాపి వర్తించుఁ దా
నిచ్చం గోరఁ డొకండు నింద్రియ జయంబేపారు భోగంబులన్
మెచ్చున్ మ్రొక్కను నొల్లకుండు యతి పేర్మిన్ నిత్యముండై నృపా."[1]

మానవుని జీవితము నూరు సంవత్సరాలకాలముంటుందని భావించి ఒక్కొక్క ఆశ్రమానికి ఇరవై ఐదు సంవత్సరాల కాలముగా నిర్ణయించడం జరిగింది. ఆయా వర్ణాలవారు ఆయా ఆశ్రమాలలో ఆయా ధర్మాలను ఆచరిస్తే పుణ్యం కలుగుతుందనీ, దానివల్ల అంతకంతకు ఉత్తమలోకప్రాప్తి జరుగుతుందనీ, ఉత్తమజన్మ సిద్ధిస్తుందనీ భారతంలో వర్ణింపబడింది. అన్ని మతాలకు సంబంధించిన మూలసూత్రాలను ఆధారంగా చేసుకొని విద్యార్థులకు మతవిద్యను బోధించడంవల్ల వారిలో ప్రేమ, సహనం, సమానత్వం మొదలైన గుణాలు చోటుచేసుకుంటాయి. వారు ఉత్తమ పౌరులుగ తయారౌతారు.

### 3.3.14 బ్రహ్మవిద్య :

మానవుడు అక్షరమైన తత్త్వాన్ని పొందడానికి ఉపకరించేది బ్రహ్మవిద్య. ఈ విద్యపై ప్రాచీనులు శ్రద్ధవహించడానికి కారణం అదే నిజమైన విద్య అని నమ్మడమే. ప్రాచీనుల జీవిత దృక్పథమూ, విధి నిషేధాలను గురించి వారు చేసిన సంశ్లేష విశ్లేషణలూ వారి తాత్త్విక జ్ఞానాన్ని సూచిస్తాయి. వారి భావాలు భౌతిక పరిధులను అధిగమించినాయి. వారు తమ కర్తవ్యాన్ని భక్తి శ్రద్ధలతో జీవిత గమ్యమైన నిశ్శ్రేయసానికే ముడిపెడుతూ వచ్చినట్లు విదితమౌతుంది. మానవాతీతమైన దశ ఒకటి ఉందనే భావం మొదటినుండీ మార్గదర్శకంగా ఉంటూ వచ్చింది. మన ప్రాచీన విద్యావిధానం ఈ సూత్రంపైనే ఆధారపడి ఉంది. జీవుడూ, దేవుడూ, జగత్తూ అనేవి బ్రహ్మవిద్యలో ప్రధానమైనవి. మహాభారతంలో ధర్మవ్యాధుడు కౌశికునికి బ్రహ్మవిద్యను గురించి వివరించినాడు. ఈ సందర్భంలో ఎర్రన ఇట్లా వర్ణించినాడు.

"అంబరము వాయు వహ్ని తోయమ్ము ధరణి భూతపంచకమిది క్రమంబున మహాత్మ
శబ్ద సంస్పర్శ రూప రసములు గంధ సంయుతంబుగ భూతపంచక గుణములు."[2]

1. తిక్కన, op. cit., శాంతిపర్వము 2వ ఆశ్వాసము పద్యము 233 పుట 70
2. ఎర్రన op. cit., అరణ్యపర్వము 5వ ఆశ్వాసము పద్యము 83 పుట 221

"ఒసరగ నాకన మాదిగ నను లోమముతోడ విమ్మహా భూతములె
నునుబుట్టు నొకటికొక్కటి యనయము ప్రతిలోమ గతి లయంబున బొందున్."[1]

పంచభూతాలకు గంధమూ, రసమూ, తేజస్సూ, స్పర్శా, శబ్దమూ అనేవి ప్రధానమైన గుణాలు. ఆకాశానికి శబ్దగుణమూ, వాయువునకు శబ్ద స్పర్శలూ, తేజస్సుకు శబ్ద స్పర్శ రూపాలూ, నీటికి శబ్ద స్పర్శ రూప రసాలూ, పృథివికి శబ్ద రూప స్పర్శ రసగంధాలూ ఉంటాయి. పంచభూతాలూ, పంచతన్మాత్రలూ, పది ఇంద్రియాలూ, త్రిగుణాలూ, అంతఃకరణమూ అనేవి ఇరవై నాలుగు తత్త్వాలు. ఇవి సమష్టిగానో వ్యష్టిగానో పుట్టడం, లయం చెందడం జరుగుతూ ఉంటుంది. ఇంద్రియాలకు అధీనుడైన జీవుడు ఆచార్యుడు ఉపదేశించిన వాక్యాలను మననం చేసి, జ్ఞానబలంతో బ్రహ్మానికీ, ప్రపంచానికీ ఉండే భేదాన్ని గుర్తించి, అన్ని భూతాలలో బ్రహ్మం ఉన్నట్లే తనలో కూడా ఆ బ్రహ్మమే ఉందని తెలుసు కొంటాడు. తాను బ్రహ్మస్వరూపుడై ప్రకాశిస్తాడు. అట్లా జీవుడు అద్వైతిగా మారడానికి సాధనం తపస్సు. తపస్సు చేయడానికి ఇంద్రియ నిగ్రహం ముఖ్యం. ఇంద్రియ నిగ్రహం ఒక యోగం. మానవుని శరీరం ఒక రథం. ఆత్మ సారథి. ఇంద్రియాలు గుర్రాలు. ధైర్యం పగ్గం. సారథి నైపుణ్యాన్నిబట్టి గుర్రాలు మార్గం తప్పకుండా వెళ్ళి రథాన్ని గమ్యస్థలానికి తీసుకొనిపోతాయి. అట్లే పురుషుడు ధైర్యంతో, ఇంద్రియ నిగ్రహంతో బ్రహ్మన్ని పొందగలడని ధర్మవ్యాధుడు కౌశికునికి బ్రహ్మవిద్యా రహస్యాలను చెప్పినాడు.

మహాభారతంలో శ్రీకృష్ణుడు అర్జునునకు శాశ్వతమైన ఆత్మతత్త్వాన్ని బోధించిన వృత్తాంతాన్ని తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"ఇద్దేహంబునందు బాల్యంబు యౌవనంబు వార్ధకంబు ననంగలుగు నవస్థలం బొందినట్లు జీర్ణంబులైన వస్త్రంబులు విడిచి నూతనంబులైనవాని గైకొనిన చాడ్పుననుంగాని దేహాంతర గమనం బాత్మ హానిచేయదనియుః బుట్టువుః జావునను నివి లేమింజేసి శరీరంబువోలె శస్త్రచ్ఛేదనంబు మొదలైన వికృతి కారణంబులకు నాత్మండు లోనుగాడు. అప్పురుషుండు నొప్పించువాఁడును నొప్పింపబడియెడు వాడునుగాడు."[2]

---

1. ఎఱ్ఱన, op. cit., అరణ్యపర్వము 5వ అశ్వాసము పద్యము 84 పుట 221
2. తిక్కన op. cit., భీష్మపర్వం 1వ ఆశ్వాసము వచనము 196 పుట 28

ప్రస్థానత్రయంలో భగవద్గీత నిదిధ్యాసన కాధారభూతమైన గ్రంథం. ఇందులో ఆచార్యుడైన కృష్ణుడు అర్జునునికి జ్ఞానసారథ్యం వహించి ప్రథమ షట్కంలో 'త్వమ్'ను గురించి, ద్వితీయ షట్కంలో 'తత్'ను గూర్చి, తృతీయ షట్కంలో 'అసి'ని గురించి వివరించినాడు, ఈ ఉపదేశం ఒక నరునికేకాదు. నరులకు అందరికీ. మానవుని జీవితం విషాదంతో ప్రారంభమౌతుంది. విషాదం తొలగాలంటే మానవునికి నిత్యానిత్యవస్తువివేకం అవసరం. అలాంటి వివేకాన్ని సాంఖ్యయోగం కలిగిస్తుంది. గీతలో మూడవ అధ్యాయంనుండి చివరివరకూ అనిత్యమైన సంసార ధర్మాలను క్రమంగా వదలిపెట్టి, నిత్యమైన ఆత్మతత్త్వాన్ని పొందే మార్గాన్ని గురించి భగవానుడు చెప్పినాడు.—

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥"1

—అనే శ్లోకం ఈభావాన్నే ఉపసంహరిస్తున్నది. ఈ విధంగా అనాత్మరహితమైన కేవల ఆత్మభావాన్ని ప్రతిపాదించడంవల్ల మానవ సహజమైన విషాదం తొలగిపోయి. అతడు చివరకు మోక్షసామ్రాజ్యాన్ని పొందుతాడు. ఇది శ్రీకృష్ణుడు అర్జునునికి గీతద్వారా ఉపదేశించిన జీవిత పరమార్థం.

వేదాంతశాస్త్రం విశిష్టమైనది. అది శాస్త్రాలకు శాస్త్రం. నిర్జీవమైన పదార్థతత్త్వాన్ని వివరించే భౌతిక రసాయనికాది శాస్త్రాలకంటే జీవపదార్థ లక్షణాలను ప్రాణులను గురించి చెప్పే శాస్త్రాలు విశిష్టమైనవి. జీవశాస్త్రంలోకూడా మానవ శారీరక శాస్త్రానికీ, అందులో మానవ మనస్తత్వ శాస్త్రానికీ ప్రత్యేకత ఉంది. పదార్థతత్త్వాన్ని వివరించే శాస్త్రాలకంటే వాటి అధ్యయనానికి ఆధారమైన మనస్తత్త్వాన్నిచెప్పే శాస్త్రం గొప్పది. మానసికదశకంటే బుద్ధిదశ విశిష్టమైనది. సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు నిశ్చయాత్మకమైతే బుద్ధిగా మారుతుంది. మానసికదశనూ. బౌద్ధికమైన దశనూ అధిగమించి, ఆత్మతత్త్వాన్ని వివరించే వేదాంతశాస్త్రం అన్ని శాస్త్రాలకంటేగొప్పది. ఆత్మ (Spectator Consciousness) లేనిదే బుద్ధిలేదు. బుద్ధిలేకపోతే మనస్సు ఒక స్థితియానికి రాలేదు. మనస్సు లేకపోతే ప్రపంచం దానిపాటికి అది ఉన్నా లేనట్లే. ఆత్మ అన్నింటి కన్నా గొప్పది. అది ఉంటేనే అన్నీ ఉన్నాయి. అది లేకపోతే ఏదీలేదు.

---

1. వ్యాసుడు, op. cit., భీష్మపర్వము శ్లోకము 66 పుట 2808

అందువల్ల ఆత్మతత్త్వాన్ని గురించి చెప్పే వేదాంతశాస్త్రం శాస్త్రాలకు శాస్త్రంగా పేరుపొందింది. సర్వవిద్యలకూ పరాకాష్ఠ వేదాంతమే. ఉపనిషత్తులలోకూడా "యేన విజ్ఞాతేన సర్వమిదమ్ విజ్ఞాతమ్ భవతి".— "స బ్రహ్మవిద్యాం సర్వవిద్యా ప్రతిష్ఠామ్" అని బ్రహ్మవిద్యా విశిష్టత వివరింపబడింది.

ప్రస్తుత ప్రకరణంలో వర్ణ, వర్గ, లింగ, వయో భేదాలనూ, విద్యాస్వరూప స్వభావాలను దృష్టిలో ఉంచుకొని వివిధవిద్యలగురించి చెప్పడంజరిగింది. గురువులు-శిష్యులు వారి పరస్పర సంబంధం అనే విషయాలను గురించి చెప్పడం తరువా ప్రకరణంలోని ముఖ్యాంశం.



# 4. మహాభారతం – గురుశిష్యుల సంబంధం

విద్య మూడు స్తంభాల మండపం. ఆచార్యుడూ, అంతేవాసీ, బోధ్యాంశమూ అనేవి మూడు స్తంభాలు. దేశాన్నిబట్టి, కాలాన్నిబట్టి ఒక్కొక్క స్తంభానికి అధిక ప్రాధాన్యమేర్పడుతూ వచ్చింది. విద్యారంగంలో ఆచార్యుడు పూర్వరూపం. అంతేవాసి ఉత్తరరూపం. విద్య వారి కలయిక. ప్రవచనం వారిరువురికీ సంబంధాన్ని కలిగించేది. ఒకనాటి శిష్యుడు కొంతకాలానికి గురువుగా మారడం సంభవమే. ఆచార్యుడు జీవితాంతం విద్యార్థిగా ఉండడమూ అవసరమే. దేశకాలాలనుబట్టి ఆచార్యుడు మార్గదర్శకుడుగా, బోధకుడుగా, పర్యవేక్షకుడుగా, పరీక్షకుడుగా వ్యవహరించడం జరుగుతుంది. గురుశిష్యులమధ్య సత్సంబంధం ఉంటే బోధన రాణిస్తుంది.

4.1. "గురువు." పర్యాయపదాల రూపనిష్పత్తి :

గర్భాధానాది సంస్కారాలను శాస్త్రోక్తంగాచేసి విద్యార్థికి అన్నంపెట్టి పోషించేవాడు గురువని స్మృతులలో విద్యాభిధానం అనే విభాగంలో చెప్పడం జరిగింది. గురు శబ్దవ్యుత్పత్తి ఇంతమాత్రమేకాదు. బ్రహ్మవిద్య నుపదేశించేవాడు గురువనే నిర్వచనంకూడా ఉంది. అజ్ఞానతిమిరాన్ని తొలగించి జ్ఞానరూపమైన తేజస్సును చూపేవాడు గురువు. ప్రస్తుతం "పండితుడు", 'శ్రోత్రియుడు', 'ఋత్విజుడు', 'పురోహితుడు', 'ఆచార్యుడు', 'ఉపాధ్యాయుడు' అనే పదాల రూపనిష్పత్తిని పరిశీలించాలి.

పండ అంటే ఉన్నది ఉన్నట్లు తెలుసుకొనేబుద్ధి. పండగలవాడు పండితుడు. మహాభారతం (ఉద్యోగపర్వం 16-29 శ్లోకాల)లో పండిత లక్షణాలను గురించి చెప్పడం జరిగింది. శ్రద్ధ, విషయపరిజ్ఞానం, నిరంతర ప్రయత్నం, సహనం, "చిరకాల శ్రవణం"1 "శీఘ్రగ్రహణం"2 ఇంద్రియ నిగ్రహం, అడ్డులేని వాక్ప్రవాహం, చిత్రకథాకుశలత్వం, హాస్యపరత్వం, సమయస్ఫూర్తి, "కర్తవ్యపాలనం"3 పండితునికి ఉండవలసిన గుణాలు. ఆధ్యాత్మిక దృష్టితో చెప్పబడిన

---

1. చిరం శృణోతి.
2. క్షిప్రం విజానాతి
3. యః క్రియావాన్ స పండితః

వ్యాసుడు, op. cit., వనపర్వము శ్లోకము 110 పుట 1833

ఈ లక్షణాలు లౌకిక విద్యను బోధించేవారికికూడా వర్తిస్తాయి.

శ్రుతిని అధ్యయనం చేసినవాడు శ్రోత్రియుడు. 'శ్రుతిం అధీతే ఇతి శ్రోత్రియః'[1] అని శ్రోత్రియ శబ్ద వ్యుత్పత్తి. వేదాలలో ప్రత్యేకాభినివేశము గలవాడు శ్రోత్రియుడు. అలాంటి ప్రత్యేకమైన శ్రద్ధవల్లనే అతడు వేదాలలోని ఒక్క అక్షరాన్నికూడా వదలిపెట్టకుండా అధ్యయనం చేయగలుగుతాడు. వేదాలను ప్రవచనం చేయడం, ఛందస్సులను సంగ్రహించడం శ్రోత్రియుని ధర్మాలు. అర్థము తెలిసికొనకుండా వేదాలను కంఠస్థముచేసిన శ్రోత్రియుని గంధపుచెక్కలు మోసే గార్దభమని చెప్పినారు. శ్రోత్రియులు ఒకచోటచేరి నివసించే ప్రదేశాలను శ్రోత్రియ గ్రామములుగా వ్యవహరించడం జరిగింది. అగ్రహారాలని వీటికి నామాంతరము. శిష్టులైన బ్రాహ్మణులకు అగ్రహారాలివ్వడం ప్రాచీన సంప్రదాయం. అలాంటి అగ్రహారాలు నాడున్నట్లు మహాభారతంలోని అంతర్గత ఆధారాలవల్ల విదితమౌతుంది. పాండవులు ఏకచక్రమనే అగ్రహారంలో బ్రాహ్మణ భావంతో బ్రాహ్మణగోష్ఠి జరుపుతూ ఉన్న వృత్తాంతాన్ని నన్నయ ఇట్లా వర్ణించినాడు.

"లలిత జటాజినకుశవల్కల ధరులై వేదమొప్పగా జదువుచు ని
య్మల బ్రహ్మచారి వృత్తిని వెలయగ నందుండిరొక్క విప్రగృహమునన్"[2]

శరద్వసంతాలలో యాగాన్ని చేసేవాడు ఋత్విజుడు. హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ మొదలైన ఋత్విజులను గురించి "ఋత్విజుల విద్య" అనే శీర్షికలో చెప్పడం జరిగింది.

పురోహితుడంటే శాంతికపౌష్టికాది క్రియలలో ముందుండి యజమానుని మేలు కోరేవాడు వేదవేత్తా, పురుషార్థ తత్త్వజ్ఞుడూ, గుణవంతుడూ, జితేంద్రియుడూ ఐన ద్విజుడు పురోహితుడుగా ఉండదానికిఅర్హుడు. వసుదేవుని పురోహితుడైన కశ్యపుడు, పాండవుల పురోహితుడు ధౌమ్యుడు, ద్రుపదుని పురోహితుడు అట్లాంటి గుణసంపన్నులు. పాండవులు ధౌమ్యుని పురోహితునిగా వరించిన వృత్తాంతాన్ని నన్నయ ఇట్లా వర్ణించినాడు.

"వీతసమస్తదోషుడయి వేడ్కఁ దపంబొనరించుచున్న వి
ఖ్యాతుఁ బురోహిత ప్రవరుగా వరియించిరి భక్తితో జగ

---

1. అమరసింహుడు, op. cit., పుట 145
2. నన్నయ, op. cit., ఆదిపర్వము 6వ ఆశ్వాసము పద్యము 237 పుట 383

త్పూత చరిత్రు సాధుజన పూజితు ధార్మికు ధౌమ్యు దేవల
భాతృవరున్ మహాత్ము హితభాషణు భూసుర వంశభూషణున్"[1]

"తేజోరూప బుద్ధి విభవంబుల బృహస్పతి సదృశుండై
వేదవేదాంగ విదుండైన ధౌమ్యుం బురోహితుగాఁ బడసి"[2]

ఆచార్యునికీ. ఉపాధ్యాయునికీ ఉండే భేదాన్ని "స్మృతులలో విద్యావిధానం" అనే విభాగంలో వివరించడం జరిగింది. 'ఋత్విజుడు', 'ఆచార్యుడు', 'గురువు', 'ఉపాధ్యాయుడు' వీరికి ఉండే భేదాన్ని గురించి మనుస్మృతిలో చెప్పబడింది. మహాభారతంలో పలుసందర్భాలలో 'పురోహితుడు', 'ఉపాధ్యాయుడు', 'ఆచార్యుడు', 'గురువు' అనే పదాలను పర్యాయపదాలుగ వాడినట్లు విదితమౌతుంది.

జనమేజయుడు సరమశాపానికి ప్రతీకారముగా శాంతిక పౌష్టిక కర్మలు చేయించాలని పురోహితునికోసం వెదుకుతూ శ్రుతశ్రవుని ఆశ్రయించిన సందర్భంలో మహాభారతంలోని (ఆదిపర్వము గద్యము 14 పుట 47, పుట 48 గద్యము 20) మాటలను (తస్యతం పుత్రమభిగమ్య జనమేజయః పారీక్షితః పౌరోహిత్యాయవ్రే సతం పురోహిత ముపాదాయో పావృత్తో భ్రాతౄనువాచ మయాయం వృత ఉపాధ్యాయః) బట్టి 'పురోహితుడు', 'ఉపాధ్యాయుడు' అనే పదాలు పర్యాయపదాలని బోధపడుతుంది.

ధౌమ్యుడు శిష్యులభక్తిని పరీక్షించునపుయంలో 'గురువు'[3] 'ఉపాధ్యాయుడు'[4] అనే పదాలను ఒకే అర్థంలో వాడినట్లు తెలుస్తుంది.

మహాభారతం (ఆదిపర్వం 3వ ఆశ్వాసం పద్యం 100 పుట 144) లోని, "మనుజాధిప వృషపర్వుండను దానవపతికి శుక్రు డాచార్యుండై," (గద్యం 107 పుట 145)లోని, "కచుండును దేవహితార్థంబు వృషపర్వు పురంబునకుం జని యందు వేదాధ్యయన శీలుండై సకల దైత్య దానవ గణోపాధ్యాయుండై యున్న శుక్రుంగని నమస్కరించి", పద్యం 110 పుట 146లోని "గురుని గురుతనూజఁ గొలిచి" అనే

---

1. నన్నయ, op. cit., ఆదిపర్వము 7వ ఆశ్వాసము పద్యము 158 పుట 440
2. నన్నయ, op. cit., ఆదిపర్వము 7వ ఆశ్వాసము గద్యము 159 పుట 440
3. "ఉపాధ్యాయేన సందిష్ట ఆరుణిః" వ్యాసుడు, op. cit., భారతం ఆదిపర్వం శ్లోకము 23 పుట 48
4. సతస్మాదుపాధ్యాయః సర్వమేవ భైక్ష్య మగృహ్ణాత్ సతథేత్యుక్త్వా పున రరక్షద్ గాః అహని రక్షిత్వా నిశా ముఖే గురుకుల మాగమ్య

నన్నయ ప్రయోగాలనుబట్టి, 'ఆచార్యుడు', 'గురువు', 'ఉపాధ్యాయుడు' అనే పదాలు పర్యాయపదాలని విదితామౌతుంది.

గురువుయొక్క విశిష్టతను గురించి మహాభారతంలో ఆ యా సందర్భాలలో చెప్పడంజరిగింది. గురువును పూజించడం శిష్యుని విధి. ఐతే అర్థం తెలియకుండా విషయాన్ని ఒప్పచెప్పే వాతరేచకులను శిష్యుడు ఆశ్రయించకూడదు. గురువులో కొంచెము దోషమున్నా శిష్యుడు పట్టించుకోకూడదు. గర్వపరుడై కార్యాకార్యాలను మరచి దుర్మార్గుడుగా ప్రవర్తించేవాడు గురువైనా వదలిపెట్టడం శిష్యుని విధి. గురువును 'నీవని' సంబోధించడం తగదు. గురువును ఆరాధించిన శిష్యునికి స్వర్గం వస్తుంది. గురువును అవమానించిన వటుడు నరకంలో పడతాడు. కేవలం భౌతికజన్మను ప్రసాదించే తల్లిదండ్రులకంటే అజరమూ, అమరమూ ఐన జ్ఞాన జన్మను ప్రసాదించే గురువు గొప్పవాడని క్రింది శ్లోకంలో వర్ణింపబడింది.

"శరీరమేవ సృజతః పితా మాతాచ భారత
ఆచార్యశిష్టా యాజాతిః సాదివ్యాసాఽజరామరా"1

గురుముఖంగా నేర్చిన విద్యవల్ల శిష్యుడు శక్తి సంపన్నుడౌతాడు. మహాభారతంలో రైభ్యుడనే ముని గురుముఖంగా విద్య నభ్యసించినందువల్ల అతనికి దివ్యమైనశక్తి సంక్రమించిన వృత్తాంతాన్ని నన్నయ ఇట్లా వర్ణించినాడు.

"గురుశుశ్రూష యొనర్చుచుఁ బరమ క్లేశమునఁజేసి పడసిన విద్యల్
స్ఫురియించుఁగాక గురుముఖ విరహితముగఁ బడసినవియు వెలయునె యెందున్"2

గురుముఖంగా అధ్యయనం సాగించిన శిష్యుడు కొంతకాలానికి గురువుగా మారడం, అతడు తన శిష్యులకు జ్ఞానాన్ని ప్రసాదించడం జరుగుతూ ఉంటుంది. ఇది గురుశిష్య సంప్రదాయం. మహాభారతం (పుట 2623, భీష్మపర్వం 1వ శ్లోకం)లోని—

"ఇమమ్ వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్।
వివస్వాన్మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్॥"

-మాటలనుబట్టి ఆనాటి గురుశిష్య సంప్రదాయము విదితమౌతుంది. అవ్యయమైన జ్ఞానకర్మయోగాన్ని శ్రీకృష్ణుడు సూర్యునికి ఉపదేశించడం సూర్యుడు తన పుత్రుడైన

1. వ్యాసుడు, op. cit, శాంతిపర్వము శ్లోకము 19 పుట 4703
2. నన్నయ, op. cit , అరణ్యపర్వము 3వ ఆశ్వాసము పద్యము 282 పుట 140

వైవస్వత మనువుకు చెప్పడం, వైవస్వత మనువు ఇక్ష్వాకుడనే రాజుకు దాన్ని వివరించడం జరిగింది. సంప్రదాయపరంపరగా వచ్చిన జ్ఞాన కర్మయోగాన్ని రాజర్షులు తెలుసుకొనినారు. అయితే అది ఈ లోకంలో క్రమంగా కాలగర్భంలో కలిసి పోయింది. మహాభారతకథను ప్రచారంచేయడం గురుశిష్య పరంపరగా జరిగింది. భారతాన్ని భూలోకంలో ప్రచారంచేయడానికి వ్యాసుడు వైశంపాయనుడనే తన శిష్యుని నియోగించినాడు. అతడు జనమేజయునికి భారతకథను వినిపించినాడు. ఉగ్రశ్రవసుడు దానిని వైశంపాయనునివల్లవిని శౌనకాది మహామునులకు చెప్పినాడు.

4.2. శిష్య శబ్దాది పర్యాయపదాల వ్యుత్పత్తి :

'శిష్యుడు',1 'అనూచానుడు',2 'ఛాత్రుడు',3 'సమావృత్తుడు';4 'అంతేవాసి'5 'బ్రహ్మచారి'6 అనే పదాల వ్యుత్పత్తిని వివరించడం ప్రస్తుత విషయం. శిక్షింప తగినవాడు శిష్యుడు. గురువుదగ్గర షడంగయుక్తమైన వేదాన్ని అధ్యయనంచేసిన వాడు అనూచానుడు. గురువుయొక్క దోషాన్ని కప్పిపుచ్చువాడు ఛాత్రుడు. గురువుదగ్గర కొంతకాలం విద్యనభ్యసించిన తరువాత గృహస్థాశ్రమాన్ని స్వీకరించిన వాడు సమావృత్తుడు. గురువుయొక్క సమీపమునందుండేవాడు అంతేవాసి. వేదాధ్యయన వ్రతము నాచరించేవాడు బ్రహ్మచారి. క్రొత్తగా వేదాధ్యయనము చేయువాడు శైక్షుడు. ఒకే గురువుదగ్గర విద్యాధ్యయనం చేసినవారిని సతీర్థులని పేర్కొనినారు. మహాభారతంలో కృష్ణ బలరాములూ, ద్రోణ ద్రుపదులూ, కౌరవ పాండవులూ మొదలైనవారు సతీర్థులే. వారు ఆ యా గురువులదగ్గర విద్యాభ్యాసం చేసినారు.

వ్యక్తి జీవితంలో విద్యార్థిదశ ప్రధానమైనది. అదే బ్రహ్మచర్యాశ్రమం.

---

1. శాసనీయః శిష్యః శాసు అనుశిష్టౌ
   లింగయసూరి, గురుబాలప్రబోధిక పుట 443, వి. ఆర్. సన్స్, మద్రాసు, 1962
2. సాంగే శిక్షాద్యంగషట్కే ప్రవచనే వేదే గురో స్సకాశాత్ అధీతీ
   కృతాధ్యయనో యః సః అనుచాన ఇత్యుచ్యతే. పుట 442 ,,
3. గురోరసచ్చరిత్రం ఛాదయతీతి ఛాత్రః ,, 443 ,,
4. గురుకులాద్గృహం ప్రతిసమావర్తతే స్మ సమావృత్తః ,, 442 ,,
5. గురోరన్తే నికటే వసతీత్యన్తే వాసీ ,, 443 ,,
6. బ్రహ్మవ్రతం చరంతీతి బ్రహ్మచారిణః ,, 443 ,,

బ్రహ్మచర్యంలో నాలుగు పాదాలున్నాయి. గురువుకు నమస్కారంచేయడం శిష్యునివిధి. అతడు దురభిమానాన్ని. కోపాన్నీ వర్జించి అప్రమత్తుడై శౌచాన్ని పాటిస్తూ స్వాధ్యాయం చేయడంకూడా అతనివిధి. ఇది బ్రహ్మచర్యంలో మొదటిపాదం.[1] శిష్యుడు తన ధనప్రాణాలనైనా త్యజించి త్రికరణశుద్ధిగా గురువుకు ప్రియమైన పనినిచేయడం, గురుపత్నినీ, అతని పుత్రులనూ శ్రద్ధా భక్తులతో సేవించడం బ్రహ్మచర్యంలో రెండవపాదం.[2] ఆచార్యుడు తనకుచేసిన ఉపకారాన్ని మనస్సులో ఉంచుకొని కృతజ్ఞతతో ఆయనవల్లగదా నేనింత వాడనైనానని వ్యవహరించడం బ్రహ్మచర్యంలో మూడవపాదం.[3] ఆచార్యుడు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం చేయకుండా, అతనినుండి దూరంగా పోవడం యోగ్యుడైన శిష్యుని లక్షణంకాదు. ఏదో ఒక ప్రతిఫలాన్ని అందజేసి అతన్ని సంతోషపెట్టడం శిష్యునివిధి. అలాగా ప్రతిఫలాన్ని అందజేసినా. గురుసేవచేసినా గురువుకు ఉపకారం చేసినాననే అహంకారం శిష్యునికి పనికిరాదు. ఇది బ్రహ్మ చర్యంలో నాల్గవపాదం.[4]

విద్యార్థులలో కనిపించే దోషాలగురించి మహాభారతంలో ఇట్లా చెప్పడం జరిగింది

---

1. గురుం శిష్యో నిత్యమభివాదయీత స్వాధ్యాయ మిచ్ఛేత్ శుచిరప్రమత్తః మానం నకుర్యాన్నా దధీత రోషమేష ప్రథమో బ్రహ్మచర్యస్య పాదః
వ్యాసుడు, op. cit., ఉద్యోగపర్వము శ్లోకము 10 పుట 2184
(శిష్యవృత్తి క్రమేణైవ విద్యా మాప్నోతి యః శుచిః)

2. "ఆచార్యస్య ప్రియం కుర్యాత్ ప్రాణైరపి ధనైరపి
కర్మణా మనసా వాచా ద్వితీయః పాద ఉచ్యతే
సమాగురౌ యథా వృత్తిర్గురు పత్న్యాం తథాఽఽచరేత్
తత్పుత్రే చ తథా కుర్వన్ ద్వితీయః పాద ఉచ్యతే."

3. "ఆచార్యే ణాత్మ కృతమ్ విజానన్ జ్ఞాత్వాచార్థం భావితోఽస్మీ త్యనేన
యన్మన్యతే ప్రతిహృష్ట బుద్ధిః సవై తృతీయో బ్రహ్మచర్యస్య పాదః"

4. "నాచార్యస్యా నపాకృత్య ప్రవాసం ప్రాజ్ఞః కుర్వీత నైతదహం కరోమి
ఇతీవ మన్యేత న భాషయేత సవై చతుర్థో బ్రహ్మచర్యస్య పాదః"

"ఆలస్యం మదమోహౌచ చాపలం గోష్ఠి రేవచ।
స్తబ్ధతా చాభిమానిత్వం తథాత్యాగిత్వమేవచ
ఏతేవై సప్తదోషాః స్యుః సదా విద్యార్థినాం మతాః"1

ఆలసత్వం, మదం. మోహం, చపలత్వం గోష్ఠి, ఉద్దండత, అభిమానం, గ్రహించిన విషయాలను వదలివేయడం విద్యార్థులలోని దోషాలు. సోమరితనం విద్యార్థికి శత్రువు వంటిది. అందువల్ల దానిని మొదటనే చేర్చినారు. మదం, మోహం మొదలైన దోషాలున్న విద్యార్థికి జ్ఞానం సిద్ధించదు. విద్యార్థి బుద్ధిలో బృహస్పతి ఐనా, ధర్మతత్త్వాన్ని తెలుసుకోవాలంటే ఆత్మవిదులైన పెద్దలను ఆశ్రయించవలసిందే. మహాభారతం (పుట 2169)లోని—

"సుఖార్థి నః కుతోవిద్యా నాస్తి విద్యార్థి నః సుఖమ్।
సుఖార్థీ వాత్యజేద్ విద్యాం విద్యార్థీ వాత్యజేత్ సుఖమ్॥"

—అనే శ్లోకంవల్ల సుఖం కోరేవానికి విద్యరాదని, విద్యను కోరేవానికి సుఖం లేదనీ, సుఖాన్ని కోరితే విద్యను వదలివేయాలనీ, విద్యను కోరితే సుఖాన్ని వదులుకోవాలనీ విదితమౌతుంది. గురుశిష్యుల ప్రవర్తనకు సంబంధించిన వృత్తాంతం మహాభారతంలో ఇట్లా ఉంది.

"అశుశ్రూషు ర్గురోః శిష్యః కశ్చిత్ శిష్య సఖోగురుః"2
"ప్రాతః ప్రాతశ్చ సుప్రశ్నం కల్పనం ప్రేషణ క్రియాః।
శిష్యా నప్రహితాస్తేషా మకుర్వన్ గురవః స్వయమ్॥"3

శిష్యుడు గురు శుశ్రూష చేయడు. గురువులలో ఎవడో ఒకడు శిష్యునితో సహవాసం చేస్తాడు. అంతేకాదు, గురువులు ప్రతిదినం ఉదయాన్నే శిష్యుల దగ్గరికిపోయి రాత్రి సుఖంగా గడచినదా అని అడగడం. వారి వేష భూషలపైన శ్రద్ధవహించడం, విద్యార్థుల ప్రేరణ లేకపోయినా గురువు తానే దౌత్యాది కార్యాలు నిర్వర్తించడం జరుగుతుందని వేదవ్యాసుడు ఆనాడే చెప్పినాడు.

### 4.3. ధౌమ్యుని శిష్యుల వృత్తాంతం :

ధౌమ్యుని ఆశ్రమంలో ఆరుణి, ఉపమన్యుడు, వేదుడు అనేవారు శిష్యులుగా

1. వ్యాసుడు, op. cit., ఉద్యోగపర్వము శ్లోకము 15 పుట 2185
2. వ్యాసుడు, op. cit., శాంతిపర్వము శ్లోకము 72 పుట 5029
3. వ్యాసుడు, op. cit., ,, ,, 75 ,,

చేరినట్లు సంస్కృత భారతంలో ఉంది. గురువుగారికి వారు సకలోపచారాలు చేస్తుండగా, ధౌమ్యుడొకనాడు ఆరుణిని వరిపొలానికిపోయి నీటి ప్రవాహాన్ని ఆపమని ఆజ్ఞాపించినాడు. అతడచటికిపోయి ఎన్నిమార్లు కట్టకట్టినా, ప్రవాహపు వేగానికి అది తెగడంవల్ల ఆరుణి తానే అడ్డముగా పడుకొనినాడు. ప్రవాహము ఆగింది. ఆరుణి ఆశ్రమానికి రాలేదను చింతతో ఆచార్యుడు శిష్యులతో వరిపొలానికిపోయి, 'ఆరుణీ' అని పిలిచినాడు. వెంటనే ఆరుణి లేచివచ్చి గురువుకు నమస్కరించి జరిగిన వృత్తాంతాన్ని వివరించినాడు. ఆచార్యుడు శిష్యుని భక్తికి మెచ్చుకొని సకల విద్యలు స్ఫురించేలాగా వరమిచ్చినాడు. ఆచార్యుడు ఆజ్ఞాపిస్తే దేహాన్ని త్యజించడానికైనా శిష్యుడు సిద్ధంగా వుండాలని దీని అర్థం.

ధౌమ్యుడొకనాడు ఉపమన్యుని పిలిచి తమ ఆవులను మేపమని చెప్పినాడు. ఆచార్యుని ఆజ్ఞను పాటించి ప్రతిదినం ఉపమన్యుడు వేకువనేలేచి ఆవులనుతోలుకొని అరణ్యానికివెళ్ళి వాటిని లెస్సగామేపి సాయంకాలానికి ఆశ్రమానికి వస్తుండేవాడు. కొంతకాలం జరిగిన తరువాత శిష్యుడు బలిసి ఉండడంచూచి, ఆచార్యుడు కారణమేమని ప్రశ్నించినాడు. మధ్యాహ్న సమయానికి ఆశ్రమానికివచ్చి, భిక్షకువెళ్ళగా దొరికిన ఆహారాన్ని తినడంవల్ల బలిసి ఉన్నానని శిష్యుడు చెప్పినాడు. నా అనుమతి లేకుండా భైక్ష్యాన్ని తినవద్దని ధౌమ్యుడుచెప్పినాడు. ఉపమన్యుడు సరేనని తనవిధిని నిర్వర్తిస్తుండగా, కొంతకాలం జరిగిన తరువాత శిష్యుడు ముందులాగా బలిసి ఉండడం చూచి, ఆచార్యుడు మరలా కారణం అడిగినాడు. రెండవమారు భిక్షకు వెళ్ళగా దొరికిన భైక్ష్యాన్ని ఉపయోగించుకొనడంవల్ల బలిసి ఉన్నానని ఉపమన్యుడు చెప్పినాడు. గురువు ఉపమన్యునితో రెండవమారు భిక్షకు వెళ్ళవద్దని చెప్పినాడు. ఆచార్యుడు భైక్ష్యాన్ని నిషేధించినా, ఆవులపాలు త్రాగకూడదని చెప్పినా, దూడలు పాలుత్రాగే సమయంలో వాటి నోటినుండివచ్చే నురుగును తాగకూడదనినా, ఉపమన్యుడు సరేనని తన విధిని నిర్వర్తిస్తుండేవాడు. ఒకనాడు ఉపమన్యుడు ఆకలికి ఓర్వలేక పండిన జిల్లేడు ఆకులుతినినందువల్ల గ్రుడ్డివాడై అడవిలో తిరుగుచూ బావిలోపడినాడు. శిష్యుడు రాలేదను చింతతో ఆచార్యుడు అర్ధరాత్రి సమయంలో అడవికివెళ్ళి, ఉపమన్యుడు బావిలోపడి ఉండడం తెలుసుకొని, పరితపించి, అశ్వినీ దేవతల స్తుతించమని శిష్యునితో చెప్పినాడు. అతడు అశ్వినీదేవతల స్తుతించగా వారు ప్రత్యక్షమైనారు. ఒక అతిరసాన్ని ఉపమన్యునికి ఇచ్చినారు. దానిని తింటే ఉపమన్యునికి దృష్టివస్తుందనిచెప్పినారు. గురువు ఆజ్ఞలేనిదే దేనినీతిననని ఉపమన్యుడు

చెప్పినాడు. అశ్వినీ దేవతలు అతని గురుభక్తిని మెచ్చుకొని దృష్టిని ప్రసాదించినారు. ఉపమన్యుని వినయ విధేయతలకు ధౌమ్యుడు సంతోషించినాడు. వేదాలూ, వేదాంగాలూ, సకల శాస్త్రాలూ సిద్ధించేలా అతనికి వరమిచ్చినాడు.

ధౌమ్యుని మూడవ శిష్యుడు వేదుడు. ఆచార్యుడతనికి గృహకృత్య నిర్వహణాన్ని అప్పగించినాడు అతడు ప్రతిదినం సమిధలు తీసుకొని రావడం, అగ్నుల వెలిగించడం మొదలైన పనులను భక్తి శ్రద్ధలతో నిర్వహించడంవల్ల ధౌమ్యుడు వేదుని గురు భక్తిని మెచ్చుకొని సర్వజ్ఞత్వాన్ని ప్రసాదించినాడు. శీతోష్ణాదిద్వంద్వాల సహించి, గురువు చెప్పిన కార్యాలను నిర్వర్తించడం శిష్యుని విధి అని దీనివల్ల బోధపడుతుంది.

4.4 ఉదంకుని వృత్తాంతం:

వేదుడు ధౌమ్యుని ఆశ్రమంలో కొంతకాలం గడపి తరువాత అతడు గురువై సొంత ఆశ్రమాన్ని స్థాపించుకొనినాడు. పౌష్య జనమేజయు లతనిని ఋత్విజునిగా వరించినారు. వేదుడు తన శిష్యుడైన ఉదంకునికి ఆశ్రమ కార్య నిర్వహణాన్ని అప్పగించి, యాగార్థము వెళ్ళగా, అతని భార్య ఋతుమతి ఐనది. ఆమెకు గర్భాధానము కానిమ్మని కొందరు స్త్రీలు ఉదంకునితో చెప్పినారు. అతడు వారి మాటలను వినిపించుకోలేదు. వేదుడు తిరిగి వచ్చి జరిగిన వృత్తాంతాన్ని తెలుసుకొని సర్వమనోరథాలు సిద్ధించేలా ఉదంకునికి వరమిచ్చినాడు.

నన్నయ ఉదంకుని విద్యాభ్యాసాన్ని గురించి ఇట్లా వర్ణించినాడు.

"పంకజ భవ సన్నిభుఁ డఘ
పంకక్షాళన మహా తపస్సలిలుఁ డనా
తంకమతి పైల శిష్యుఁడు
దంకుండను మునివరుండు దద్దయు భక్తిన్."1

"గురు కులమునందు గురులకుఁ
బరిచర్య లొనర్చి తాన పరిమిత నిష్ఠా
పరుఁడై జ్ఞానము వడసెను
గురుదయ నణిమాది కాష్ట గుణముల తోడన్"2

1. నన్నయ, op. cit., ఆదిపర్వము - 1వ ఆశ్వాసము పద్యము 91 పుట 33
2. నన్నయ, op. cit, 1వ ఆశ్వాసము పద్యము 92

ఉదంకుడు పైలుని శిష్యుడు. అతడు గురు శుశ్రూషచేసి జ్ఞానాన్ని సంపాదించినాడు. అతనికి గురువు దయవల్ల అణిమాది అష్టసిద్ధులు సంక్రమించినాయి.

4.5. కచుని విద్యాభ్యాసము:

కచుడు బృహస్పతి పుత్రుడు. మృతసంజీవని విద్య దేవతలకు తెలియదు. ఆ విద్యను అభ్యసించడానికి కచుడు సమర్థుడని తెలుసుకొని, అతనిని శుక్రుని దగ్గరకు పంపగోరి దేవతలు అతనితో ఇట్లా అన్నారు.

"బాలుండవు నియమ వ్రత
శీలుండవు నిన్నుఁ బ్రీతిఁ జేకొని తద్వి
ద్యాలలనా దానముఁ గరు
ణాలయుఁడై చేయు నమ్మహాముని నీకున్."1

కచుడు బాలుడు. గ్రహణధారణ సామర్థ్యం కలవాడు. అతడు దేవతల కోరికపై సంజీవని విద్య నభ్యసించడానికి వృషపర్వుని పురాన్ని చేరుకొని శుక్రుని చూచి నమస్కరించి ఇట్లా అన్నాడు.

"ఏనుఁ గచుండను వాఁడమ
హానియమ సమన్వితుడ బృహస్పతి సుతుడన్
మానుగ వచ్చితి నీకును
భాను నిభా శిష్య వృత్తిఁ బనిసేయంగన్"2

శుక్రుడు, కచుని తన శిష్యునిగా స్వీకరించిన వృత్తాంతాన్ని నన్నయ ఇట్లా వర్ణించినాడు.

"అమ్మౌని కుమారుని సుకుమారత్వంబును వినయ ప్రియ వచన మృదు మధురత్వంబును ననవరత నియమ వ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబునుం జూచి శుక్రుండతి స్నేహంబున వీనిం బూజించిన బృహస్పతిం బూజించిన యట్లయని యభ్యాగత పూజలవాని సంతుష్టుంజేసి శిష్యుంగా జేకొని యున్నంత"3 శిష్యుల మధ్య రవితో ఆసీనుడై అధ్యాపనంసాగించే శుక్రునిచూచి, కచుడు 'భానునిభా' అని సంబోధించడంవల్ల ఆయనకు సంతోషము కల్గినది. ఉత్తముడైన గురువు సూర్యుని

1. నన్నయ, op. cit., ఆదిపర్వము-3వ ఆశ్వాసము పద్యము 106. పుట 145
2. నన్నయ, op. cit., ,, ,, ,, ,, 108 ,, 146
3. నన్నయ, op. cit., ,, ,, ,, గద్యము 109 ,, ,,

పంటివాడు. సూర్యుడు తన తేజస్సును అంతటా ప్రసరింపజేసి అంధకారాన్ని తొలగించినట్లు, గురువు జ్ఞాన జ్యోతిని ప్రసరింపజేసి శిష్యుని అజ్ఞానాంధకారాన్ని తొలగిస్తాడు. అందువల్లనే కచుడు ఆయనను 'భానునిభా' అని సంబోధించినాడు. కచుడు తన శుశ్రూషా కౌశలంతో గురువుగారికి ప్రియ శిష్యుడైనాడు. కచుని గురు శుశ్రూషా కౌశలాన్ని గురించి నన్నయ వర్ణించిన పద్యమిది.

"పనియేమి పంచినఁ బడపడి చేసెద
నానక తప్ బంచిన యా క్షణంబ
చేయుచునిజ గురుచిత్త వృత్తికిఁ గడు
నను కూలుఁడై వినయంబు తోడ
మనమునఁ జెయ్వుల మాటల భక్తినే
కాకారుడై నుని యంత కంటె
దేవయానికి సువిధేయుఁడై ప్రియ హిత
భాషణములఁ బుష్ప ఫల విశేష
దానములను సంతత ప్రీతిఁ జేయుచుఁ
నివ్విధమునఁ బెక్కులేండ్లు నిష్ఠ
గురుని గురు తనూజఁ గొలిచి యయ్యిరువుర
నెమ్మి వడసెఁ దనదు నేర్పుపేర్మి"1

శుక్రునికి ప్రియ శిష్యుడైన కచునిపై రాక్షసులకు ద్వేషము కలిగినది, అందువల్ల వారు కచుని చంపి కాల్చి భస్మముచేసి, దానిని సురతో కలిపి శుక్రునిచే త్రాగించినారు. కచుడు అరణ్యంనుండి ఆశ్రమానికి తిరిగి రాలేదని బాధపడే దేవయానిని చూచి, కచుని కోసం వెదకి, అతడు తన ఉదరంలోనే ఉన్నాడని తెలుసు కొనినాడు. సురాపానం మహా పాపమని శపించినాడు. ఆ సందర్భంలో నన్నయ వర్ణించిన పద్యమిది.

"మొదలి పెక్కు జన్మములఁ బుణ్య కర్మముల్
పరగఁ బెక్కు సేసి పడయఁ బడిన
యట్టిమేలుక జనుల కాక్షణ మాత్రన
చెఱుచు మద్యసేవ సేయనగునె"2

---

1. నన్నయ, op. cit., ఆదిపర్వము తృతీయాశ్వాసము పద్యము 110 పుట 148
2. నన్నయ, op. cit., ,, ,, ,, ,, 120 ,, 149

మహాభారతము (ఆదిపర్వము పుట 241) లోని,—

"మాయా చైతాం విప్రధర్మోక్తి సీమాం
మర్యాదాం వై స్థాపితాం సర్వలోకే
సంతో విప్రాః శుశ్రువాంసో గురూణాం
దేవా లోకాశ్చో పశృణ్వంతు సర్వే"

—అనే శ్లోకంవల్ల సాధు పురుషులూ, బ్రాహ్మణులూ, గురువుల దగ్గర అధ్యయనం సాగించే శిష్యులూ, దేవతలూ, సర్వులూ, సురను సేవించడంవల్ల పతితులౌతారని శుక్రుడు శాసించినట్లు విదితమౌతుంది. కచుడు, శుక్రుని ఉదరములో ఉన్నప్పుడే సంజీవని విద్యను అభ్యసించి, ఉదరమును చీల్చుకొని బయటికి వచ్చి ఆతనిని బ్రతికించినాడు. ఉదరమును చీల్చుకొని బయటికి వచ్చు కచుడు, ఉదయగిరిదరులలో పొడసూపే పున్నమనాటి చంద్రునిలాగా ఉన్నాడని భారతకర్త వర్ణించినాడు. శుక్రుడు సూర్యుని వంటివాడు, శిష్యుడైన కచుడు చంద్రుని వంటివాడు. సూర్యునికి స్వయం ప్రకాశమాన శక్తి ఉంది, చంద్రునికి లేదు. సూర్యుని శక్తి చంద్రునిపై బడిదాని ప్రకాశింప జేసినట్లే గురువుయొక్క పరిపూర్ణమైన శక్తి అపరిపూర్ణుడైన శిష్యునిలో ప్రవేశించడంవల్ల అతడు పరిపూర్ణుడౌతాడు. శుక్రుని జ్ఞానోపదేశంవల్లనే కచునికి దీప్తి కలిగింది. కచుడు ఆచార్యుని ఉదరాన్ని ఛేదించుకొని బయటికి రాగానే శుక్రుడు విగత జీవుడైనాడు. అలాంటి ఆచార్యుడు, ఉచ్చారణ దక్షుడైన వానిచే అభిహితమైన శబ్దంలాగా సంజీవితుడై వెలిగినాడని నన్నయ వర్ణించడంవల్ల వేదాలలోని శబ్దాలను ఉచ్చరించడంలో జాగ్రత్త వహించకపోతే అనర్థం కలుగుతుందని సూచించడం జరిగింది. కచుడు విద్యనభ్యసించిన తరువాత శుక్రుని ఆజ్ఞను పొంది దేవలోకానికి వెళ్ళినాడు.

4.6. కృష్ణబలరాముల విద్యాభ్యాసము.

కృష్ణ బలరాములు విద్య నభ్యసించడానికి అవంతిపురంలో నివసించే సాందీపని అనే గురువు దగ్గరికి పోయి తమ గోత్ర నామాలను చెప్పి ఆయన అనుమతిపై అతని ఆశ్రమములో చేరినారు. వారి విద్యాభ్యాసాన్ని ఎర్రన, భారతానికి అనుబంధ గ్రంథమైన హరి వంశములో ఇట్లా వర్ణించినాడు.

"అతిలోక ధీగుణోదాత్తులై యన్నయుఁ దమ్ముండు నోలి వేదములు నాల్గు
నంగంబు లాఱును నఱువది నాలుగు దినముల జదివిరి; దనరు ధర్మ

శాస్త్ర తర్క-న్యాయ సరణియు గణిత గాంధర్వ లేఖ్యములు గంధర్వ దంతి రథ శిక్షలును పాసరములు పం(డెంటను నెఱిగిరి. సాంగమై వఱలున స్త్రనిగమమేబది నాళుల నెఱయఁ గలచి రిట్టి నిత్య ప్రకాశ సమిద్ధ మహిమ నూచి నరరూపధరులైన సూర్యచంద్రులవి తలంచె వారలసురుఁ డాత్మలోన"[1]

## 4,7. నారదుని విద్యాభ్యాసము:

నారదుడు ముందు జన్మములో వేదవాదుల యింటి దాసికి పుట్టినవాడు. చిన్ననాటి నుండి వారి దగ్గర ఉండి, వారికి పరిచర్య చేయడంవల్ల అతనికి కొంత బ్రహ్మజ్ఞానము కలిగింది. అన్ని లోకాలలో తిరిగేవాడు కాబట్టి అతడు మూర్తీభవించిన జ్ఞాన స్వరూపమని చెప్పినా అతిశయోక్తి కాదు. నారదుడు వేదోపనిషత్తుల పఠన పద్ధతులనూ అర్థాన్నీ తెలిసినవాడు. ఇతిహాస పురాణజ్ఞుడు. పురాకల్ప విశేష విదుడు.[2] న్యాయశాస్త్రోక్త అధికరణం, ధర్మతత్త్వం, వేదాంగాలూ. పృథివ్యాది భూతాల సాధర్మ్యవై ధర్మవాసాంకర్యాలు తెలిపినవాడు,[3] అతడు వక్త. ప్రగల్భుడు, మేధావి, స్మృతిమంతుడు. దాయ విభాగాది వ్యవహారం తెలిసినవాడు. కవి, నారదుడు, శిష్యులకు అర్థమయ్యేలాగా జ్ఞాన కర్మకాండలను విభజించి చెప్ప గలిగినవాడు. ప్రత్యక్షాది ప్రమాణాలు అతనికి తెలుసు.[4] అతడు పంచావయవ వాక్య గుణదోషాలు తెలిసినవాడు. వక్తలలో బృహస్పతి. పురుషార్థాల తత్త్వాన్ని తెలిసినవాడు. భువనకోశ సర్వస్వాన్ని తెలుసుకొనినవాడు. సురాసుర విచారిణుడు, అతడు సంధి విగ్రహ తత్త్వజ్ఞుడు. స్వపరబలాలను నిర్ణయించడంలో సమర్థుడు షాడ్గుణ్య విధి యుక్తుడు సర్వశాస్త్ర విశారదుడు. యుద్ధ గాంధర్వాఃసేవించేవాడు. సర్వకర్మలలో అప్రతిహతుడు. మహాభారతము (సభా పర్వము

---

1. హరి వంశము. పూర్వ భాగము పుట 224-225
   ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు 1968
2. "వేదోపనిషదాం వేత్తా ఋషిః సురగణార్చితః
   ఇతిహాస పురాణజ్ఞః పురాకల్ప విశేష విత్
3. న్యాయ విద్ధర్మ తత్త్వజ్ఞః షడంగ విదనుత్తమః
   ఐక్య సంయోగ నానాత్వ సమవాయ విశారదః
4. వక్తా ప్రగల్భో మేధావీ స్మృతిమాన్ నయవిత్ కవిః
   పరావర విభాగజ్ఞః ప్రమాణ కృత నిశ్చయః

(ప్రథమా శ్వాసము) లోని పద్యములలో 26 పద్యము నుండి 56 పద్యము వరకు) నారదుడు ధర్మరాజుకు రాజనీతి విషయాలు నేర్పినట్లు విదితమౌతుంది. మహాభారతములో ఆయా సందర్భాలలో అతడు చెప్పిన అనేక విషయాలు అతని ప్రత్యక్ష జ్ఞానానికి నిదర్శనంగా ఉన్నాయి.

నారదుడు సనత్కుమారునితో తనకు తెలిసిన ఋగ్వేదాది విద్యలగురించి చెప్పిన వృత్తాంతం, "అపరవిద్యలు" అనే విభాగంలో వివరించడం జరిగింది. నారదుడు సనత్కుమారునివల్ల ఆత్మజ్ఞానాన్నిపొంది దానిని శుకునకు ఉపదేశించినట్లు మహాభారతంలో ఇట్లా వర్ణింపబడింది.

"అరయఁ గామము క్రోధము
వైరులు ముక్తి కవిరెండు వారించిన సం
సార మనాకారంబగు
నేరిమి యొండేల ముక్తి నెలవుగనుటకున్."[1]

"అపరిగ్రహ సర్వారం
భ పరిత్యాగములు గలుగు పండితునకు దుః
ఖప్రదె . వు వాటిలదు మో
క్ష పదము సొప్పడి తదాత్మక సుఖంబొందున్."[2]

నారదుని వాక్యాలనువిన్న తరువాత శుకునికి సంశయము తీరింది. అతడన్నింటిని వదలి యోగసిద్ధిని పొందడానికి హిమాలయాలకు వెళ్ళినాడు.

---

5. పంచావయవ యుక్తస్య వాక్యస్య గుణదోషవిత్
ఉత్తరోత్తర వక్తా చ వదతోఽపి బృహస్పతేః
6. ధర్మకామార్థ మోక్షేషు యథావత్ కృతనిశ్చయః
తథా భువనకోశస్య సర్వస్యాస్య మహామతిః
7. ప్రత్యక్ష దర్శీ లోకస్య తిర్యగూర్ధ్వ మధస్తథా
సాంఖ్యయోగ విభాగజ్ఞో నిర్వివిత్సుః సురాసురాన్
8. షాడ్గుణ్య విధి యుక్తశ్చ సర్వశాస్త్ర విశారదః
యుద్ధ గాంధర్వ సేవీచ సర్వత్రా ప్రతిఘస్తథా
2-8 వ్యాసుడు, సభాపర్వము శ్లోకాలు 2-8 పుట 675

1. భారతము op. cit., శాంతిపర్వము 6వ ఆశ్వాసము

4.8. వ్యాసశిష్యుల వృత్తాంతము :

వేదవ్యాసునికి శివుని వరంచే పంచభూతాలలోని శక్తి సంక్రమించినందువల్ల శుకుడు జన్మించినాడు. అప్పుడాకాశగంగ స్త్రీమూర్తియైవచ్చి మంగళస్నానం చేయించింది. ఆతనికి శివుడు ఉపనయనం చేసినాడు. ఇంద్రుడు కమండలువును ఇచ్చినాడు. శుకునికి సద్యోజ్ఞానము కలిగింది. దీనిని తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"జనియించిన మాత్రన య
మ్మునిప కిశోరమును వేదములు వొందెను ద
జ్ఞనకు మును వొందిన తెఱఁగు
న నభ్యాలుడు వరించె గురుడుగధిషణున్"[1]

సామాన్యుల జ్ఞానసముపార్జనము జ్ఞానేంద్రియాలపైన ఆధారపడినా, ఒక యోగికి జ్ఞానము సర్వస్వము ఒక్క క్షణములో భాసిస్తుంది. దీనిని "యౌగిక విద్యా పద్ధతి" (Method of yogic learning) అని పేర్కొనడం జరిగింది. శుకునికి సద్యోజ్ఞానముకలిగినా, సంప్రదాయాన్ని పాటించడానికి అతడు బృహస్పతి, వ్యాసుడు, నారదుడు, జనకుడు మొదలైన గురువులను ఆశ్రయించి విద్యాభ్యాసము చేసినాడు. శుకుడు తన తండ్రియైన వేదవ్యాసుని దగ్గర వేదాలు అభ్యసించినాడు. తరువాత బృహస్పతిని గురువుగా వరించినాడు. తిక్కన శుకుని విద్యాభ్యాసాన్ని గురించి ఇట్లా వర్ణించినాడు.

"అతడు సదివింప వేద వేదాంగ ధర్మ
శాస్త్ర రాజనీత్యాది సకల విద్యలును
క్రమంబునఁ జదివి యమ్ముని కుమారుఁ
డచ్చటనయుండె వ్రతచర్యలందుఁ దగిలి"[2]

శుకుడు బృహస్పతి దగ్గర విద్యాభ్యాసము పూర్తి ఐన తరువాత తన తండ్రి దగ్గరకు వచ్చినాడు. అచట మునికుమారులతో కలిసి ఆడుకొంటూ ఆత్మానుసంధానం చేయలేని శుకునికి, వ్యాసుడు సాంఖ్యయోగ శాస్త్రాలను బోధించినాడు. ఆ బోధవల్ల శుకునికి అహంకార మమకారాలు తొలగినాయి. ఆత్మానాత్మ వివేకం కలిగింది. అతనిదృష్టి మోక్షంపైపు మరలింది. వ్యాసుడు శుకుని

1. తిక్కన, op. cit., శాంతిపర్వము 6వ ఆశ్వాసము పద్యము 254 పుట 252
2. ,, ,, ,, ,, 256 ,,

అభిప్రాయాన్ని గుర్తించి, జనకుని దగ్గరకు పంపినాడు. తండ్రి సలహా పాటించి శుకుడు జనకునివద్దకు పాదచారిగ వెళ్ళినాడు. జనకుని దర్శనం కలిగింది. జనకు డతనికి సకల సత్కారాలు చేసినాడు. జనకుడు శుకునికి మోక్షధర్మాన్ని గురించి చెప్పిన సందర్భంలో తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"కోరికయు నొల్లమియు లే
కేరూపున భూతములకు నెగ్గు తెలుపన్
జేరక యకామవృత్తిఁ ద
పోరతినున్నతఁడు బ్రహ్మముం బ్రాపించున్"[1]

"విన జూడంబడునం దె
ల్లను సమతం బరముఁగనుచు లౌల్యనిరసనం
బున సుఖదుఃఖాది ద్వం
ద్వ నిరూఢుడుగాక యున్నతడు ముక్తి గనున్"[2]

"ఇనుమును గనకము నిందయు
వినుతియు సమములుగ గొనుచు వివిధాంగకముల్
దనలోన నడచు కమఠము
ననువున నింద్రియము లడచు నతడు గను శివున్"[3]

శుకుడు జనకుని దగ్గర మోక్షధర్మాన్ని గురించి తెలుసుకొని, తండ్రి దగ్గరకు వచ్చినాడు.

వేదవ్యాసుని దగ్గర విద్య నభ్యసించేవారిలో శుకుడేగాక, జైమినీ, పైలుడూ, సుమంతుడూ, వైశంపాయనుడూ మొదలైన శిష్యులుండేవారు. వ్యాసుడు వేదరాశిని. ఋక్కు యజుస్సు సామము అధర్వము అనే నాలుగు విధాలుగ విభజించి పైల వైశంపాయన జైమిని సుమంతులకు వరుసగా ఋగాది వేదాలను ఉపదేశించినాడు. వారొకనాడు వేదవ్యాసునితో ఇట్లా అన్నారు.

"దేవా శుకుండు మొదలుగాఁగల యే మేవురము వేదవిషయ ప్రఖ్యాతినెల్ల వారికంటె నెక్కుడుగా వలయు మమ్ముం బోలె నొడ్ల నాదరాధిక్యంబున భరంపడి

1. తిక్కన, op. cit., శాంతిపర్వము 6వ అశ్వాసము పద్యము 284 పుట 255
2. ,, ,, ,, ,, 285 ,,
3. ,, ,, ,, ,, 286 ,,

సవిశేషంబుగా నధ్యయనంబు సేయింపకుండుట మాకు వరంబు."[1] వ్యాసుడు వారి మాటలను ఆదరించలేదు. వారిని మందలించినాడు. ఆ వృత్తాంతాన్ని తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"భక్తుడగు బ్రాహ్మణునకు వాగ్బ్రహ్మ మఖిల
మునుఁ బ్రియంబుననిచ్చు సజ్జనుని చేతి
లోని యది బ్రహ్మలోకంబు దీని మీర
లేర్పడగ నెన్నడును విని యెఱుగరెట్లు."[2]

"విను డెల్లవారును దుర్గం
బును గడచి శుభంబునొంది పురుషార్థములం
గనువారకాకయనియెడు
ననుగ్రహము వలదె యిట్టు లనదగనగునే."[3]

శిష్యులు తమ తప్పును ఒప్పుకొనినారు. తరువాత వారు భారత ప్రచారానికి పూనుకొనినారు.

శుకుడు నారదుని దగ్గర విద్య నభ్యసించిన వృత్తాంతాన్ని గురించి ఇంతకు ముందు చెప్పడం జరిగింది.

నారదుడు ఒకనాడు వేదవ్యాసుని ఆశ్రమానికివచ్చి, ఆశ్రమంలో వేదనాదం వినిపించలేదేమని అడిగినాడు. శిష్యులు భారతాన్ని ప్రచారంచేయడానికి వెళ్ళినందున తన ఆశ్రమంలో వేదనాదం వినిపించలేదని వ్యాసుడు చెప్పినాడు. అప్పుడు నారదుడు, "సుతుడును నీవైనను దద్వ్రతంబు చెల్లింపకుండవలదే"[4] అనినాడు. నారదుని మాటలనువిని వారు అధ్యయనాన్ని ప్రారంభించినారు. ఇంతలో పెద్ద గాలి వచ్చింది. అధ్యయనాన్ని ఆపమని వ్యాసుడు శుకునితో చెప్పినాడు గాలి ఎక్కువగా వీస్తున్నప్పుడు అధ్యయనాన్ని తాత్కాలికంగా నిలిపివేయవలసి ఉంది. వర్షాకాలంలో రాత్రి, చెవులకు వినపడేలాగా శబ్దంచేస్తూ గాలి వీస్తున్నపుడూ, పగటి పూట ధూళి రేగేలా గాలి వీచేటప్పుడూ తాత్కాలికంగా అధ్యయనం నిలిపివేయాలని

1. తిక్కన, op. cit., శాంతిపర్వము 6వ ఆశ్వాసము గద్యము 297 పుట 256
2. తిక్కన, op. cit., ,, ,, పద్యము 298 ,,
3. తిక్కన, op. cit., ,, ,, ,, 299 ,,
4. తిక్కన, op. cit., ,, ,, ,, 305 పుట 257

మునులు చెప్పిన వృత్తాంతాన్ని మనువు ఇట్లా వర్ణించినాడు.

"కర్ణశ్రవేఽనిలే రాత్రౌ దివాపాంసు సమూహనే
ఏతౌ వర్షాస్వన ధ్యాయావధ్యాయ జ్ఞాః ప్రచక్షతే "1

శుకుడు తండ్రి అనుమతిపై మరల అధ్యయనాన్ని సాగించినాడు. నారదుడు శుకుని మెచ్చుకొని అతనికి సనత్కుమారుడు చెప్పిన వాక్యాలలోని తత్త్వాన్ని వివరించినాడు. శుకుడు దానిని గ్రహించి యోగమార్గంలో అదృశ్యుడైనాడు. అతడు ఆకాశమార్గాన వెళ్ళే సమయంలో నగ్నంగా జలకాలాడే అప్సరసలు అతన్నిచూచి వికారాన్ని పొందకపోవడంవల్ల శుకుని ప్రవర్తన విదితమౌతుంది. విద్యకు పరిపూర్ణత కేవలం అభ్యసనంలోనేకాదు, ప్రవర్తనలోకూడా కనపడవలసి ఉంది. శుకుడు వాయుమార్గాన్నిదాటి సర్వభూతాలలో కలిసిపోయినాడు.

4.9. భీష్ముని విద్యాభ్యాసము :

భీష్ముడు గంగా శంతనుల అష్టమపుత్రుడు. అతడు దృఢవ్రతశీలుడు. మహాబలుడు. అతడు మహా సత్త్వుడు. రాజవృత్త సంపన్నుడు. భీష్ముడు విమలమైన బుద్ధికలవాడు. కృపానిలయుడు. కార్యసంవేది. ఆర్యసమ్మతుడు. అతని విద్యాభ్యాసాన్ని గురించి నన్నయ ఇట్లా వర్ణించినాడు.

"సాంగంబు లగుచుండ సకల వేదంబులు
సదివె వసిష్ఠుతో సకల ధర్మ
శాస్త్రాది బహువిధ శాస్త్రముల్ శుక్ర బృ
హస్పతుల్ నేర్చినయట్ల నేర్చెఁ
బరమాస్త్రవిద్య నప్పరశురాముండెంత
దషఁ డంతియ కడు దక్షుఁడయ్యె
నాత్మ విజ్ఞానంబునందు సనత్కుమా
రాదుల యట్టిడ యనఘమూర్తి."2

మహాభారతము (శాంతిపర్వము ప్రథమాశ్వాసము పుట 36)లోని—

---

1. కుల్లూకభట్టు op. cit., శ్లోకం 102 పుట 150
2. నన్నయ, op. cit., ఆదిపర్వము 4వ ఆశ్వాసము పద్యము 169 పుట 224

"చ్యవనుడు మార్కండేయుం
డు వసిష్ఠుడు లోనుగాఁ బటుప్రాజ్ఞులు గౌ
వమున వినిపింపఁగ దెలి
యు విని యెు ధర్మప్రపంచ మతడఖిలంబున్."

—అనే పద్యాన్నిబట్టి భీష్ముడు చ్యవన మార్కండేయులవల్ల సకల ధర్మాలను గ్రహించినట్లు విదితమౌతుంది భీష్ముడు భూతభవిష్యద్వర్తమానవేది. సర్వ విద్యలకు ఆధారభూతుడు. ధర్మరాజుకు ధర్మములుపదేశించడానికి కృష్ణుడు భీష్ముని నియమించిన సందర్భంలో అతని ప్రజ్ఞను గురించి చెప్పిన గద్యభాగమిది.

"నాలుగు వర్ణంబులకును నాలుగాశ్రమంబులకు నిట్టిట్టివి యర్థంబులని నాలుగు వేదంబులం జెప్పిన ధర్మంబులు నీకు విదితంబులు ప్రవృత్తి నివృత్తులును సాంఖ్యయోగంబులును బురాణేతిహాసంబులు ధర్మశాస్త్రంబులు నవగతంబులు సర్వ సంశయచ్ఛేదన దక్షుండవని క్షితిపతి నాదరింపుము."[1] ధృతరాష్ట్ర పాండు విదురులు భీష్ముని రక్షణలో పెరిగినారు. వారికి ఉపనయనాది సంస్కారాలను చేయించి, వారి అధ్యయనాన్నిగూర్చి భీష్ముడు శ్రద్ధవహించినాడు. అంతేకాదు. కురుపాండవుల విద్యాభ్యాసాన్ని గురించి అతడు జాగ్రత్తవహించి, కృప ద్రోణాచార్యులను వారికి గురువులుగా నియమించినట్లు నన్నయ వర్ణించినాడు.

"విలువిద్యఁ గఱచుచుండిరి
బలయుతులు కుమారకులు కృప ద్రోణాచా
ర్యులతోడఁ గలసి యొక్కట
నలఘు పరాక్రమ సమేతు లధిక స్పర్ధన్."[2]

వ్యూహాలను నిర్మించడంలో, సైన్యములోని అతిరథ మహారథులాదిగాగల వారిని నిర్ణయించడంలో, అజ్ఞాతవాస కాలపరిమితిని నిర్ణయించడంలో భీష్మునిప్రజ్ఞ వ్యక్తమౌతుంది. గురువు దోషదూషితుడైనప్పుడు, ఆ దోషాన్ని గుర్తుకుతెచ్చి అతనికి కనువిప్పు కలిగించడం శిష్యుని ధర్మము. శిఖండిని ఉద్ధరించడానికి పోటీపడిన తన గురువైన పరశురామునికి ధర్మతత్వాన్ని వివరించి భీష్ముడు గురువునుమించిన శిష్యుడనిపించుకొనినాడు. భీష్ముడుత్తమ విద్యార్థి. అతనిపట్ల

1. తిక్కన, op. cit., శాంతిపర్వము 2వ ఆశ్వాసము గద్యము 110 పుట 57
2. నన్నయ, op. cit, ఆదిపర్వము 5వ ఆశ్వాసము పద్యము 181 పుట 301

పరశురామునికి కీర్తిగలిగింది. శ్రీకృష్ణుడు భీష్మునికి దివ్యమైన బుద్ధిని ప్రసాదించడంవల్ల ధర్మరాజుకు శాంత్యానుశాసనికాది పర్వాలలో ఆ యా సందర్భాలలో దండనీతి ప్రభావము, వర్ణాశ్రమ ధర్మాలు, రాజధర్మాలు, ఆపద్ధర్మాలు, మోక్ష ధర్మాలు మొదలైన ఎన్నో విషయాలను బోధించి ఉత్తరాయణ పుణ్యకాలంరాగానే దేహాన్ని త్యజించినాడు.

4.10. పాండురాజు విద్యాభ్యాసము :

పాండురాజు భీష్ముని సంరక్షణలో పెరిగి, ఉపనయనాన్నిపొంది, అధ్యయనం సాగించి రాజవిద్యలలో జితశ్రముడైనాడు. నన్నయ పాండురాజు విద్యాభ్యాసాన్ని గూర్చి ఇట్లా వర్ణించినాడు.

"వేదంబులందుఁ బ్రవీణుడై మఱి సర్వ
శాస్త్రంబులందుఁ గౌశలము మెఱసి
యసికుంత కార్ముకాద్యాయుధ విద్యల
యందు జితశ్రముఁడై తురంగ
సింధురారోహణ శిక్షల దక్షుడై
నీతి ప్రయోగముల్ నెఱయనేర్చి."1

విద్యాభ్యాసము పూర్తియైన తరువాత పాండురాజు వివాహము చేసుకొని, దిగ్విజయయాత్రలు సాగించినాడు. విద్వాంసులను ఆదరించడంలో, బంధుమిత్రాదులకు సంతోషాన్ని కలిగించడంలో పేరుపొందినాడు. ఒకనాడతడు వేటకుపోయి ముని శాపానికిగురియై, పత్నీసమేతుడై శతశృంగమున తపోవృత్తి నుండి, దేవతల వరప్రసాదమువల్ల సంతానాన్నిపొంది చివరకు మరణించినాడు.

4.11. కృపుని విద్యాభ్యాసము :

కృపుడు కౌరవ పాండవులకు ఆచార్యుడు. ఆతడు గౌతముని మనుమడు. శరద్వంతుని కుమారుడు. శరద్వంతుని జన్మ విచిత్రమైనది. అతడు శర సమూహంతో అవతరించినాడు. అతడు ధనుర్వేదాన్ని సంపూర్ణంగా అధ్యయనం చేసినాడు. అతని తపస్సుకు భంగము కల్గించడానికి ఇంద్రుడు, జలపది అనే

---

1. నన్నయ, op. cit., ఆదిపర్వము 5వ ఆశ్వాసము పద్యము 15 పుట 257

అప్సరసను పంపినాడు. ఆమె సర్వావయవ సౌష్ఠవాన్ని చూచి శరద్వంతుడు చలించినాడు. అతని వీర్యము స్ఖలితమై శరగుల్మంలో పడింది. దానినుండి కృపుడు, కృపి అనే శిశువులు జన్మించినారు. శరద్వంతుడు వేరొక ఆశ్రమానికి పోయి. అచట తపస్సులోనుండి కొంతకాలమైన తరువాత శంతనుని దగ్గరకువచ్చి కృపుడు, కృపి తన సంతానమేనని చెప్పినాడు. శరద్వంతుడు కృపుని ఉపనీతునిగా చేసినాడు. కృపుని విద్యాభ్యాసాన్ని గురించి నన్నయ వర్ణించిన పద్యమిది.

"వేదంబుల్ చదివించె భూసురులతో విఖ్యాతిగా నాత్మ సం
వేదింజేసెఁ జతుర్విధంబగు ధనుర్వేదంబు నానాస్త్ర వి
ద్యా దాక్షిణ్యముతోడఁ దాన కఱపెంద ద్విజోత్తముల్ సూచి సం
వాదుల్గాఁ దన నందనుం గృపు శరద్వంతుండు దాంతాత్ముడై"[1]

పద్యములోని "తాన గఱపెన్" అను మాటలవల్ల ఆనాటి విద్యా సాంప్రదాయం విదితమౌతుంది. తండ్రి కుమారునికి విద్యనేర్పడం గృహశిక్షణ (Domestic Instruction) అనే విద్యా విభాగానికి చెందుతుంది. శరద్వంతుడు, 'దాంతాత్ముడై' విద్యను తన కుమారునికి బోధించినాడని చెప్పినందువల్ల ఉత్తమ ఉపాధ్యాయునికి దమం ముఖ్యమని సూచించడం జరిగింది. శరద్వంతుడు ధనుర్విద్యను మాత్రమే కృపునికి బోధించినాడు. మిగిలిన ఆచార్యుల దగ్గరకు అతన్ని పంపించి వేదాలను చదివించినాడు. కృపుడు తండ్రి నుండి చతుర్విధాలైన ధనుర్వేదాన్ని అధ్యయనం చేసినాడు. ధనుర్వేద విశారదులైనవారు, కృపునికి ఉండే ధనుర్వేద జ్ఞానాన్ని మెచ్చుకొనినారు. అతడు బాణాలను పొదినుండి తీయడంలో, వింటికి సంధించడంలో, లక్ష్యభేదనలో అద్వితీయుడైనాడు. ముక్తకాలు, అముక్తకాలు, ముక్తాముక్తకాలు, శస్త్రాలు, అస్త్రాలు, ప్రత్యస్త్రాలు, పరమాస్త్రాలు మొదలైనవాటిలోని రహస్యాలను తెలిసికొనినాడు. భీష్ముడు కృపాచార్యుని పిలిపించి, భక్తితో పూజించి తన మనుమలకు విలువిద్య నేర్పుమని అభ్యర్థించినాడు. అతని కోరికపై కృపుడు రాజకుమారులకు గురువై అచిరకాలంలోనే పరమాచార్యుడుగ ప్రసిద్ధిచెందినాడు. మహాభారతం (ఆదిపర్వము పంచమాశ్వాసము పుట 303) లోని,—

"సవిశేషముగ ధనుర్వేద విశారదులై రి కడు జితశ్రములై పాం
డవ ధృతరాష్ట్రాత్మజ యాదవులాదిగ రాజసుతులు తత్కృప శిక్షన్"

---

1. నన్నయ, op. cit, ఆదిపర్వము 5వ ఆశ్వాసము పద్యము 190 పుట 303

—అనే పద్యంవల్ల కౌరవ పాండవ యాదవు లాదిగాగల రాజకుమారులు కృపుని శిక్షణలో ధనుర్విద్యావిశారదులైనారని తెలుస్తుంది.

4.12. ద్రోణుని విద్యాభ్యాసము :

ద్రోణుడు భరద్వాజునికి ఘృతాచియందు జన్మించినవాడు. అతడు నీతిలో బృహస్పతివంటివాడు. వేదవేదాంగ విదుడు. ద్రోణుడు వ్యూహప్రయోగంలో దక్షుడు. అస్త్ర శస్త్ర ప్రయోగంలో ఆరితేరినవాడు. ద్రోణుడు తన తండ్రియైన భరద్వాజుని దగ్గర వేదవేదాంగాలను చదువుకొనినాడు. అతడు అగ్నివేశ్యుని శిష్యుడు. అతని విద్యాభ్యాసాన్ని నన్నయ ఇట్లా వర్ణించినాడు. ద్రోణుండును నగ్నివేశ్యుండను మహామునివలన ధనుర్విద్యా పారగుండై తత్ప్రసాదంబున నాగ్నేయాస్త్రంబాదిగా ననేక దివ్యబాణంబులు వడసి''[1] మహాభారతము (ఆదిపర్వం 5వ ఆశ్వాసము)లోని "పరశురామునిచేత దివ్యాస్త్రంబులు ప్రయోగ రహస్య మంత్రంబులతోడం బడసి ధనుర్విద్యయు నభ్యసించి" అనే గద్యభాగంవల్ల ద్రోణుడు పరశురామునినుండి సర్వాస్త్ర ప్రయోగోపసంహార జ్ఞానాన్ని పొందినట్లు విదితమౌతుంది. ద్రోణుడు హస్తిపురానికి రాకముందు ఎన్నో కష్టాలను అనుభవించినాడు. అతడు తన కుమారునికి పిండినపాలు పోయలేక, పిండి పాలే ఆవు పాలనిచెప్పి తన కుమారునిచే త్రాపించినవాడు. రాజకుమారులు బావిలోపడిన బంతిని బయటికి తీయలేక సతమతమౌతున్న సమయంలో ద్రోణుడు అక్కడికి వచ్చినాడు. ద్రోణుడు ఆ బంతిని బాణరజ్జువుతో బయటికి తీసినాడు. రాజ కుమారులు ఆశ్చర్యాన్నిపొంది ద్రోణుని తోడుకొనిపోయి భీష్మునికి అక్కడ జరిగిన వృత్తాంతాన్ని వివరించినారు. ద్రోణుడు భీష్మునికి తన చరిత్రను వినిపించినాడు. భీష్ముడు ద్రోణుని పూజించినాడు. అతడు ద్రోణునికి ధనధాన్య సమాకులము, సుపరిచ్ఛన్నము (Wel furnished) ఐన ఇంటిని, వివిధ వస్తువులను ప్రీతితో ఇచ్చినాడు. అతడు పరమానందభరితుడై ఉన్న సమయంలో భీష్ముడు తన మనుమలను అతనికి శిష్యులుగా సమర్పించిన వృత్తాంతాన్ని నన్నయ ఇట్లా వర్ణించినాడు.

---

1. నన్నయ. op. cit., ఆదిపర్వము 5వ ఆశ్వాసము గద్యము 196 పుట 304

"మనుమలనెల్లఁ జూపి మతిమంతుఁడు శాంతనవుండు వీరిఁ జే
కొని గురువృత్తిమైఁ గఱపు ఘోరశరాసన విద్యలెల్లఁ బెం
పున జమదగ్ని సూనుఁడును బోలఁడు నిన్నని విందు విల్లు నే
ర్పున నయనైపుణంబునను భూరి పరాక్రమ గర్వసంపదన్"1

నానాదేశాలనుండి వచ్చిన రాజకుమారులు విలువిద్యను అభ్యసించడానికి పూనుకొనినారు. వారందరు ద్రోణుని దగ్గర అస్త్రప్రయోగోపసంహారాది పద్ధతులను అధ్యయనంచేసినారు. అధ్యయనకాలంలో కర్ణునికి అర్జునునిపై, అశ్వత్థామకు అర్జునునిమీద మాత్సర్యం కలిగింది. తన దగ్గరనున్న శిష్యులలో అర్జునుడు తనంతటివాడు కాగలడని ద్రోణుడు భావించినాడు. అశ్వత్థామ అర్జునునిపై విద్యామాత్సర్యము వహించినందువల్ల అర్జునుడు చీకటిలో అస్త్రాన్ని ప్రయోగించే కౌశలాన్ని పొందకూడదను ఉద్దేశంతో, చీకటిలో అతనికి అన్నం పెట్టవద్దని అన్నసాధకుని శాసించినాడు. వంటవాడు ఆ నియమాన్ని పాటించినాడు. అర్జునుడు అన్నం తింటుంటే ఒకనాటి రాత్రి దీపం గాలికి ఆరిపోయింది. ఐనా అభ్యాసబలంవల్ల ముద్ద నోటిలోనికేపోవడం తెలుసుకొని, అభ్యాసంతో ఏవిద్యనైనా సాధించవచ్చునని గ్రహించి, చీకటిలోకూడా బాణాలువేయడం ప్రారంభించినాడు. అర్జునునికి గల విద్యాసక్తిని ద్రోణుడు మెచ్చుకొనినాడు. అతనికి సకల విద్యారహస్యాలను బోధించడానికి పూనుకొనినాడు. అతన్ని అద్వితీయుడైన విలుకానిగ చేస్తానని మాట ఇచ్చినాడు. ద్రోణుడు ప్రియశిష్యుడైన అర్జునునికి నేర్పిన విద్యలగురించి నన్నయ వర్ణించిన పద్యమిది.

"అతని యస్త్ర విద్యాభియోగమునకుఁ బ్రియ శిష్యవృత్తికిఁ బెద్దమెచ్చి
యన్న ధనుర్ధరు లన్యులు నీకంటె నధికులు గాకుండునట్లుగాఁగ
గఱపుదు విలువిద్య ఘనముగా ననిపల్కి-ద్వంద్వ సంకీర్ణ యుద్ధముల దెఱఁగు
రథ మహీవాజివారణములపైనుండి దృఢ చిత్ర సౌష్ఠవ స్థితులనేయ
బహువిధ వ్యూహ భేదనోపాయములను సంప్రయోగ రహస్యాతిశయముగాఁగఁ
గఱపె నర్జునుఁదొంటి భార్గవుడు వింటనిట్టిడేయని పొగడంగ నెల్లజనులు."2

---

1. నన్నయ, op. cit., ఆదిపర్వము 5వ ఆశ్వాసము పద్యము 222 పుట 311
2. నన్నయ, op. cit , ఆదిపర్వము 5వ ఆశ్వాసము పద్యము 230 పుట 312

ద్రోణునిలో శిష్య పక్షపాతం అనే దౌర్బల్యం ఉంది. అర్జునుడు అతని ప్రియశిష్యుడని చెప్పడానికి ఎన్నో సంఘటనలు భారతంలో ఉన్నాయి. అర్జునుడు లక్ష్యం తప్పకుండా బాణాన్ని ప్రయోగించి కృత్రిమ పక్షితలను ఛేదించిన సమయంలో ద్రోణుడు సంతోషించినాడు. మరొకమారు ఆచార్యుడు గంగలో స్నానం చేస్తుంటే అతని పిరుతొడను మొసలి పట్టుకొన్నప్పుడు, దాన్ని వదిలించు కొనే శక్తి తనకు ఉన్నా, శిష్యులను పరీక్షించాలనే ఉద్దేశంతో ద్రోణుడు తనబాధను తొలగించమని శిష్యులతో చెప్పినాడు. శిష్యులు బాణాలను ప్రయోగించినారు. ఒకటి కూడా మొసలికి తగులలేదు. అర్జునుడు బాణాన్ని ప్రయోగించినాడు. మొసలి చనిపోయింది. ద్రోణునికి విముక్తికలిగింది. అతడు అర్జునుని లక్ష్యశుద్ధిని ప్రశంసించినాడు. బ్రహ్మశిరమనే అస్త్రప్రయోగోపసంహార పద్ధతులను అర్జునునికి ఉపదేశించినాడు. రాజకుమారుల అస్త్రవిద్యా ప్రదర్శనం జరుగుచున్న సమయంలో రంగ మధ్యభాగంలో నిలిచిన ద్రోణుని గురించి నన్నయ ఇట్లా వర్ణించినాడు. "ఆచార్యుండు శుక్లాంబరాభరణ మాల్యానులేపన యజ్ఞోపవీత ఫలిత కేశశ్మశ్రు శోభిత దేహుండై రంగ మధ్యంబున నశ్వత్థామ సహితుండై విముక్త జలదజాల వియన్మధ్యంబున నంగారక సహితుండైన యాదిత్యుండును బోలెనున్న "1

ద్రోణుడు పద్మవ్యూహాన్ని నిర్మించడంలో సమర్థుడు. నానాదేశాలనుండి వచ్చిన రాజులు దళాలుగా, రాజకుమారులు కేసరాలుగా, సైన్యసమేతుడైన దుర్యోధనుడు కర్ణికగా ద్రోణుడు పద్మవ్యూహాన్ని పన్నినప్పుడు ధర్మరాజు దానిని ఛేదించలేక అభిమన్యుని ఆశ్రయించవలసి వచ్చింది. ద్రోణుడు రాజపుత్రులకు ఆచార్యుడై, స్వామిఋణాన్ని తీర్చుకోవాలనే ఉద్దేశంతో, దుర్యోధనుని పక్షాన నిలిచి, సర్వ సైన్యాధిపతిగ ఐదురోజులు యుద్ధంచేసి, ధర్మరాజు చెప్పిన మాటలనునమ్మి తన కుమారుడు మరణించినాడనుకొని, అస్త్రసన్యాసంచేసి, చివరకు యోగబలంతో పరమపదాన్ని పొందినాడు. బ్రాహ్మణుడై ఉండి క్షత్రియ ధర్మాన్ని అవలంబించడం, అర్జునుని మెప్పుపొందాలని ఏకలవ్యుని కుడిచేతి బొటనవ్రేలిని గురుదక్షిణగ స్వీకరించడం ద్రోణునిలోని లోపాలు. ద్రోణాచార్యుడు విషయమూ, దాన్ని బోధించే విధానమూ తెలిసినవాడు. అతడు శిష్యులపట్ల సమదృష్టితో వ్యవహరించి ఉండే ఉత్తమ ఆచార్యుడుగ కీర్తినిపొంది ఉండేవాడు.

---

1. నన్నయ. op cit, ఆదిపర్వము 5వ ఆశ్వాసము గద్యము 9 పుట 323

4.13 పాండవుల విద్యాభ్యాసము :

పాండురాజు శతశృంగ పర్వతముపై ఉన్నప్పుడు ఆ యా దేవతల వరాల వల్ల ధర్మజ భీమార్జున నకుల సహదేవులు జన్మించినారు. అతడు వారికి తగిన వయసురాగానే చౌలోపనయనాది కర్మలను జరిపించినాడు. వారు అచ్చటనున్న మహర్షుల దగ్గర వేదాధ్యయనం ప్రారంభించినారు. పాండవులు శుకుడనే రాజర్షి దగ్గర అస్త్రశస్త్రాది విద్యలు అభ్యసించినట్లు సంస్కృత భారతములో వర్ణింపబడింది.[1] వారతనిదగ్గర అస్త్రశస్త్రవిద్యలేగాక సాములుకూడా నేర్చుకొనినారు. చిల్లకోలను ఉపయోగించడంలో ధర్మరాజు కౌశలం గడించినాడు. గదాప్రయోగంలో భీముడు, విలువిద్యలో అర్జునుడు, కత్తిడాలు త్రిప్పడంలో కవలలూ నైపుణ్యం సంపాదించినారు. తరువాత కొంతకాలానికి పాండురాజు కిందముని శాపంచే మరణించినాడు. అచటి మహర్షులు పాండుకుమారులను ధృతరాష్ట్రునికి అప్పగించినారు. భారతము (ఆరవ ఆశ్వాసము పుట 355)లోని, "యుధిష్ఠిర భీమార్జునయములుం గ్రమంబున

---

1. శర్యాతేః పృషతః పుత్రః శుకోనామ పరంతపః
యేన సాగర పర్యంతా ధనుషా నిర్జితా మహీ
అశ్వమేధ శతైరిష్ట్వా సమహాత్మా మహామఖైః
ఆరాధ్య దేవతాః సర్వాః పితౄనపి మహామతిః
శతశృంగే తపస్తేపే శాకమూల ఫలాశనః
తేనోపకరణ శ్రేష్ఠైః శిక్షయాచోపబృంహితాః
తత్ప్రసాదాత్ ధనుర్వేదే సమపద్యంత పారగాః
గదాయాం పారగో భీమస్తోమరేషు యుధిష్ఠిరః
అసి చర్మణి నిష్ణాతౌ యమౌ సత్త్వవతాం వరౌ
ధనుర్వేదే గతః పారం సవ్యసాచీ పరంతపః
శుకేన సమనుజ్ఞాతో మత్స్యమోఽయ మితిప్రభో
అనుజ్ఞాయ తతో రాజా శక్తిం ఖడ్గం తథాశరాన్
ధనుశ్చ దదతాం శ్రేష్ఠః తాలమాత్రమ్ మహాప్రభమ్
విపాఠక్షుర నారాచాన్ గృధ్రపత్రానలంకృతాన్
దదాయ పార్థాయ మహోరగ సమప్రభాన్.
వ్యాసుడు, op. cit., ఆదిపర్వము పుట 369

దొల్లిషోడశపంచదశ చతుర్దశ త్రయోదశ వర్షజాతులయి శతశృంగంబుననుండి హస్తి పురంబునకువచ్చి యందుఁ గౌరవులంగలసి యస్త్రవిద్యలం గఱచుచుఁ బదుమూ డేండ్లుండి'' అనే గద్యభాగాన్నిబట్టి పాండవులు శతశృంగపర్వతంనుండి హస్తిపురానికి వచ్చేనాటికి ధర్మరాజు వయస్సు పదారు సంవత్సరాలు. భీముని వయస్సు పదైదు సంవత్సరాలు. అర్జునుని వయస్సు పదునాలుగు సంవత్సరాలు. నకుల సహదేవుల వయస్సు పదమూడు సంవత్సరాలు అని విదితమౌతుంది. పాండవులు శాలిహోత్రునివద్ద అనేక ధర్మశాస్త్ర నీతిశాస్త్రాలభ్యసించినారు. పాండవులు హస్తి పురంలో కౌరవులతో కలిసి విద్యలు నేర్చుకొంటూ పదమూడు సంవత్సరాలు గడిపినారు.

4 13. 1

ధర్మరాజు పాండురాజు నియోగంవల్ల కుంతికి యమధర్మరాజు వరంతో జన్మించినాడు. అతడు శౌచసంపన్నుడు. వేదాధ్యయన తత్పరుడు. యజనశీలి. అతడు ధనుర్ధారణలో, కవచము తొడుగుటలో, ఆరోహణ విద్యలలో, సకల శాస్త్రాలలో దక్షుడు. ధర్మరాజు పరవిద్యా మర్మజ్ఞుడు. సర్వభూత హితరతుడు. మహాభారతంలోని (అరణ్యపర్వము ప్రథమాశ్వాసము పుట 36). "ధర్మతనయు నేకాంత ప్రదేశంబునకుం దోడ్కొని చని సత్యవతీసుతుండు విధిదృష్టవిధానంబునం బ్రతిస్మృతి యను విద్యనుపదేశించి" అనే గద్యభాగాన్నిబట్టి వ్యాసుడు ధర్మరాజుకు ప్రతిస్మృతి అనే విద్యనుపదేశించినట్లు విదితమౌతుంది. వ్యాసుడు, శుకుడు, కృపుడు, ద్రోణుడు మొదలైనవారు ధర్మరాజుకు ఆ యా విద్యలను నేర్పినారు. కృష్ణుడు. భీష్ముడు, నారదుడు, ధౌమ్యుడు మొదలగువారు అతనికి ఎన్నోవిషయాలను వినిపించినారు. ధర్మరాజు విరటుని కొలువులో ప్రవేశించు సందర్భంలో చెప్పిన మాటలను తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"సన్యాసి వేషమున రా
జన్యునిఁ గని యెపుడు గొలిచి సభ్యత్వమునన్
మాన్యుడ నై పుణ్య కథా
విన్యాస మొనర్తు నతని వేడుకకుఁ దగన్.''1

1. తిక్కన. op. cit., విరాటపర్వము ప్రథమాశ్వాసము పద్యము 69 పుట 7

"శ్రౌతస్మార్త నిమిత్త
జ్యోతిర్విద్యలు వహించి యోగ్య సమయ సం
జాత ప్రాగల్భ్యుడనై
చాతుర్యము మెఱసి మానసం బలరింతున్."[1]

"మృదు ద్యూతంబునఁ గ్రీడింతున్
చేతో ముదమెసఁగ నక్షశిల్ప ప్రౌఢిన్."[2]

"నృపనయ విద్యకుం దగిన నేర్పులవడ్డది"[3]

ధర్మరాజు వేదాలు, స్మృతులు, శకునశాస్త్రము, జ్యోతిషము తెలిసినవాడు. అతడు పుణ్యకథావిన్యాసంలో దక్షుడు. అక్షశిల్పంలో ప్రౌఢుడు. రాజనీతి విద్యలో నేర్పు కలవాడు. మహాభారతములోని (ఆదిపర్వము పుట 438)—

"ప్రాజ్ఞః ప్రాజ్ఞ ప్రలాపజ్ఞః ప్రలాపజ్ఞ మిదం వచః
ప్రాజ్ఞం ప్రాజ్ఞః ప్రలాపజ్ఞం వచోఽబ్రవీత్"

— అనే శ్లోకంవల్ల ధర్మరాజుకు మ్లేచ్ఛభాష తెలుసునని బోధపడుతుంది. ధృతరాష్ట్రుడు పాండవులను వారణావతానికి పంపినప్పుడు విదురుడు ధర్మరాజు మ్లేచ్ఛ భాషలో కర్తవ్యాన్ని ఉపదేశించినాడు. ధర్మరాజు మ్లేచ్ఛభాష తెలిసినవాడగుటచే ఆ మాటలలోని మర్మాన్ని గ్రహించగలిగినాడు. ధర్మరాజు నహుషుని ప్రశ్నలకు సమాధానాలు చెప్పగలిగిన ప్రజ్ఞావంతుడు. శతఘ్ని (నాలుగు మూరల పొడవుగల కట్టె) చిల్లకోల అనే సాధనాలతో యుద్ధం చేయడంలో అతడు దక్షుడు. ధర్మరాజు సంస్కారము కలవాడు. మహాభారతంలో అతని ప్రవర్తనను తెలిపే సంఘటనలు ఉన్నాయి. యక్షుడు ధర్మరాజుతో, తమ్ములలో ఒకన్ని బ్రతికించుకొమ్మని చెప్పినప్పుడు కుంతి సంతానానికి తాను ప్రతినిధిగా ఉంటాననీ, మాద్రి సంతానానికి ప్రతినిధిగా నకులుని బ్రతికింపుమని కోరినాడు. ఒక కుక్కకు స్వర్గప్రవేశం కలిగించవలసినదని ఇంద్రునితో ధర్మరాజు చెప్పడం అతని సర్వభూత హితైక తత్త్వానికి నిదర్శనం. ఉత్తమమైన స్థానము తనకు ఒక్కనికే దొరుకుతుందనీ, మానుషమైన స్నేహాన్ని వదలుకొని రమ్మని ఇంద్రుడు ధర్మరాజుతో చెప్పినప్పుడు తమ్ములను, భార్యను, పుత్రులను వదలిపెట్టి బ్రదుకలేనని చెప్పడంలో అతని

---

1. తిక్కన, op. cit., విరాటపర్వము ప్రథమాశ్వాసము పద్యము 69 పుట 7
2. ,, ,, ,, ,, 70 ,,
3. ,, ,, ,, ,, 197 పుట 19

సంస్కారం వ్యక్తమౌతుంది. మగువను పందెముగా పెట్టడం, రెండవమారు జూదమాడడం, అబద్ధమాడి ఆచార్యుని మృతికి కారణభూతుడుకావడం మొదలైనవి ధర్మరాజులోని దోషాలు. యమధర్మరాజు మాటలనువిని, ధర్మరాజు ఆకాశగంగలో స్నానముచేసి, అమరత్వాన్నిపొంది ఇంద్రలోకానికి పోయినాడు.

4 13.2

భీముడు పాండురాజు నియోగంవల్ల కుంతికి వాయుదేవుని వరంచే జన్మించినాడు. అతడు బలశాలి. ధృతిసంపన్నుడు. భీముడు మల్లయుద్ధ మర్మజ్ఞుడు. అతడు పాకశాస్త్రంలో ప్రవీణుడు. భీముడు క్రూరసత్వాలతో పోరాడగల ధీరుడు. అతడు గదాయుద్ధవిశారదుడు. ప్రాసము, బాణము ప్రయోగించడంలో భీముడు సమర్థుడు. అతడు వేదాంత విషయాలు తెలిసినవాడు. శుకుడు, కృపుడు, ద్రోణుడు, శాలిహోత్రుడు, బలరాముడు మొదలగువారతనికి ఆ యా విద్యలను నేర్పినారు. గదను ప్రయోగించే పద్ధతులను భీముడు శుకునినుండి నేర్చుకొనినాడు. అతడు ధనుర్వేద రహస్యాలను కృపునివల్ల తెలిసికొనినాడు. ద్రోణుని శిష్యుడై భీముడు గదా ప్రయోగంలోని విశేషాలను గ్రహించినాడు. ద్రోణుని శిష్యులైన భీమ, దుర్యోధనులు గదాయుద్ధంలో కౌశలం గడించాలని గట్టిపట్టుదలతో విశేషమైన కృషిని చేసినారు. వారు గదా కౌశలాన్ని చూపించే సందర్భంలో నన్నయ వర్ణించిన గద్యమిది. "అంత ననంత బలపరాక్రమములగు భీమ దుర్యోధనులు ద్యుద్గదాహస్తులయి మహా మత్సరంబుతో నేకశృంగ సముత్తుంగ శైలద్వయంబు ననుకరించుచు వశానిమిత్తక్రుద్ధగంధసింధురంబులుం బోలె నొండొరులందాకి సవ్యాపసవ్య చిత్ర మండల మార్గంబుల గదా కౌశలంబు మెఱయునెడ." భీముడు శాలిహోత్రునివద్ద ధర్మశాస్త్ర నీతిశాస్త్రాలభ్యసించినాడు. మహాభారతములోని (ఆదిపర్వము పుట 420),—

"అసియుద్ధే గదాయుద్ధే రథ యుద్ధేచ పాండవః
సంకర్షణాద్ శిక్షద్ వైశల్వాత్ శిక్షాం వృకోదరః"

—అనే శ్లోకంవల్ల వృకోదరుడు బలరామునినుండి ఖడ్గయుద్ధము, గదాయుద్ధములోని మెలకువలను నేర్చుకొనినట్లు విదితమౌతుంది. భీముని శరీర దార్ఢ్యాన్ని నన్నయ ఇట్లా వర్ణించినాడు.

1. నన్నయ, op. cit., ఆదిపర్వము ఆరవఆశ్వాసము గద్యము 13 పుట 325

"ఉరు శార్దూల భయంబునఁ
బరవశయగు కుంతి యున్న బాలకుడు శిలో
త్కరంబుపయిఁబడియేఁదనని
ష్ఠురతను హత్తిఁజేసి రాలు చూర్ణంబులుగన్"1

భీముడు బక హిడింబ జరాసంధ జీమూతాదులను మల్లయుద్ధంలో జయించిన బలశాలి ప్రమాథము, ఉన్మథనము, క్షేపణము, ముష్టి, అవాఙ్ముఖము, సంప్రహారతలము, ఆకర్షణము, సమ్ముఖీకరణము, భ్రమణము, వికర్షణము మొదలైన మల్లయుద్ధరీతులలో భీముడు పేరుపొందినాడు. ప్రత్యర్థిని నేలమీద పడగొట్టి నలిపి వేయడం ప్రమథనమని పేర్కొనడం జరిగింది. శత్రువును పైకెత్తి అతని అవయవాలను పీడించడము ఉన్మథనము. ఎదుటి వ్యక్తిని ఉన్నచోటునుండి దూరంగా పారవేయడము క్షేపణము. పిడికిళ్ళతో రొమ్ముపై గట్టిగా కొట్టడము ముష్టి. ప్రత్యర్థిని భుజముపై వేసుకొని వరాహములాగా శబ్దము చేస్తుంటే వానిని త్రిప్పడము అవాఙ్ముఖము. చూపుడువ్రేలికి బొటనవ్రేలికి ఉండే మధ్యభాగాన్ని ప్రసారముచేసి శత్రువును గట్టిగా కొట్టడము సంప్రహారతలమని చెప్పబడింది. ఎదుటి వ్యక్తిని వ్రేళ్ళతో పట్టుకొని దగ్గరకు లాగుకోవడము సమ్ముఖీకరణము. ముందు, వెనుక, ప్రక్కభాగాలనుండి ఎదుటి వ్యక్తిని ఈడ్వడము భ్రమణము. అతన్ని వెనుకకు పడేలాగా వేగముగా త్రోయడము వికర్షణము. ఈ మల్లయుద్ధ రీతులన్నీ

---

1. నన్నయ, op. cit, ఆదిపర్వము పంచమాశ్వాసము పద్యము 114 పుట 284

• నిపాత్య పేషణం భూమౌ ప్రమాథ ఇతి కథ్యతే
యత్ తూర్ధ్వాయాంగ మథనం తదున్మథన ముచ్యతే
క్షేపణం కథ్యతే యత్ తు స్థానాత్ ప్రచ్యావనం హఠాత్
ఉభయోర్భుజయోర్ముష్టిరురోమధ్యే నిపాత్యతే
ముష్టిరిత్యుచ్యతే తజ్ఞైర్మల్లవిద్యా విశారదైః
అవాఙ్ముఖం స్కంధగతం భ్రామయిత్వా తథైవయః
క్షిప్తస్య శబ్దః సభవేద్ వరాహోద్ధూత విస్వనః
తర్జన్యంగుష్ఠ మధ్యేన ప్రసారిత కరోహియః
సంప్రహార తలాఖ్యస్తు సంగ్రాహో వజ్రమిష్యతే
అంగుల్యః ప్రసృతాయాస్తుతాః ప్రసృష్టా ఉదీరితాః
ఆకృష్య క్రోడీకరణం ప్రకర్షణ ముదాహృతమ్

భీమునికి తెలిసినవే. అతడు కత్తి, గొడ్డలివంటి సాధనాలను వాడకుండా కట్టె విరచడానికీ, చీల్చడానికీ చేతులనూ, కాళ్ళనూ ఉపయోగించెడివాడు చెట్టు మొదలును గట్టిగ పట్టుకొని ఊపడంలో, చెట్లను కూకటివేళ్లతో పెళ్లగించడంలో గమనవేగంతో చెట్లను దూసికొనిపోవడంలో అతనికి అతడేసాటి. భీముడు పాకశాస్త్రంలో ప్రవీణుడు భీముడు విరటునికొలువులో ప్రవేశించడానికి ముందు తనకు వంట చేయడంలోగల నేర్పును గురించి ధర్మరాజుతో చెప్పిన మాటలను తిక్కన క్రింది పద్యములో పొందుపరచినాడు.

"ఆఱు రసంబులున్ జవుల యందలి క్రొత్తలు పుట్టనిచ్చలున్
వేఱొకభంగిఁ బాకములు విన్నను వొప్పగఁజేసి చేసిన
న్మీఱఁగ బానసీని నొకనిం బురి గాననియట్లుగాఁగ మే
న్గాఱియపెట్టియైన నొడికంబుగ వండుదు నెల్లగూరలున్"[1]

భీముడు ధర్మరాజుకు ధర్మరహస్యాలను వినిపించినాడు. మందుడూ, అర్థజ్ఞాన శూన్యుడూ ఐన శ్రోత్రియునిబుద్ధి మంత్రపాఠంచే హతమైనట్లు ధర్మరాజు యొక్కబుద్ధి తత్త్వాన్ని దర్శించడంలేదని హెచ్చరించినాడు. అతడు హనుమంతుని వల్ల చతుర్యుగ ధర్మాలను తెలిసికొనినాడు. భీమునికి వేదాంత శాస్త్రజ్ఞానము కలదని చెప్పడానికి, అతడు పాముచే పట్టుబడినప్పుడు చెప్పిన మాటలు ఆధారంగా ఉన్నాయి. ఆ సందర్భములో భుజంగముతో భీముడు చెప్పిన విషయాన్ని నన్నయ ఇట్లా వర్ణించినాడు.

"కడుకొని కడు దుఃఖములై
నెడనుచితమె యాత్మనింద యెయ్యెడల మనం
బడలక యేకాకృతి నె
ప్పుడునుండుట సూవె పురుషు పురుషార్థ మిలన్"2

---

ఆకర్షణం లీలయైవ సమ్ముఖీకరణం స్మృతమ్
పురః పశ్చాత్ పార్శ్వయోశ్చాభ్యాం కర్షో భ్రమణం తథా
పశ్చాత్ ప్రపాతనం వేగాద్ వికర్షణ ముదాహృతమ్
వ్యాసుడు, op. cit., విరాటపర్వము పుట 1874

1. తిక్కన, op. cit., విరాటపర్వము ప్రథమాశ్వాసము పద్యము 77 పుట 8
2. నన్నయ, op. cit., అరణ్యపర్వము నాల్గవఆశ్వాసము పద్యము 114 పుట 170

ప్రాణులకు సుఖదుఃఖాల అనుభవం దైవాధీనమనీ, సంతోషానికి పొంగడం, సంతాపానికి క్రుంగడం పనికిరాదనీ, ఆత్మనింద దోషమనీ, ఆపద సంభవించినప్పుడు మానవుడు దాన్ని ధైర్యంగా ఎదుర్కోవాలనీ, దైవయోగం బలీయమనీ, పౌరుషం దుర్బలమనీ భీముడు చెప్పినాడు. భీముని పాత్రను సృష్టించడంలో భారతకర్త 'ధృతి'ని ప్రధానంగా దృష్టిలో ఉంచుకొనినట్లు తెలుస్తుంది. భీమునిలో భుజబలం ప్రధానంగా గోచరిస్తుంది. బుద్ధిబలం ఆతనిలో గౌణంగా కనిపిస్తుంది. నిత్య కృత్యాలైన ఆటలూ, వ్యాయామమూ మొదలైనవాటిపై శ్రద్ధచూపడంలో, పౌష్టికాహారాన్ని వాడడంలో భీముడు విద్యార్థులకు ఆదర్శప్రాయుడు. ఆపదలు కలిగినప్పుడు తోడిమానవులను ఆదుకోవడం, పెద్దలు హెచ్చరించినపుడైనా తన బలాన్ని అదుపులో పెట్టుకోవడం, తల్లిదండ్రుల ఆజ్ఞ శిరసావహించి ఇతరులకు సహాయం చేయడం మొదలైనవి భీమునిలో కనిపించే సుగుణాలు. బలశాలినని గర్వపడడం అతనిలోని దోషం. బలగర్వం అతని పతనానికి దారితీసింది. ద్రౌపది నకుల సహదేవులు పడిపోయిన తరువాత అతడూ విగతజీవుడై స్వర్గాన్ని చేరుకొనినాడు

4.13.3.

పాండురాజు నియోగంచే కుంతికి ఇంద్రునివరంవల్ల అర్జునుడు జన్మించినాడు అతడు స్ఫురద్రూపి, ఆజానుబాహుడు. అర్జునుడు గురుశుశ్రూషాపరుడు. అతడు మేటిధానుష్కుడు. అతడు అష్టవిధ మేధాశక్తులు కలవాడు. అర్జునుడు కళలలో, శాస్త్రాలలో ఆరితేరినవాడు. అర్జునుడు తత్త్వోపదేశము పొందినవాడు. అతడు శీలసంపన్నుడు. శుకుడూ, కృపుడూ, ద్రోణుడూ, చిత్రసేనుడూ, పరమేశ్వరుడూ, ఇంద్రుడూ, కృష్ణుడూ మొదలైనవారు అతని గురువులు. అర్జునుడు శతశృంగ పర్వతముపై నున్నప్పుడే శుకుని దగ్గర విలువిద్యను నేర్చుకొనినాడు. కృపాచార్యుని నుండి ధనుర్వేదములోని విశేషాలను గ్రహించినాడు. మహాభారతములోని (ఆదిపర్వము పంచమాశ్వాసము పుట 312)—

"నరుడస్త్రశస్త్ర విద్యా
పరిణతి నధికుడయి వినయ పరుఁడయి శశ్వ
ద్గురుపూజా యత్నంబునఁ
బరగుచు సంప్రీతుఁ జేసె భారద్వాజున్"

—అనే పద్యాన్నిబట్టి అర్జునుడు అస్త్రశస్త్రవిద్యలలో ఆరితేరినవాడని, ఏనయిపెంఇడని, నిరంతర గురుపూజా నిరతుడని విదితమౌతుంది. అర్జునుడు, ఏకలవ్యుని శర లాఘవాన్నిచూచి చింతాక్రాంతుడై, ద్రోణునితో రహస్యముగా చెప్పిన వృత్తాంతాన్ని నన్నయ ఇట్లా వర్ణించినాడు.

"విలువిద్య నొరులు నీక
గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదునని మున్
బలికితిరి నాక కాదీ
త్రిలోకముల కధికుఁ జూచితిమి యొక యెఱుకున్

నాకంటెను మీకంటెను
లోకములో నధికు డతి బలుండు ధనుర్వి
ద్యా కౌశలమున నాతడు
మీకుం బ్రియ శిష్యుఁడటె యమిథ్యా వచనా"¹

అర్జునుని మనోరుజను పోగొట్టడానికి ద్రోణుడు ఏకలవ్యుని కుడిచేతి బొటన వేలిని గురుదక్షిణగ కోరినాడు. కృత్రిమ పక్షి తలను తెగవేయడం, మొసలిబాధ ండి ద్రోణుని విముక్తినొందించడం, మత్స్యయంత్రాన్ని ఛేదించడం, సైంధవుని లను ఛేదించడం మొదలైన సంఘటనలనుబట్టి అర్జునునికిగల లక్ష్యశుద్ధి అమోఘ ని తెలుస్తుంది. హస్తిపురంలో కుమారుల అస్త్రశస్త్ర విద్యాప్రదర్శనం జరిగి ప్పుడు అర్జునుడు చూపిన అస్త్రవిద్యా విశేషాలను గురించి 'వ్యాయామ విద్య' నే విభాగంలో చెప్పడం జరిగింది. మహాభారతంలోని (వనపర్వము పుట 1077—

"సాంగోపనిషదాన్ వేదాం శ్చతురాఖ్యాన పంచమాన్
యోఽధీతే గురు శుశ్రూషాం మేధాంచాష్ట గుణాశ్రయామ్"

—అనే శ్లోకంవల్ల అర్జునుడు వేదవేదాంగాలనూ, ఉపనిషత్తులనూ, ఇతిహాస రాణాలనూ అధ్యయనము చేసినాడని, అష్టవిధ మేధాశక్తి సంపన్నుడని విదిత మౌతుంది. అర్జునుడు దేవలోకంలో ఐదు సంవత్సరాలుండి ఆగ్నేయమూ, రుణమూ, సౌమ్యమూ, వాయవ్యమూ, వైష్ణవమూ అనే అస్త్రాలనేగాక ప్రాజా త్యమూ, పారమేష్ఠ్యమూ మొదలైన అస్త్రాలను ఇంద్రునినుండి పొందినాడు.

---

¹ నన్నయ, op. cit, ఆదిపర్వము పంచమాశ్వాసము పద్యాలు 239, 240 పుట 315

అతడు చిత్రసేనుడనే గంధర్వపతి దగ్గర గీతావాద్యనృత్యాదులు అభ్యసించినాడు. అర్జునుని విద్యాభ్యాసాన్ని గురించి నన్నయ వర్ణించిన పద్యమిది.

"వజ్రాస్త్ర మాదిగా వరదుడై వివిధ ది
వ్యాస్త్రముల్ పార్థున కమరనిచ్చి
తత్ప్రయోగంబులుఁ దద్రహస్యంబులుఁ
దన్ని వర్తనములుఁ దడయ కపుడు
దయ నుపదేశించి దారుణాహవములం
దవిజేయ వీర్యుండ వగుము పేర్మి
నని మహాసౌహార్దుడై చిత్రసేనుఁడ
న్గంధర్వపతితోడ గారవమున
వజ్రధరుడు గీతవాద్యనృత్యంబులు
గఱపఁబంచె బార్థుఁగడఁగి యిట్టు
లమరనాథునొద్ద నర్జునుం డుండనే
నేడులరిగె నిట మహీతలమున"1

అర్జునుడు పరమేశ్వరునినుండి పాశుపతాస్త్రాన్ని సంపాదించినాడు. అతడు ఉత్తమ విద్యార్థి. అర్జునుడు ఔచిత్యాన్నిపాటించి, అవసరమైన ప్రశ్నలుపేసి, తనకు కలిగిన సందేహాలను తొలగించుకొంటూ, తత్త్వజ్ఞానాన్ని శ్రీకృష్ణునినుండి పొందినాడు. అర్జునుడు శీలసంపన్నుడు. ఊర్వశి తానై కోరివచ్చినా అతడు ఏమాత్రమూ చలించలేదు.

మహాబలసంపన్నులైన రాజకుమారులు కృష్ణమృగ చర్మధారులై అర్జునుని దగ్గర శిక్షణను పొందినారు. ప్రద్యుమ్నుడూ, అనిరుద్ధుడూ మొదలైన యాదవ రాజకుమారులూ, ఉపపాండవులూ, అభిమన్యుడూ మొదలైనవారు అతని శిష్యులే మహాభారతంలోని (ఆదిపర్వము అష్టమాశ్వాసము పుట 528). "ధనంజయుతో ధనుర్వేద మిమ్ముగ నభ్యసించెఁ బ్రవీర వైరి పతాకినీ భేద మార్గములెల్ల నేర్చె నభేద్య విక్రమ సంపదన్" అనే పద్యభాగంవల్ల అభిమన్యుడు అర్జునునినుండి ధనుర్వేద రహస్యాలను, శత్రుసైన్యాలను భేదించే పద్ధతులను గ్రహించినట్లు విదితమౌతుంది. రాజకన్యకలకు నృత్తము నేర్పడానికి లలితకళలలో నైపుణ్యాన్ని సంపాదించిన షండులను నియోగించడమనే సంప్రదాయం ఆనాడు ఉండేది.

1. నన్నయ. op. cit., అరణ్యపర్వము ప్రథమాశ్వాసము పద్యము 369 పుట 50

అందువల్ల అర్జునుడు బృహన్నల అనుపేరుతో విరటునికొలువులో చేరినాడు. నృత్త గీతవాద్యాలలో తనకుగల నేర్పును గురించి బృహన్నల విరటునితో చెప్పిన వృత్తాంతాన్ని తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"వి(శుత వాద్యంబులు మం
జు(శుతి సంభావ్య గీతి సుగతులు సద్భా
వా(శయములుఁ దజ్జన్య ర
సా(శయములు నైన యభినయంబు లెఱుగుదున్.

ఇన్ని తెఱగుల (శమము సేయింతుఁ జతుర
తా విహీనములైన పాత్రములనైన
నట్టువొజ్జనై మెలగుదు నగళులందు
నిపుణ నైపథ్య విధులకు నేర్తునధిప."1

విరటుడు బృహన్నల స్వభావాన్ని గుర్తించి తన కూతురును శిష్యురాలిగ అప్పగించి అతన్ని చీని చీనాంబరాలతో, కర్పూర తాంబూలాలతో, ఆభరణాదులతో సత్కరించినాడు. ఉత్తరకుగల (క్రీడాసక్తిని (క్రమంగా తగ్గించి, ఆమెకు కళాసక్తిని కలిగించమని బృహన్నలతో విరటుడు చెప్పినాడు. గురువే సర్వస్వమనీ, ఆయన చెప్పినట్లు నడచుకొంటూ భక్తితో విద్యను నేర్చుకొమ్మని ముద్దుకూతురుకు విరటుడు బుద్ధిచెప్పినాడు. విరటుని కొలువులో బృహన్నలకు స్వేచ్ఛ ఉండేది బాలలకూ, వృద్ధులకూ, షండులకూ మొదలైనవారికి శిక్షణయివ్వడంలో బృహన్నల సమర్థుడు. అతడు ఉత్తరను కళామయిగ తీర్చిదిద్దినాడు. అజ్ఞాతవాసకాలము పూర్తి ఐన తరువాత బృహన్నలే అర్జునుడని తెలుసుకొని, విరటుడు ఉత్తరను ఇచ్చి వివాహము చేస్తానని చెప్పినప్పుడు అర్జునుడు శిష్యురాలిని అలిగా స్వీకరించననినాడు. చతురమైన మతి, లోకోత్తరమైన నడవడి అర్జునునిలోని సుగుణాలు. అతడు ఉత్తమ ఆచార్యుడుగ పేరుగాంచినాడు. మేటి ధానుష్కుడనని గర్వపడడం, (ప్రల్లదాలు పలకడం, సాటి వీరయోధులు పైకి వస్తారనే ఈర్ష్యా ద్వేషములు, సులభ కోప స్వభావమూ మొదలైనవి అతని పతనానికి హేతువులు. (ద్రౌపది నకుల సహదేవులు పడిపోయిన తరువాత అతడూ విగతజీవుడైనాడు.

---

1. తిక్కన, op. cit., విరాటపర్వము (ప్రథమాశ్వాసము పద్యములు 241, 242 పుట 23

4.13.4

నకుల సహదేవులు అశ్వినీదేవతల వరంవల్ల మాద్రికి జన్మించినారు. వారు గురుజన శుశ్రూష, వినయము, సహనము కలవారు. నకులుడు శుకునిదగ్గర కత్తిని త్రిప్పడంలో ప్రావీణ్యాన్ని సంపాదించినాడు. అతడు శాలిహోత్రునిదగ్గర శాస్త్రాలను అభ్యసించినాడు. అతడు గుఱ్ఱాల స్వభావాన్ని గుర్తించడంలో సమర్థుడు. వాటికి శిక్షణ యివ్వడంలో, చికిత్సచేయడంలో, మొండిగుఱ్ఱాలను సాధువులుగ మార్చడంలో నకులుడు ప్రావీణ్యాన్ని సంపాదించినాడు. నకులుడు తనకుండే అశ్వవిషయకమైన విచక్షణత్వాన్ని గురించి విరటునితో ఇట్లా చెప్పినాడు.

"అవయవలక్షణం బాయుః ప్రమాణంబు
గర్వంబు లింగితా కారములును
మాత్రాంతరము వయోమానంబు దేశకా
లోచితాహార ప్రయోగభంగి
జాత్యనురూప శిక్షావిధి క్రమగతి
వ్యాయామ సాత్మ్య ప్రవర్తనంబు
ప్రమద విషాదాది బహువిధ చిత్త ధ
ర్మము పోషణ ప్రకారము చికిత్స

పరిచితములు ధరణీపాల నీముందట
రూపురేఖ మెఱయఁ జూపనేర్తు
బవరమైన నాకు బనియేమి యనఁ జేతి
బలిమి కలిమి నెఱపఁ దలపు గలదు."[1]

నకులునికి ఖడ్గవిద్యలో నైపుణ్యం ఉంది. శత్రువులను చంపడానికీ, ఆత్మరక్షణకూ, కత్తి ఉత్తమ సాధనమని నకులుడు భీష్మునివల్ల తెలుసుకొనినాడు. భీష్ముడతనికి ఖడ్గాగమాన్ని వినిపించినాడు. ఖడ్గం విష్ణువునుండి మరీచికీ, ఆతని నుండి భార్గవునికీ, భార్గవునినుండి మునులకూ, వారినుండి ఇంద్రునికీ, ఇంద్రుని నుండి లోకపాలకులకూ, వారినుండి మనువులకూ, వారినుండి క్రమంగా దుష్యంతునికీ, దుష్యంతునినుండి భరతునికీ సంక్రమించిందనీ. తరువాత అది ఒక మునివల్ల ద్రోణునికీ, అతనినుండి కృపునికీ వచ్చిందని భీష్ముడు నకులునితో

1. తిక్కన, op. cit., విరాటపర్వము ప్రథమాశ్వాసము పద్యము 264 పుట 25

చెప్పినాడు. కృపునినుండి పాండవులకు ఖడ్గవిద్య సంక్రమించింది. నకులునికి ఖడ్గవిద్యపై ఎక్కువ ఆదరము ఉన్నందువల్ల, అందలి విశేషాలను గ్రహించినాడు. తనంతటి అందగాడు లేడని గర్వించినందువల్ల నకులుడు పతనమైనాడు. ద్రౌపది సహదేవులు విగతజీవులైన తరువాత అతడూ విగతజీవుడై స్వర్గాన్నిచేరుకొనినాడు.

4.13.5.

సహదేవుడు తక్కిన సోదరులలాగా ఆయా విద్యలను ఆయా గురువుల కడ అభ్యసించినాడు. అతడు పశువిద్యలో ప్రవీణుడు. విరటుని కొలువులో తాను గోపాలకుడుగ చేరగలనని ధర్మజునితో సహదేవుడు చెప్పిన వృత్తాంతాన్ని తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"వంజల నైనను వలనేర్పడఁగ నొక
 భంగిఁ జేఁపగఁజేసి పాఁడిగొనగ
బడుగుల నైనను బాటించి పరికించి
 గోమున మైఁగండ క్రొవ్వదేఱ
దెవులు గొంటులనైనఁ దేర్చు సంకటమున
 కోపిముందటియట్ల రూపుసేయ
నట్టులనైనను నలువైన వెరవున
 ముట్టె యంటగఁబట్టి కట్టివిడువ
బిదుకఁ గదుపుసేర్ప బెదరు వాపగ నీరు
మేపు గలుగు నెడకు మెలగ వెలువ
మృగము నరయ ముచ్చు రే వగలును గొట్ట
నేర్తుఁ బసికి జాలఁగూర్తు నేను."1

పై పద్యంవల్ల సహదేవుని పశువిద్యా ప్రావీణ్యం వ్యక్తమౌతుంది. తనంతటి ప్రజ్ఞావంతుడు లేడని గర్వించడంవల్ల సహదేవుడు పతనం చెందినాడు.

4.13.6.

కర్ణుడు దుర్వాసుని వరంచే సూర్యునివల్ల కుంతి కన్యకగా నున్నప్పుడు జన్మించినాడు. అతడు సహజ కవచకుండల మండితుడు. అతనిఎత్తు ఎనిమిది

---

1. తిక్కన. op. cit., విరాటపర్వము ప్రథమాశ్వాసము పద్యము 101 పుట 10

పెడిమూరలు అతడు దీర్ఘ భుజుడు. వ్యూఢోరస్కుడు. అతడు దుర్జయుడు. స్వాభిమానము కలవాడు కర్ణుడు గొప్ప వీరుడు. శూరుడు. ప్రియదర్శనుడు.[1] కర్ణుడు క్షత్రియ వంశంలో జన్మించినా సూతుని యింటిలో పెరిగినాడు. ధనుర్వేదం శిక్షణను ఇప్పించడానికై సూతుడు కర్ణుని హస్తిపురానికి పంపినాడు. అచట కర్ణునికి దుర్యోధనునితో మైత్రి ఏర్పడింది.[2] కర్ణుడు అస్త్రశస్త్ర విద్యలను కృప ద్రోణ పరశురాములనుండి గ్రహించి ప్రపంచములో గొప్ప విలుకాడుగ ప్రసిద్ధుడైనాడు[3] హస్తిపురంలో రాజకుమారుల అస్త్రవిద్యా ప్రదర్శనము జరుగుచున్నప్పుడు భీష్మ ధృతరాష్ట్రులు వారి నైపుణ్యాన్ని మెచ్చుకొని ఆనందించినారు కాని కానీనుని ఎవ్వరు పలకరించలేదు. అతడు రోషంతో రంగంలో ప్రవేశించి అర్జునుని ఆక్షేపించినాడు. కర్ణార్జునులకు ద్వంద్వయుద్ధము జరిగింది. వారు ఒకరికొకరు తీసిపోకుండ యుద్ధము చేసినారు. అర్జునుడు చూపించిన విద్యలన్నింటిని తానూ చూపించగలిగినాడు. కర్ణుడు ద్రోణుని ఆశ్రయించి బ్రహ్మాస్త్రాన్ని ప్రసాదించమని అడిగినాడు. వ్రత సమన్వితుడైన బ్రాహ్మణునికీ, తపస్సంపన్నుడైన క్షత్రియునికీ తప్ప మిగిలినవారికి ఆ అస్త్రాన్ని ఉపదేశించనని ద్రోణుడు చెప్పినాడు అందువల్ల ఆ అస్త్రాన్ని ఎట్లైనా పొందాలనే పట్టుదల అతనికి కలిగింది. కర్ణుడు పరశురాముని దగ్గర శిష్యుడుగ చేరినాడు. అబద్ధము చెప్పి ఐనా విద్యను నేర్వాలనే ఉద్దేశము అతనిది. అతడు తాను బ్రాహ్మణ వంశానికి చెందినవాడినని చెప్పి పరశురామునివల్ల బ్రహ్మాస్త్రి, భార్గవాస్త్రి ప్రయోగాది పద్ధతులను నేర్చుకొనినాడు, కర్ణుని భుజబలము, ఇంద్రియ నిగ్రహము, సేవా

---

1. అష్టరత్ని ర్మహాబాహు ర్వ్యూఢో రస్కః సు దుర్జయః
అభిమానీ చ శూరశ్చ ప్రవీరః ప్రియదర్శనః
వ్యాసుడు. op. cit., కర్ణపర్వము శ్లోకం 30 పుట 4001

2. సూతస్త్వధిరథః పుత్రమ్ వివృద్ధం సమయేనతమ్
దృష్ట్వా ప్రస్థాపయామాస పురం వారణ సాహ్వయమ్
Ibid శ్లోకము 16 పుట 816

3. ద్రోణాత్ కృపాచ్చ రామాచ్చ సోఽస్త్రగ్రామం చతుర్విధమ్
లబ్ధ్వా లోకేఽభవత్ ఖ్యాతః పరమేష్వా సతాంగతః
Ibid శ్లోకము 18 పుట 1816

నిరతి, పరశురామునికి ఆశ్చర్యాన్ని కలిగించినాయి. కర్ణుడు పరశురాముని శాపానికి గురి అయినాడు. ఒకనాడు కర్ణుని తొడ తలగడగా పరశురాముడు పడుకొని ఉండగా ఒక కీటకం కర్ణుని కరచింది. గురువుకు నిద్రాభంగం కలుగుతుందని కర్ణుడు కదలలేదు. కొంతసేపటికి పరశురాముడు మేల్కొనినాడు రక్తం కారుతూ ఉన్నా కర్ణుడు కాలు కదిలించకుండడం గమనించి అతని వంశాన్ని సందేహించి నిజం చెప్పమని పరశురాముడు కర్ణుని అడిగినాడు. తాను సూతవంశానికి చెందిన వాడినని కర్ణుడు చెప్పినాడు. అతడు గురువు శాపానికి గురి అయినాడు. కర్ణుడు వేదపారగులైన బ్రాహ్మణుల ఉపాసనచేసినాడు. అతడు సంయమన నియమాలను పాటించి దోషదృష్టిని వదలి వారిని అడిగి తత్త్వార్థాన్ని తెలిసికొనినాడు అతడు సనాతన వైదిక సిద్ధాంతాలు తెలిసినవాడు. ధర్మశాస్త్రాలలో పండితుడు. కృష్ణుడు కర్ణుని పాండిత్యాన్ని ప్రశంసించినాడు.[1] ఇన్ని శక్తులున్నా, శాపోపహతుడు కాబట్టి కర్ణుడు అర్జునుని చేతిలో మరణించినాడు. దాననిరతి, వృద్ధోపసేవనము, స్వామిభక్తి మొదలైన సద్గుణాలు కర్ణునిలో ఉన్నాయి. సమర విద్యలో మేటి అనిపించుకొని, తనపేరుతో మహాభారతంలో ఒక పర్వాన్ని నిలుపుకొన్న కర్ణుని చరిత్ర విచిత్రమైంది. ధర్మ నిర్వహణలో మిత్రునికోసము ప్రాణాలర్పించిన విషాద వీరుడు కర్ణుడు. పెద్దలయెడ అవహేళనమూ, అల్పులతో చేయి కలపడం, అల్పమైన బుద్ధి ప్రదర్శించడం. సమయము వచ్చినపుడు స్వార్థముతో పరాయికావడంలాంటి బలహీనతలు మూర్ఖత్వమూ అతని పతనానికి హేతువులు.

4.14. దుర్యోధనుని విద్యాభ్యాసము :

దుర్యోధనుడు గాంధారీ ధృతరాష్ట్రుల జ్యేష్ఠ పుత్రుడు. అతడు గదాయుద్ధ విశారదుడు. దుర్యోధనుడు అభిమానధనుడు. జలస్తంభన వాయుస్తంభనాది విద్యలు తెలిసినవాడు దుర్యోధనుడు కృపుడు, ద్రోణుడు, బలరాముడు మొద

1. ఉపాసితాస్తే రాధేయ బ్రాహ్మణాః వేదపారగాః
తత్త్వార్థం పరిపృష్టాశ్చ నియతేనానసూయయా
త్వమేవ కర్ణజానాసి వేదవాదాన్ సనాతనాన్
త్వమేవ ధర్మశాస్త్రేషు సూక్ష్మేషు పరినిష్ఠితః
వ్యాసుడు, op. cit,. ఉద్యోగపర్వము శ్లోకములు 6, 7 పుట 2415

లైనవారి దగ్గర విద్యాభ్యాసము చేసినాడు. అతడు కృపుని శిష్యుడై వేదవేదాంగాలు, అర్థశాస్త్రము, అష్టవిధాలైన వ్యాకరణాలను నేర్చుకొనినాడు. దుర్యోధనుడు భీమునిపై స్పర్ధవహించి పదుమూడేండ్లు గదాయుద్ధంలోని విశేషాలను తెలుసుకోడానికి పరిశ్రమ చేసినాడు.2 భీమ దుర్యోధనులు బలరాముని శిష్యులు. వారిరువురు గదావిద్యను బలరాముని దగ్గర అభ్యసించినారు. భీముడు బలపంపన్నుడు. సమర్థుడు. దుర్యోధనుడు గదాయుద్ధంలో నేర్పుగలవాడు. భీముడు గదతో శత్రులవును గట్టిగా కొట్టగలడే కాని దుర్యోధనునికిగల గదానైపుణ్యము భీమునికిలేదు. గదాయుద్ధంలో భీమునికంటె అభ్యాసదక్షుడైన దుర్యోధనుడే గొప్పవాడని కృష్ణుడునిర్ణయించినాడు 3 దుర్యోధనుడు యుక్తి యుక్తముగ మాటలాడడంలో నేర్పుకలవాడు. పాండవులజేయులని భీష్ముడు చెప్పినప్పుడు పాండవులూ, కౌరవులూ ఒకే వంశములో జన్మించినవారనీ, వారికి శిక్షణ సమానమనీ, ఆ రెండూ సమానమైనప్పుడు పాండవులకే యుద్ధంలో విజయం కలుగుతుందని తలంచడం అర్థరహితమనీ; పరాక్రమములో, ప్రతిభలో, శాస్త్ర జ్ఞానములో తనవారు పాండవులతో సమానులని దుర్యోధనుడు పలికినాడ దుర్యోధనునికి మంత్ర తంత్ర శక్తులు ఉన్నాయి, వాటిని గురించి తిక్కన ఇట్లా వర్ణించినాడు. "పెరిగిపచ్చు కార్చిచ్చునుడుపను బాషాణవర్షంబు వారింపను మహా వాయువును నిలుపను నీళ్లు గట్టిగా నభిమంత్రించి వానిపై గరితురగ దుల నడిపింపను నా సేన నడచునప్పుడు వలసినచోట జలంబులుత్పాదింపను జాలుదు సింహ శరభ శార్దూల భూత బేతాళాది క్రూర సత్త్వ సంరంభ స్తంభన ప్రకారం బెఱుంగుదు మిత్ర శత్రు విషయంబులైన శుభాశుభంబులు వలయుభంగి నావహిం

---

1. నిరుక్తం నిగమం ఛందః స షడంగార్థ శాస్త్రవాన్
అధీతః కృతవిద్యస్త్వపుష్ట వ్యాకరణైః కృపాత్
వ్యాసుడు, op. cit., సభాపర్వము పుట 853

ఏతే నహికృతా యోగ్యా వర్షాణీహ త్రయోదశ
ఆయనే పురుషే రాజన్ భీమసేన జిఘాంసయా
Ibid పుట 4221 శ్లోకము 4

బలీ భీమః సమర్థశ్చ కృతీ రాజా సుయోధనః
లవాన్వా కృతీ వేతి కృతీ రాజన్ విశిష్యతే
id పుట 4221 శ్లోకము 8

సేస్తి మఱియు నానావిధ సిద్ధిప్రదంబులగు మంత్ర ధ్యానాద్యనుష్ఠానంబుల నాకుం గొఱంతలేదు."1 దుర్యోధనుడు ఆతతాయి, కొంపకు నిప్పుపెట్టడం, విషం పెట్టడం, నిద్రించేవారిని చంపడానికి ప్రయత్నించడం, అర్థలోభము, పట్టువిడుపు లేకపోవడం, గురుజనదూషణము మొదలైన చెడ్డగుణాలు అతనిలో ఉన్నాయి అందువల్లనే దుర్యోధనుడు నికృష్టమైన మరణానికి గురియైనాడు.

4.15. ఏకలవ్యుని విద్యాభ్యాసము :

ఏకలవ్యుడు హిరణ్యధన్వుడనే ఎఱుకలరాజు కుమారుడు. ద్రోణుడు ధనురాచార్యుడుగ ప్రసిద్ధిచెంది ఉండడం తెలుసుకొని, ఏకలవ్యుడు విలువిద్యను నేర్చుకోవడానికి అతన్ని ఆశ్రయించినాడు. కాని ఏకలవ్యుడు నిషాదుడని ద్రోణుడతనిని శిష్యుడుగ స్వీకరించలేదు. ఏకలవ్యుడు ద్రోణుని సెలవు తీసుకొని అరణ్యానికిపోయి మట్టితో ద్రోణుని విగ్రహము తయారుచేసి దానిని గురువుగా భావించి స్వయంకృషితో విలువిద్యను నేర్చుకొనినాడు. కురుపాండవులొకనాడు అతడున్న అరణ్యానికి వేటకు వచ్చినారు. వారికుక్క ఏకలవ్యునిచూచి మొరిగింది. దాన్ని అతడు బాణములతో కొట్టినాడు. "దాని ముఖంబునందేడు బాణంబు లొక్కటఁదొడిగి యక్కజంబుగా"2 అతి లాఘవంతో ఏకలవ్యుడు వేసినాడు. శరపూరిత ముఖంతో తమ దగ్గరకు వచ్చిన కుక్కనుచూచి ఆశ్చర్యాన్నిపొంది వారు దానిపై బాణాలను వేసినవాన్ని చూడాలనే కోరికతో వానికోసం వెదకుతూ వచ్చినారు. వారు, "లేఁజిత బాణహస్తు దృఢ దీర్ఘ మలీమసకృష్ణదేహుఁ గృష్ణాజిన వస్త్రు నస్త్రవిషయాస్త విషాదు"3 డైన నిషాదుని చూచినారు. అతని శరలాఘవం వారికి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఈ వృత్తాంతాన్ని వారు ద్రోణునికి తెలిపినారు. ద్రోణుడు అచటికి వచ్చినాడు. శిష్యులు అతన్ని అనుసరించినారు. ఏకలవ్యుడు ద్రోణునితో, "నేను మీ శిష్యుండ మిమ్మారాధించి మీ ప్రసాదంబున నివ్విలువిద్యఁ గఱచితి"4 అన్నాడు. అప్పుడు ద్రోణుడు ఏకలవ్యుని కుడిచేతి బొటనవ్రేలును

1. తిక్కన, op. cit, ఉద్యోగపర్వము గద్యము 262 పుట 224, 225
2. నన్నయ, op. cit., ఆదిపర్వము 5వ ఆశ్వాసము గద్యము 234 పుట 314
3. ,, ,, ,, పద్యము 235
4. ,, ,, ,, గద్యము 241 పుట 315

దక్షిణగా ఇమ్మని కోరినాడు. ఏకలవ్యుడు తన వ్రేలిని తెగగొట్టి భక్తితో ద్రోణునికి దక్షిణగా సమర్పించినాడు.

4.16. సహస్రపాద ఖగమాది శిష్యుల వృత్తాంతము :

ఇంతవరకు చెప్పబడిన ఆచార్యులు శిష్యులేగాక మరికొందరు ఆచార్యులు - శిష్యులు మహాభారతంలో ఉన్నారు. సహస్రపాదుడు, ఖగముడు ఒకే గురువు దగ్గర విద్యాభ్యాసముచేసినారు. ఒకనాడు ఖగమునిపై సహస్రపాదుడు గడ్డిపామును వేసినాడు. అతడులికిపడి కోపముతో పామువుగమ్మని సహస్రపాదుని శపించినాడు. ఒక్కొక్కప్పుడు నవ్వులాటకు చేసిన పనులవల్ల ప్రమాదాలు సంభవించవచ్చు. అందువల్ల విద్యార్థులు సహాధ్యాయులపట్ల జాగ్రత్తగ ప్రవర్తించవలసి ఉంటుంది. ప్రమతి దగ్గర వేదవేదాంగాలేగాక సకల ధర్మశాస్త్రాలభ్యసించి తన బుద్ధిబలంచే జనమేజయుని మెప్పించి సర్పయాగాన్ని నివారించిన ఆస్తీకుడూ, శమీకుని శిష్యుడైన గౌరముఖుడూ, ధనుర్వేదంలోను. ఖడ్గవిద్యలోను ప్రసిద్ధుడైన ధృష్టద్యుమ్నుడూ ధనుర్వేదాన్ని ద్రోణుని దగ్గర అభ్యసించిన శిఖండీ, కింపురుష ప్రవరుడైన ద్రుమునివల్ల ధనుర్వేదాన్ని సంపూర్ణంగా పొందిన రుక్మీ, సాత్యకీ, అరణ్యంలో చదువుకొంటూ తన తండ్రిని సేవించిన సత్యవంతుడూ, ఇంద్రుడాజ్ఞాపించినట్లు పాండవులకు ఇంద్రప్రస్థాన్ని నిర్మించియిచ్చిన విశ్వకర్మ, శిల్పాచార్యుడుగ పేరు పొందిన పురోచనుడూ, సురంగవిద్యను నేర్చిన ఖనకుడూ, 'చాక్షుషి' అనే విద్య నెరిగిన అంగారపర్ణుడూ మొదలైన శిష్యులు మహాభారతంలో ఉన్నారు. ఉత్తమ విద్యార్థులకూ, ఆదర్శప్రాయులైన ఆచార్యులకూ మహాభారతం నిలయం. ఆనాటి గురు శిష్యుల సంబంధము హార్దికమైనది. కేవలం ఆర్థికమైనది కాదు. వారి సంబంధము తండ్రి కొడుకుల అనుబంధము లాంటిది. కుమారుడు తండ్రిని ఎలా ప్రేమిస్తాడో అలాగే ఆనాటి శిష్యుడు గురువును ప్రేమించేవాడు. ఆనాటి విద్యార్థి పుత్రధర్మాన్ని పాటించి గురుపత్నిని తల్లిగా, గురుపుత్రికను సోదరిగా భావించేవాడు. గురువు అనుగ్రహిస్తేచాలు శిష్యుడు ఎటువంటివాడైనా వానిపాత్ర ఎట్లాంటిదైనా విద్య సంక్రమించిన సందర్భాలు భారతంలో ఉన్నాయి. గురువు అపేక్షలేకుండ విద్యలో కృతార్థులైనవారూ ఉన్నారు. ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించి కొందరూ, వర్గ ప్రాతిపదికపై కొందరూ, శిష్యుల పరిచర్యకు సంతోషించి కొందరూ, శిష్యుని లక్షణాలు ముఖ్యంగా భావించి కొందరూ విద్యను నేర్పిన ఆచార్యులు భారతంలో ఉన్నారు. గురువులలో కొందరు అణిమాది అష్టసిద్ధులు సంపాదించినవారు కాబట్టి

శిష్యులకు తమ మహిమతో విద్యను ప్రసాదిస్తుండేవారు. శిష్యులు అత్యంత శ్రద్ధాభక్తులుకలవారు కాబట్టి వారికి విద్య సమగ్రంగా సిద్ధిస్తూ ఉండేది. రహస్య విద్యను చెప్పడానికి ఆనాడు శిష్యుల శమదమాది సాధన సంపత్తిని ప్రధానంగా తీసుకోవడంజరిగింది. విద్యార్థుల సర్వతోముఖాభివృద్ధికి గురుశిష్యుల సత్సంబంధము చాలా ముఖ్యము. ఆనాడు గురువులు శిష్యులకు విద్యను బోధించడానికి ఏ యే పద్ధతులను పాటించినారో వాటిని గురించి వివరించడం తరువాత ప్రకరణంలోని ముఖ్య విషయము.



# 5. మహాభారతము - బోధన పద్ధతులు

5.1. ప్రవచనము: ప్రయోజనము-ప్రేరణ. ప్రతిస్పందన పద్ధతి-యౌగికపద్ధతి

ఆచార్యునీ, అంతేవాసినీ సంధించేది ప్రవచనము. విద్యార్థికి జ్ఞానాన్ని కలిగించడం, అతని శీలాన్ని తీర్చిదిద్దడం ప్రవచనమువల్ల కలిగే ప్రయోజనాలు. విద్యార్థులలో తరతమభేదాలు కలగడానికి కారణము జ్ఞానమే. వ్యక్తికి కన్ను చెవి ముక్కు నాలుక చర్మము అనేవి జ్ఞానేంద్రియాలు.[1] అవి దృష్టి శబ్ద గంధ రస స్పర్శలకు సంబంధించిన ప్రచోదనలకు (Stimuli) ప్రతిస్పందనలను (Responses) కలిగించడంవల్ల ఆ ప్రతిస్పందనలు బుద్ధి సంపర్కముచే జ్ఞానంగా మారడం జరుగుతుంది. సాధారణమైన వ్యక్తికి ఈ 'ప్రేరణ-ప్రతిస్పందన' పద్ధతిలో జ్ఞానం సంక్రమిస్తుంది. ఒక ఋషికి అంతఃస్ఫూర్తివల్ల (Intution) జ్ఞానం సిద్ధిస్తుంది. దీనిని యౌగిక పద్ధతి (Yogic learning) అని అంటారు. ఈ పద్ధతిని గురించి ప్రేమనాథ్ అను విద్యావేత్త ఇట్లా చెప్పినాడు. When yogi reaches the highest level of consciousness, he loses all consciousness of subject and object, 'I' and 'you'. He is all one with consciousness, he and consciousness are not two divisible things. It is a state of perfect, 'Anand' when by a flash of, 'Pragna' or Intution, the whole of the reality is grasped in the twinkling of an eye, the reality as such can only be experienced. ............Yogic theory and similar thoughts exercised a tremendous influence over the educational system in ancient India."[2] మహాభారతంలోని (ఆదిపర్వము 6వ ఆశ్వాసము పుట 126),—

"సద్యోగర్భంబున నహి
మద్యుతి తేజుండు వేదమయుఁ డఖిల మునీం
ద్రాద్యుఁడు వేదవ్యాసుం
డు ద్యచ్ఛ్జ్ఞానంబుతోడ నుదితుండయ్యెన్"

—అనే పద్యాన్నిబట్టి వేదవ్యాసునికి అంతఃస్ఫూర్తివల్లనే జ్ఞానము సిద్ధించిందని

---

1. "చక్షుః శ్రోత్రే నాసికా త్వక్ చ జిహ్వా జ్ఞానస్యైతా న్యాయతనాని"
వ్యాసుడు. op. cit., ఉద్యోగపర్వము శ్లోకము 25 పుట 2135

2. Premnath. The Bases of education, Page 10, 11
S. Chand and Co., Ram Nagar - New Delhi-55, 1957,

బోధపడుతుంది. మహాభారతములోని (శాంతిపర్వము షష్ఠాశ్వాసము పుట 252) "జనియించిన మాత్రన యమ్మునిప కిశోరమును వేదములు వొందెను దజ్జనకు మును పొందిన తెఱఁగున" అనే పద్యంవల్ల శుకుడుకూడ సద్యోజ్ఞాన సంపన్నుడని విదితమౌతుంది గురువుకు జ్ఞానము ఏ పద్ధతిలో ప్రాప్తించినా, దాన్ని శిష్యునికి బోధించే పద్ధతికూడ అతనికి తెలిసి ఉండడం అవసరము. సులభమైన విషయాన్ని బట్టి క్లిష్టతరమైన విషయాన్ని బోధించడం, స్థూలాన్నిబట్టి అంతకంతకు సూక్ష్మమైనదాన్ని బోధించడం, విద్యార్థికి ముందు తెలిసినదాన్నిబట్టి అంతకంతకూ క్రొత్త విషయాన్ని తెలపడం, ఉదాహరణలనుబట్టి సామాన్య లక్షణాలను బోధించడం. అంతకుముందు సందిగ్ధమైన విషయాన్ని క్రమంగా నిశ్చితంచేయడం, సమష్టినుండి వ్యష్టినీ, వ్యష్టినుండి సమష్టినీ బోధించడం, విద్యార్థి అనుభవంలో ఉన్న అంశాలను తత్త్వముతో కలిపి చెప్పడం అనే బోధన రీతులవల్ల గురువు చెప్పిన విషయం శిష్యుని మనస్సుకు హత్తుకొంటుంది. ఆచార్యునిలో దోషమున్నా, ప్రవచన విధానంలో లోపమున్నా, శిష్యునిలో ఛిద్రమున్నా బోధన సత్ఫలితాన్ని ఇవ్వదు. గురుశిష్యులు ప్రవచన సమయంలో పాటించవలసిన నియమాలను గురించిన విషయము భారతంలో ఇట్లా చెప్పబడింది.

''యశ్చా ధర్మేణ వై బ్రూయాద్ యశ్చాధర్మేణ పృచ్ఛతి
తయోరన్యతరః ప్రైతి విద్వేషం చాధి గచ్ఛతి"[1]

అధర్మపూర్వకమైన విషయాన్ని గురువు బోధించకూడదని, ధర్మేతరమైన ప్రశ్నలను శిష్యుడు అడగకూడదని, వారిరువురిలో ధర్మము ఉల్లంఘించినవారికి మరణము తప్పదని పై శ్లోకాన్నిబట్టి విదితమౌతుంది.

ప్రాచీన కాలంలోని బోధన రీతులనుగురించి 'మలి వేదయుగములోని విద్యా విధానము' అనే విభాగములో చెప్పడం జరిగింది. విషయాన్ని నేర్చుకోవడానికి విద్యార్థి ఆనాడనుసరించిన అనుకరణము, ధారణము, బిగ్గరగా పఠించడమూ అనే పద్ధతులు లిపివచ్చిన తరువాతకూడ వాడుకలో ఉండడము గమనింపదగిన విషయము.

సాహిత్యాన్ని బోధించే పద్ధతులకు, శాస్త్రాన్ని బోధించే పద్ధతులకు భేదముంటుంది. ఒక శ్లోకాన్నిగాని, ఒక పద్యాన్నిగాని బోధించడానికి ఆచార్యుడు పఠనము, పదచ్ఛేదము, ప్రతిపదార్థము, అన్వయము, తాత్పర్యనిర్ణయము అనే

1. వ్యాసుడు, op. cit., ఆదిపర్వము శ్లోకము 91 పుట 54

దశలను పాటించవలసి ఉంటుంది. శాస్త్రాన్ని బోధించే పద్ధతిలో ప్రతిజ్ఞ, హేతువు, దృష్టాంతము, ఉపనయము, నిగమనము అనే దశలను ఉపాధ్యాయుడు అనుసరించ వలసి ఉంటుంది. ఈ పద్ధతిని పంచావయవవాక్య పద్ధతిగా పేర్కొనడం జరిగింది. పర్వతముపై నిప్పు ఉన్నది అని చెప్పడం ప్రతిజ్ఞ. పొగ వచ్చుచున్నది గనుక అని చెప్పడం హేతువు. వంటయింటిలో పొగ వచ్చినట్లు అని చెప్పడం దృష్టాంతము. అట్లాగే ఇది అని ఆరెండింటికీ ఉండే సంబంధాన్నిచెప్పడం ఉప నయం. ఎక్కడెక్కడ పొగ ఉంటుందో అక్కడక్కడ నిప్పు ఉంటుంది అని చెప్పడం నిగమనం.

5.1.1. పఠన పద్ధతి :

విద్యార్థిఒక విషయాన్ని చదివే సమయంలో అతి వేగంగా చదువరాదు. మరీ నిదానంగా చదువకూడదు. ప్రశాంతమైన మనస్సుతో, అనాయాసంగా అక్షరా లనూ, పదాలనూ స్పష్టంగా ఉచ్చరిస్తూ స్వర భావయుక్తంగా విద్యార్థి విషయాన్ని పఠించవలసి ఉంటుంది. పఠించేవానికి స్వస్థత, చిత్త ఏకాగ్రత, సుఖాసనం అవసరం.[1]

పాఠకుడు శీలాచార సమన్వితుడు, శుభ్రవసనుడు, జితేంద్రియుడు, సంస్కార సంపన్నుడు, బహుశాస్త్రజ్ఞుడు, అసూయారహితుడు, శ్రద్ధావంతుడూ, సుందరరూపి, సత్యవంతుడూ ఐనప్పుడే పఠనానికి అర్హుడని మహాభారతంలో చెప్పబడింది.[2]

---

1. అవిలంబన మనాయస్త మద్రుతం ధీరమూర్జితమ్
అసంసక్తాక్షర పదమ్ స్వరభావ సమన్వితమ్
త్రిషష్టివర్ణ సంయుక్త మష్టస్థాన సమీరితమ్
వాచయేద్ వాచకః స్వస్థః స్వాసీనః సుసమాహితః
వ్యాసుడు, op. cit., స్వర్గారోహణపర్వము శ్లోకాలు 21, 22 పుట 6510

2. శుచిః శీలాన్వితాచారః శుక్లవాసా జితేంద్రియః
సంస్కృతః సర్వశాస్త్రజ్ఞః శ్రద్దధానో ऽనసూయకః
రూపవాన్ సుభగోదాంతః సత్యవాదీ జితేంద్రియః
దానమాన గృహీతశ్చ కార్యో భవతి వాచకః
Ibid పుట 6530 శ్లోకాలు 19, 20

వినేవాడు సత్యార్జవ సంపన్నుడై ఉండడం ముఖ్యం. అతనికి పరిశుద్ధమైన మనస్సు ఉండాలి. అతనికి శాంతి దాంతి మొదలైన గుణాలు ఉండాలి.[1]

5.1.2. పంచావయవవాక్య పద్ధతి :

ఒక శాస్త్రాన్ని బోధించడానికి పంచావయవవాక్య పద్ధతి ఉపయోగపడుతుంది. ఈ పద్ధతిలో ప్రతిజ్ఞ, హేతువు, దృష్టాంతము, ఉపనయము, నిగమనము అనే ఐదు అవయవాలు ఉన్నాయి.

ప్రతిజ్ఞ :

"య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌతౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే"2

ఈ ఆత్మ చంపుతుందని భావించేవాడు, చంపబడుతుందని తలంచేవాడు ఇద్దరూ అజ్ఞానులే. ఆత్మ చంపేదికాదు. చచ్చేదికాదు. ఇది ప్రతిజ్ఞ.

హేతువు :

"న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితావా నభూయః
అజోనిత్య శ్శాశ్వతోఽయం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే."3

ఆత్మకు చావు పుట్టుకలులేవు. ఆత్మ ఒకప్పుడు ఉండడం, మరొకప్పుడు లేకపోవడం జరుగదు. అది పుట్టుక లేనిది. శాశ్వతమైనది. అనాదిసిద్ధం. ఆత్మ నిత్యమైనది. అందువల్ల శరీరాన్ని నాశనముచేసినా అందులోని ఆత్మకు చావులేదు. ఇది హేతువు.

---

1. సత్యార్జవరతో దాంతః శుచిః శౌచ సమన్వితః
శ్రద్ధధానో జితక్రోధో యథా సిధ్యతి తచ్ఛృణు.
వ్యాసుడు, op. cit., స్వర్గారోహణపర్వము శ్లోకము 18 పుట 6510

2. వ్యాసుడు, op. cit, ఉద్యోగపర్వము శ్లోకము 12 పుట 2603

3. Ibid శ్లోకము 20 పుట 2603

దృష్టాంతము, ఉపనయము :

"వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవానిదేహీ."1

పై శ్లోకములోని పూర్వార్ధము దృష్టాంతాన్ని. ఉత్తరార్ధము ఉపనయాన్ని తెలుపుతుంది. మానవుడు చినిగిపోయిన బట్టలను వదిలేసి క్రొత్తబట్టలను వేసుకొన్నట్లు, ఆత్మ శిథిలమైన శరీరాలను వదలివేసి క్రొత్తదేహాలను పొందుతూ ఉంది. ఈ శ్లోకంలో దృష్టాంతాన్ని, ఉపనయాన్ని గురించి చెప్పడం జరిగింది.

నిగమనము :

"వేదాఽవినాశినం నిత్యం య ఏన మజమవ్యయమ్
కథం స పురుషః పార్థ కంఘాతయతి హన్తికమ్."2

అర్జునా ! ఆత్మ నాశనములేనిదని, చావు పుట్టుకలులేనిదని, శాశ్వతమైనదని తెలుసుకొన్నవాడు ఎవరిని చంపుతాడు? ఎలా చంపిస్తాడు? అని చెప్పడం నిగమనము. శిష్యుల సందేహాలను తీర్చడానికి పంచావయవవాక్య పద్ధతి ఉపయోగపడుతుంది. అందువల్ల శాస్త్రాన్ని బోధించడంలో ఈ పద్ధతి అనుసరింపబడింది. మహాభారతంలోని గీతాశాస్త్రంలో ఈ పద్ధతి కనిపిస్తుంది.

5.1.3. వ్యాస సమాస పద్ధతులు :

అధ్యాపకుడు సందర్భాన్నిబట్టి పాఠ్యాంశాలను కొన్నిచోట్ల సంగ్రహంగా, మరికొన్నిచోట్ల వివరంగా చెప్పవలసిన అవసరము ఏర్పడుతుంది. విషయాన్ని కుదించి చెప్పడం సమాస పద్ధతి. విషయాన్ని విద్యార్థికి విస్తరించి చెప్పడం వ్యాసపద్ధతి. మహాభారతంలో ధర్మార్థకామమోక్షాలకు సంబంధించిన సంక్షేప విస్తర వర్ణనలు3 ఉన్నాయి.

భారత సారమనదగిన గీతాశాస్త్రములో వేదవ్యాసుడు, వ్యాస సమాస పద్ధతులను పాటించినట్లు విదితమౌతుంది. వ్యాసుడు విషాద సాంఖ్య కర్మ యోగాలలో భగవద్గీతలోని విషయాన్ని సంగ్రహంగా చెప్పినాడు.

1. వ్యాసుడు, op. cit., భీష్మపర్వము శ్లోకము 22 పుట 2603
2. ,, ,, ,, 21 ,,
3. "ధర్మార్థ కామ మోక్షార్థైః సమాస వ్యాసకీర్తనైః"
వ్యాసుడు, op. cit., ఆదిపర్వము శ్లోకము 85 పుట 7

గీత జ్ఞానయోగంలోని నాల్గవ అధ్యాయంలోని,—

"ఇమమ్ వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్" 1

"ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప" 2

—శ్లోకాలవల్ల వ్యాసుడు గురు పరంపరను స్మరించినట్లు బోధపడుతుంది. అతడు గురుపరంపరను స్మరించినందువల్ల, శాస్త్రసంప్రదాయాన్ని అనుసరించి అక్కడికి గీత సమాప్తమైనట్లు గ్రహించవలసి ఉంది. గీతలో తరువాతచెప్పిన అధ్యాయాలన్నీ మొదట చెప్పిన విషయాన్ని విస్తరించి చెప్పడానికి ఉద్దేశించినవే.

ఆ యా లోకాలలో ప్రచారము చేయబడిన భారతంలోని శ్లోకాలసంఖ్య పెరగడాన్నిబట్టి, విద్యార్థుల గ్రహణధారణ సామర్థ్యాన్నిబట్టి పాఠ్య ప్రణాళికను (Syllabus) పెంచవలసి ఉంటుందని తెలుస్తుంది. భూలోకంలో ప్రచారం చేయడానికి ఉద్దేశించిన భారతములో లక్ష శ్లోకాలు ఉన్నాయి.3 యక్షలోకంలో ప్రచారమైన భారతములో పదునాలుగు లక్షలూ, పితృలోకంలో ప్రచారం పొందిన భారతములో పదునైదు లక్షలూ, దేవలోకంలో ప్రచారమైన భారతములో ముప్పై లక్షల శ్లోకాలు ఉన్నాయి 4

రాజనీతి శాస్త్రాన్ని (Political Science) క్రమక్రమంగా సంగ్రహించిన వృత్తాంతం మహాభారతంలో ఇట్లా చెప్పబడింది. "స్వామ్యమాత్య రాష్ట్ర దుర్గ కోశ సుహృద్బలంబులు సాత్వికశక్తిత్రయీ వార్తా దండనీతులును నరిమిత్రోదాసీనాదిక ద్వాదశ రాజమండలంబును సంధివిగ్రహ యానాసనద్వైధీభావ సమాశ్రయంబులును మొదలుగా వలయువానికిం బ్రబోధకంబులగు నానావయవంబులుం గలిగి ధర్మార్థ కామ మోక్షంబులకు సాధకంబులై యుండునట్లుగా నూఱువేలధ్యాయంబుల నఖిల

1. Ibid పుట 262, శ్లోకము 1
2 భగవద్గీత, 4వ అధ్యాయము శ్లోకము 2 పుట 72
3. "ఏకం శత సహస్రంతు మానుషేషు ప్రతిష్ఠితమ్"
వ్యాసుడు, op. cit., ఆదిపర్వము శ్లోకము 107 పుట 9
4. త్రింశచ్ఛత సహస్రం చ దేవలోకే ప్రతిష్ఠితమ్ పిత్ర్యే పంచదశ ప్రోక్తమ్
గంధర్వేషు చతుర్దశ. వ్యాసుడు, op. cit., శ్లోకం 206 పుట 4

లోక హితంబగు నీతిశాస్త్రంబు రచియించి యిది లోకచరిత్ర నిర్మలీకరణంబునకు కారణంబగునని యనుగ్రహించె నాలోకపితామహు లలాటంబున విరూపాక్షుండు విశాలాక్షుండను నామంబున నావిర్భవించి యా గ్రంథంబధిగమించి దాని నభ్యసించుటకు మర్త్యుల కాయుర్బుద్ధులు చాలవని దానిని సంక్షేపరూపంబునం బదివేలధ్యాయంబుల పై శాలాక్షంబన నిర్మించె."1 దేవేంద్రుడు ఆ నీతి శాస్త్రాన్ని ఐదువేల అధ్యాయాలలో సంగ్రహంగా రచించినాడు. బృహస్పతి మూడువేల అధ్యాయాలకు దాన్ని కుదించినాడు. శుక్రుడు ఆ నీతిశాస్త్రాన్ని వేయి అధ్యాయాల గ్రంథంగా సంగ్రహించినాడు. మానవుల ఆయుస్సునూ, బుద్ధిబలాన్ని దృష్టిలో ఉంచుకొని నీతిశాస్త్రాన్ని సంగ్రహించడం జరిగింది.

5.1.4. సమష్టి - వ్యష్టిపద్ధతి :

విద్యార్థికి అంశాలను (Parts) గురించి వివరించడానికి ముందుగ అంశి (Whole) యొక్క స్వరూపాన్ని గురించి బోధించడంవల్ల అతడు విషయాన్ని సులభంగా గ్రహించగలుగుతాడు. ఉపాధ్యాయుడు శిష్యునికి ఒక కావ్యాన్ని గురించి చెప్పునప్పుడు దాని పూర్ణస్వరూపాన్ని గురించి మొదట సంగ్రహంగా బోధించడం సమష్టి పద్ధతి. కావ్యంలోని ఒక్కొక్క భాగాన్ని తీసుకొని లేదా ఒక్కొక్క పద్యాన్ని దృష్టిలో ఉంచుకొని గుణాలంకారాదులను అతనికి బోధించడం వ్యష్టి పద్ధతి. జర్మనీ దేశానికిచెందిన మనస్తత్వ శాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన గెస్టాల్టు' అనే అధ్యయన నియమానికి, మనవారు ప్రతిపాదించిన, 'సమష్టి - వ్యష్టి పద్ధతికి' సాదృశ్యమున్నది. జర్మను భాషలో 'గెస్టాల్టు' అనే పదానికి 'ఆకృతి' అని అర్థము. మాక్స్‌వెర్త్‌మెయర్, కుర్ట్‌కాఫ్‌కా, వుల్ఫ్‌గాంగ్‌కాహ్లర్ అనే విజ్ఞానులు గెస్టాల్టు సిద్ధాంతాన్ని 1912లో ప్రతిపాదించినారు. ఈ సిద్ధాంతములో ప్రచోదన ప్రతిస్పందనములనే రెండింటికి ఉండే పరస్పర ఆకృతి విన్యాసానికి ప్రాధాన్యమివ్వబడింది. గెస్టాల్టు అధ్యయన సిద్ధాంతముయొక్క స్థూలస్వరూపాన్ని గురించి జయదేవ్ అనే శాస్త్రవేత్త ఇట్లా చెప్పినాడు "అధ్యయనముచేయు వ్యక్తి మొత్తము విన్యాసమునకు వీలుగా ప్రతీకరించును. ఫీల్డ్, పేటర్న్ (ప్రతిరూపము), ఇంటెగ్రేషన్,.........క్లోషర్, ఇన్‌సైట్ అను పదములు గెస్టాల్టు సిద్ధాంతమును వివరించుట కుపయోగపడినది. ఇందులో 'క్లోషర్' అనేపదము అసంపూర్తి

1. తిక్కన, op. cit., శాంతిపర్వము ద్వితీయాశ్వాసము పద్యము 203 పుట 67

ప్రతిరూపమును భర్తీచేయుటకు ప్రయోగింపబడినది. ఏదైనా గృహము, మానవ శరీరమువంటి చిత్రములలో, ఏదైనా భాగము లోపించినచో మనస్సు దానిని భర్తీ చేయును. అనగా మనస్సుకుగల విశిష్టత మొత్తమును (స్థూలాకృతిని) గుర్తించును కాని ఏముక్కకు ఆముక్కను విడివిడిగాగుర్తించదు. అనుభవము అనునది స్థూల నిర్మాణము. ఉపలబ్ధివంటి ప్రత్యక్షానుభవము స్థూలసముదాయముగాని విడివిడి భాగముల కలయికకాదు. ప్రచోదన ప్రతిరూపములనుబట్టి క్షేత్రము మారుచుండును. ప్రతిరూపంలోని మార్పులు అధ్యయనమునందు క్రొత్తమార్పులు తెచ్చును. అధ్యయనమునందు అంతరదృష్టి (Insight) ప్రధానపాత్ర వహించును."1 జర్మను శాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన గెస్టాల్టు అధ్యయన సిద్ధాంతానికి మనవారు ప్రతిపాదించిన 'సమష్టి-వ్యష్టి' పద్ధతికి సాదృశ్యాలున్నాయి మనస్సు స్థూలాకారాన్ని గుర్తిస్తుందని, ఏముక్కకాముక్కను విడివిడిగా గుర్తించదనీ ఇంతకుముందు చెప్పబడింది. ఈ సూత్రముపైననే మహాభారతములోని బోధన జరిగింది. మహాభారతములోని (ఆది పర్వము - ప్రథమాశ్వాసము పుట 11), "ఆదియునుం బౌష్యంబు పౌలోమం బాస్తీకంబాది వంశావతారంబు సంభవ పర్వంబు జతుగృహ దాహంబు హైడింబంబు ........మౌసలంబు, మహాప్రస్థానికంబు స్వర్గారోహణంబు హరివంశంబు భవిష్యత్పర్వంబు నను శతపర్వంబులు గలిగి" అనే గద్యములో సంస్కృత భారతంలోని పర్వాలను అన్నింటిని పేర్కొనడం జరిగింది. తరువాత ఒక్కొక్క పర్వంలో ఏయే విషయాలున్నాయో వాటినిగురించి చెప్పడం జరిగింది. ఆదిపర్వములో పౌష్యోదంక మాహాత్మ్యము మొదలుకొని మందపాలోపాఖ్యానము వరకు ఉండే తొమ్మిదివేల తొమ్మిదివందల ఎనబైనాలుగు శ్లోకాలలోని వృత్తాంతము తెలుగు భారతములోని ఆదిపర్వములో నిబంధించబడిందని నన్నయ ఇట్లా చెప్పినాడు.

"మది( బౌష్యపర్వ మాదిగ(
బదునెనిమిది పర్వములను బర్వ మనః ప్రీ
తిద మగుచు నాదిపర్వం
బదివినగానొప్పు భారతాద్యంబగుచున్."2

ధర్మరాజుకు మయసభ ప్రాప్తించడం మొదలుకొని పాండవులు జూదములో

---

1. విజ్ఞాన సర్వస్వము, 10వ సంపుటము పుట 148, తెలుగుభాషా సమితి, హైదరాబాదు, 1965.

2. నన్నయ, op. cit., ఆదిపర్వము ప్రథమాశ్వాసము పద్యము 36 పుట 15

రెండవసారి పరాజయాన్నిపొంది వనవాసానికి వెళ్ళేవరకు సంస్కృత భారతములో నాలుగువేల మున్నూట పదకొండు శ్లోకాలలో ఉన్న వృత్తాంతము తెలుగు భారతంలోని సభాపర్వములో, కిమ్మీర వధతో ప్రారంభమై, పాండవులు యమధర్మరాజునుండి వరాలనుపొంది పదమూడవదికి ప్రయాణం చేయుదంవరకు పదుమూడువేల ఆరు నూర్ల ఎనభైనాలుగు శ్లోకాలలో ఉన్న వృత్తాంతము తెలుగు భారతములోని అరణ్య పర్వములో సంగ్రహంగా చెప్పబడింది. ఇట్లే సంస్కృత భారతంలోని ఆ యా పర్వాలలోని శ్లోకాలలోని వృత్తాంతము తెలుగు భారతంలోని విరాటోద్యోగ భీష్మ ద్రోణ కర్ణ శల్య సౌప్తిక స్త్రీ శాంత్యనుశాసనకాది పర్వాలలో సంగ్రహంగా చెప్పబడింది. అందువల్ల మహాభారతముయొక్క పూర్ణస్వరూపాన్ని గురించి మొదట చెప్పినట్లైనది. తరువాత మహాభారతంలోని ఒక్కొక్క పర్వాన్నే తీసుకొని అందులోని విషయాన్ని గురించి వివరించడం జరిగింది. వ్యక్తి ఒక విషయాన్ని అధ్యయనం చేస్తున్నప్పుడు దాన్ని మొత్తముగ గ్రహించి, తరువాత ఒక్కొక్క భాగాన్ని గురించి వివరంగా తెలుసుకుంటాడనే సూత్రాన్ని అనుసరించి భారతకర్త తన శిష్యులకు అందులోని విషయాన్ని బోధించినాడని తెలుస్తుంది. విద్యార్థి మొదట ప్రకృతిని అఖండముగా భావించి; దాన్ని పరిశీలించిన తరువాత దాని విశేషాలను తెలుసుకొనవలసి ఉంటుంది.

5.1.5. అనుగమన నిగమన పద్ధతులు :

ఒక సామాన్యమైన విషయాన్ని మొదటచెప్పి దాన్ని విశేషంతో సమర్థించడం అనుగమన పద్ధతి. (Method of deduction). ఈ పద్ధతి మహాభారతము లోని కథలలో కనిపిస్తుంది. ఒక్క స్త్రీ పెక్కుమందిని వివాహము చేసుకొనవచ్చు ననే సామాన్య విషయాన్ని మొదటచెప్పి దాన్ని ఉదాహరణలతో వివరించడం అనుగమన పద్ధతి అని అంటారు. మహాభారతములోని (ఆదిపర్వము సప్తమా శ్వాసము 464-469 పుటలు) 257 నుండి 277 వరకున్న పద్యగద్యాలలో ఇంద్రసేన అనే పతివ్రత వృత్తాంతాన్ని వేదవ్యాసుడు ద్రుపదునికి వినిపించినట్లు వర్ణింపబడింది. ఇంద్రసేన మౌద్గల్యుడనే ముని భార్య. మౌద్గల్యుడు కుష్ఠవ్యాధి బాధితుడు. అతడు దుర్గంధ వదనుడు. ఐనా ఇంద్రసేన అతన్ని అసహ్యాహించుకోలేదు. తన పరిచర్యతో అతన్ని సంతోషపెట్టింది. ఒకనాడామె భర్త ఉచ్ఛిష్టము తింటుంటే, వ్యాధిచే ఊడిపడిన భర్త వ్రేలు అన్నములో కనిపించింది. ఆమె ఆ వ్రేలిని తీసివేసి ఆ అన్నాన్నే తినింది. మౌద్గల్యుడామెభక్తిని మెచ్చుకొని వరము

కోరుకొమ్మని భార్యతో చెప్పినాడు. మనోహరమైన రూపముతో ఐదు దేహాలను ధరించి తనతో రమించి తన కామభోగేచ్ఛను తీర్చమని ఆమె కోరింది. మౌద్గల్యుడు ఆమె కోరినవిధంగా ఐదు దేహాలను ధరించి మర్త్య దేవలోకాలలో చాలాసంవత్సరాలు ఆమెతో విహరించి, చివరకు ఆమెను విడిచి తపస్సు చేసుకోడానికి అరణ్యానికి వెళ్ళినాడు. ఆమెకు భోగేచ్ఛ తగ్గలేదు. ఆమె మరుజన్మలో కాశిరాజు కూతురుగ జన్మించింది. ఆమె కన్యగానే చాలకాలము గడిపింది. ఆమె తన దౌర్భాగ్యానికి చింతించి పరమేశ్వరుని గురించి తపస్సు చేసింది. ఆమె తపస్సును యముడు, వాయువు, ఇంద్రుడు, అశ్వినులు మెచ్చుకొనినారు. వారు ఆమెను వివాహమాడ గోరినారు. ఆమె ఇంకా ఘోరమైన తపస్సు చేసింది. ఆమెకీశ్వరుడు ప్రత్యక్షమై వరము కోరుకొమ్మని చెప్పినాడు. పతికావలెనని, పతికావలెనని ఐదుమార్లు ఆమె అడగడంవల్ల ఆమెకైదుమంది భర్తలగునట్లుగా శివుడు వరమిచ్చినాడు. ఈశ్వరుడు ఇంద్రుని పంచేంద్రులుగా చేసినాడు. ఇంద్రసేనయే మరుసటి జన్మలో కాశిరాజు కూతురై తరువాతి జన్మలో ద్రుపదుని కూతురుగ అవతరించి పాండవులను వివాహమాడింది.

ఒక్క సుందరాంగిపైన ఉండే మోహంవల్ల ఎలాంటి స్నేహితులైనా స్పర్ధ వహిస్తారనే సామాన్య విషయాన్ని వివరించడానికి నారదుడు పాండవులకు సుందోపసుందుల కథను వినిపించిన వృత్తాంతము మహాభారతములోని (ఆదిపర్వము అష్టమాశ్వాసము పుటలు 497-501) 95 నుండి 314 వరకు ఉండే పద్య గద్యాలలో ఉంది. సుందోపసుందులు నికుంభుడనే రాక్షసుని పుత్రులు. వారు వింధ్య పర్వతానికివెళ్ళి అచట నిష్ఠతో తపస్సు చేసినారు. వారికి బ్రహ్మ ప్రత్యక్షమైనాడు వారిని వరములు కోరుకొమ్మని చెప్పినాడు. వారు కామరూపత్వాన్నీ, కామ గమనత్వాన్నీ, అమరత్వాన్నీ ప్రసాదించమని బ్రహ్మను కోరినారు. అమరత్వము తప్ప మిగిలినవరాలను బ్రహ్మ వారికి ప్రసాదించినాడు. వారు వరబలముచే గర్వించి దేవతలను మునులను బాధించడానికి పూనుకొనినారు. వారు బ్రహ్మ దగ్గరకుపోయి మొఱపెట్టుకొన్నారు. వారొకరినొకరు వధించుకొను ఉపాయము చేయాలని బ్రహ్మ విశ్వకర్మకుతెల్పి ఒక్క సుందరాంగిని సృష్టింపమని అతన్ని కోరినాడు. విశ్వకర్మ తిలోత్తమను సృష్టించినాడు. సుందోపసుందులకు వైరము, మరణము కలిగేలా చేయమని బ్రహ్మ తిలోత్తమను ఆజ్ఞాపించినాడు. తిలోత్తమ సుందోపసుందుల కంటబడినది. వారిరువురు ఆమెను మోహించినారు.

"సుందరి మా యిద్దఱిలో
నెందెవ్వరి వలచు చెప్పుమీ ననవుడుఁ దా
న్నెందుముఖి వారి కనుమీ
యుందెవ్వఁడు వొడిచి మొదుచు వఱనిన వలతున్."1

అనే పద్యములో నన్నయ సుందోపసుందులు తిలోత్తమను ప్రశ్నించడాన్ని, దాని కామె సమాధాన మివ్వడాన్ని వర్ణించినాడు. ఆమెను పొందాలనే ఉద్దేశంతో వారు ఒకరి నొకరు పొడుచుకొని చివరకు ఇరువురు మరణించినారు.

దస్యులైనా మాన్యత్వాన్ని పొందడానికి అర్హులనే సామాన్య విషయాన్ని వివరించడానికి భీష్ముడు ధర్మరాజుకు కాపవ్యోపాఖ్యానాన్ని చెప్పినాడు. మహా భారతములోని (శాంతిపర్వము తృతీయాశ్వాసము పుట 108-109) 175 నుండి 181 వరకు ఉండే పద్య గద్యాలలో ఈ కథ చెప్పబడింది. కాపవ్యుడు ఒక బోయవాడు. విలువిద్యలో అతడు నేర్పరి. అతని సమీపాననివసించే దస్యులు తమను పరిపాలింప వలసిందని కాపవ్యుని కోరినారు. అప్పుడతడు వారితో చెప్పిన వృత్తాంతాన్ని తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"శిశుజన మునిజన స్త్రీజనంబులఁ జంపఁ
గా వెట్టివాఁడైన గడఁగి మీఁద
గవియక పొడుచుట కల్మషంబంగనఁ
జెలపట్టఁ దగదు విశేష మొరఁడు
విను డెల్ల సత్వంబులను బెంటిఁ జంపుట
పాపంబు గోవుల బ్రాహ్మణులను
సంకట పెట్టంగఁ జనదు తదీయ హి
తముగోరి పూని యుద్ధంబు సేఁత
యధిక పుణ్యంబు సస్యక్రియా విఘాత
మాచరించుట గడుదోష మపని ప్రజకు
బాధగావించి కుడిచి శవంబు బొలుచు
ప్రవృత్తగతి నది పొలియంగఁ బొలియు నతడు."2

అతడు ఉపదేశించిన పద్ధతి ప్రకారము వారు నడచుకొని ఇహపరసిద్ధిని పొందినారు.

---

1. నన్నయ, op. cit., ఆదిపర్వము అష్టమాశ్వాసము పద్యము 110 పుట 500
2. తిక్కన, op. cit., శాంతిపర్వము తృతీయాశ్వాసము పద్యము 182 పుట 108

నిగమనపద్ధతి (Inductive Method). ఒక విశేషాన్ని మొదటచెప్పి దాన్ని సామాన్యంచే సమర్థించడం నిగమన పద్ధతి. ఈ పద్ధతి ననుసరించి చెప్పిన ఉపాఖ్యానాలు భారతములో ఎన్నో ఉన్నాయి. నిగమన పద్ధతిలో కథను ముందు చెప్పడం, తరువాత ఆ కథవలన బోధపడే నీతిని పేర్కొనడం జరుగుతుంది. మహాభారతములోని (శాంతిపర్వము తృతీయాశ్వాసము పుట 109). 185 నుండి 201 వరకు ఉండే గద్య పద్యాలలో దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుడు, దీర్ఘసూత్రుడు అనే పేర్లు కలిగిన మూడు చేపల కథను భీష్ముడు ధర్మరాజుకు వినిపించినాడు. దీర్ఘదర్శి మొదలైన చేపలు మూడూ ఒక మడుగులో నివసించేవి. వేసవికాలము వస్తుందని, ఆ మడుగులోని నీరు ఇంకిపోతుందని, నీరు ఇంకిపోకముందే మరొక మడుగునకు వెళ్ళిపోవుట మంచిదని దీర్ఘదర్శి చెప్పినాడు. రాబోవు ఆపదలను ఊహించి ఇప్పటి నుండి బాధపడడం మంచిది కాదని, అప్పుడు చూచుకొనడం మంచిదని ప్రాప్తకాలజ్ఞుడు తన అభిప్రాయాన్ని తెలిపినాడు. దీర్ఘదర్శి ఆ మడుగు విడిచి మరొక మడుగును చేరుకొనినాడు. తక్కినవారిరువురామడుగులోనే ఉన్నారు. ఇంతలో వేసవికాలము వచ్చింది. ఆ మడుగులోని నీరు ఇంకిపోయింది. బోయలు చేపలు పట్టడానికి అచటికివచ్చి వాటిని పట్టుకొని గ్రుచ్చుతూ ఉంచే ప్రాప్తకాలజ్ఞుడు తానేపోయి త్రాటిని నోటితో కఱచుకొనినాడు. దీర్ఘసూత్రునకు ఏమియు తోచలేదు. అతడు బోయల చేతులలో పడినాడు. బోయలు చేపలగుత్తిని నీటిలో కడుగుతూ ఉండగా ప్రాప్తకాలజ్ఞుడు మెల్లగా త్రాటిని విడిచిపెట్టి నీటబడి తప్పించుకొనినాడు. ఈ మూడుచేపల కథవలన తెలిసిన నీతిని గురించి తిక్కన వర్ణించిన పద్యాలివి.

"విను దొదవ్వులఁ గార్యము
గనికొని వలయు పని మున్నకావింపఁగనే
రని జడుఁడు దీర్ఘసూత్రుం
డను నమ్మత్స్యము భంగి నాపదనొందున్"[1]

"అప్పటికి దోచినట్టులు దప్పకుండ
ననువుతో ధృతిగల్గి కార్యంబు నడుప
నతఁడు ప్రాప్తకాలజ్ఞాఖ్య నట్లపోలెఁ
బరమ సంశయమయ్యెడు బ్రదుకు గాంచు"[2]

1. తిక్కన, op. cit, శాంతిపర్వము తృతీయాశ్వాసము పద్యము 199 పుట 110
2. ,, ,, ,, ,, 200 ,,

"దుర్బల నవాగరికములను
కార్యము లూహించి పని తగంజేయు నయా
చార్యుఁడు సౌఖ్యము బొరయును
నార్యస్థితి దీర్ఘదర్శి యను మీను క్రియన్"1

అర్హులైనవారి కన్నీటిని తుడపడం పాలకుని కర్తవ్యమని, తన స్వార్థాన్ని కోరేవారి నేర్పుమాటలను వేరు గుర్తించాలనే నీతిని తెలపడానికి భీష్ముడు ధర్మరాజుకు మహాభారతములో (శాంతిపర్వము తృతీయాశ్వాసము పుటలు 123-124) 366 నుండి 381 వరకు ఉండే గద్య పద్యాలలోని గృధ్రజంబుకోపాఖ్యానాన్ని వినిపించినాడు. విదిశ అనే పట్టణములో బాలుడొకడు చనిపోవడం జరిగింది. బంధువులు అతని శవాన్ని ప్రేతభూమికి తీసుకొనిపోయినారు. వారు దానిచుట్టు చేరి విలపిస్తుంటే ఒక గ్రద్ద అక్కడికివచ్చి వారితో ఇట్లా చెప్పింది.—

"........మీర లిక్కడ భయంబు దక్కి
యేడ్చుచునుండగఁ దగ దిదె క్రుంకెడుఁ
బ్రొద్దు రాక్షసులును భూతములుఁ బి
శాచములు వచ్చి తిన నిపుడేచి వచ్చు
జనన మరణముల్ వింతలె చన్న శిశువు
తోన యుండఁ జనుటకుఁ బూనియుండు
వారలే పొందు పీనుంగు వైచి వేగ."2

—వారు గ్రద్ద చెప్పిన మాటలనువిని పోవడానికి సిద్ధంగా ఉన్న సమయంలో ఒక నక్క అక్కడికివచ్చి గ్రద్దమాటలువిని భయపడవలదని, బాలుని విడిచి పోవడం తగదని, చీకటిపడేవరకు వారు అక్కడ ఉండడం మంచిదని, దైవయోగంవల్ల బాలుడు బ్రదుకవచ్చుననీ ఆశ పుట్టించినందువల్ల అచ్చట నిలిచినారు. ప్రొద్దు గ్రుంకకముందే బాలుని బంధువులను ఇంటికిపంపించి బాలుని శవాన్నితినాలని గ్రద్ద ఆశపడింది. రాత్రియైనచో తనకు మేలని, ప్రొద్దు గ్రుంకిన తరువాత గ్రద్ద అచ్చట నిలువలేదనీ, చీకటి పడిన తరువాత బాలుని శవాన్ని తాను ఆహారంగా స్వీకరించవచ్చునని నక్క ఆశపడింది. గ్రద్ద మాటలువిని వారు కొంతదూరము

1. తిక్కన, op. cit., శాంతిపర్వము తృతీయాశ్వాసము పద్యము 201 పుట 110
2. తిక్కన op. cit., శాంతిపర్వము తృతీయాశ్వాసము పద్యము 366 పుట 123

పోవడము, నక్క నేర్పుమాటలువిని వారు మరల రావడము జరిగింది. కొంత సేపటికి ప్రొద్దు గ్రుంకింది. వారికి పరమేశ్వరుడు ప్రత్యక్షమైనాడు. వారి కోరికపై బాలుని బ్రతికించినాడు. గృధ్ర జంబుకాలకు ఆకలి కలగకుండా ఉండేలా వరమిచ్చినాడు. శివుడు అదృశ్యమైనాడు. బంధువులందరు బాలుడు బ్రతికినందుకు సంతోషించినారు. ఇంటికి వెళ్ళినారు. ఆర్తులైనవారి కన్నీరు తుడవడం ప్రభువు కర్తవ్యమని, తన స్వార్థాన్నిగోరేవారి మాటలను వేరు గుర్తించాలనే నీతిని ఈ కథ బోధిస్తున్నది.

మహాభారతములో (శాంతిపర్వము తృతీయాశ్వాసము పుటలు 125-126) 383 నుండి 397 వరకు ఉండే పద్య గద్యాలలో భీష్ముడు ధర్మరాజుకు పవన శాల్మలీ తరు సంవాదాన్ని వినిపించినాడు. హిమాలయ పర్వతముపై ఏపుగా పెరిగి శాఖోపశాఖలుగ విస్తరించిన బూరుగుచెట్టు ఒకటి ఉండేది. ఒకనాడు నారదుడు దాన్ని సమీపించి ఇట్లా అన్నాడు.

"బూరువా యింత పఱపును బొడవుఁ గల్గి
నీవు మృగపక్షి సంశ్రయణీయమగుచు
నునికిగని ప్రీతి నడిగెద ననిలుచేతఁ
బడు నొకప్పుడు తరులు నీ పడమి యెట్లు."[1]

వాయుపు బలము తన బలములో పదునెనిమిదవ భాగానికికూడ సరిపోదని బూరుగుచెట్టు నారదునితో చెప్పింది. గర్వాన్ని మాటలాడడం మంచిది కాదని బూరుగుకు నారదుడు నీతిని ఉపదేశించినాడు. అతడు మారుతుని దగ్గరకువెళ్ళి జరిగిన వృత్తాంతాన్ని వివరించినాడు. మారుతునికి కోపము వచ్చింది. అతని విజృంభణమువల్ల దాని కొమ్మలూ రెమ్మలూ పడిపోవడం జరిగింది. బూరుగు చెట్టుకు గర్వభంగమైనది.

బలవంతునిపై బలహీనుడు మాత్సర్యాన్ని పూనితే తన సర్వస్వాన్ని కోల్పోవడం తథ్యమనే నీతి పవన శాల్మలీతరు సంవాదాన్నిబట్టి విదితమౌతుంది. బూరుగు చెట్టు మాట్లాడడము అసంభవమని హేతువాదులు ప్రశ్నించినా ఇచ్చట కథ ప్రధానము కాదని దానివల్ల బోధపడే నీతి ముఖ్యమని గమనించవలసి ఉంది. నిగమన పద్ధతిని అనుసరించి చెప్పబడిన కథలు భారతములో ఎన్నో ఉన్నాయి.

---

1. తిక్కన, op. cit., శాంతిపర్వము తృతీయాశ్వాసము పద్యము 383 పుట 125

5.1.6. ఉపాఖ్యాన పద్ధతి :

ఒక కథను ఆధారంగా చేసుకొని ఆచార్యుడు విద్యార్థికి విషయాన్ని బోధించడం చాల ప్రాచీనమైన పద్ధతి. ఈ పద్ధతివల్ల విద్యార్థికి జ్ఞానము, వినోదము కలుగుతాయి. వేదములోని ధర్మస్వరూపాన్ని వివరించి చెప్పడానికి భారతమవతరించింది. భారతములో కౌరవ పాండవుల కథ ప్రధానమైనది. ఈ కథను ఆధారముగా చేసుకొని వేదధర్మాలను ఆఖ్యానాలద్వారా, ఉపాఖ్యానాలద్వారా సామాన్యులకు బోధించడం జరిగింది. ఆఖ్యానానికి, ఉపాఖ్యానానికిగల భేదాన్ని గురించి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి ఇట్లా చెప్పినాడు. "స్వయం దృష్టార్థ కథనమ్ ప్రాహురాఖ్యానకం బుధాః. కవి తాను స్వయముగా చూచిన దానిని చెప్పుట ఆఖ్యానము. శ్రుతస్యార్థస్య కథన ముపాఖ్యానం ప్రచక్షతే. ఇతరులవలన విన్నదానిని ఉపాఖ్యానము."1 అనిచెబుతారు. భారతమనే పారిజాత వృక్షానికి ఆఖ్యానాలనే అనేకశాఖలున్నాయని, అది వేదార్థమనే నిర్మలమైన నీడకల్గినదని, చదుర్విధ పురుషార్థాలనే పుష్ప సమూహముతో ప్రకాశిస్తున్నదని, నరనారాయణుల గుణాలను కీర్తించడంవల్ల కలిగే శాంతమే ఫలముగా కలది అని, అది వేదవ్యాసుడనే ఉద్యానవనములో పుట్టిందని నన్నయ వర్ణించినాడు. మహాభారతములో, సౌపర్ణ సౌకన్య శ్రీహి ద్రోణ లుబ్ధ కపోతకాశ్యప గౌతమమూది ఆఖ్యానాలు, అనేక ఉపాఖ్యానాలు ఉన్నాయి. ఆదిపర్వము ద్వితీయాశ్వాసము (పుటలు 53-81) 2 నుండి 122 వరకు ఉండే పద్య గద్యాలలోని సౌపర్ణాఖ్యానమువల్ల తల్లియొక్క దాస్యాన్ని తొలగించడము తనయుని కర్తవ్యమనే నీతి బోధపడుతుంది. సమర్థుడైన ఆచార్యుడు సౌపర్ణాఖ్యానాన్ని విద్యార్థులకు బోధించినట్లైతే, కౌరవ పాండవుల కథకు సంబంధించిన సంఘటనలు అందులో నిక్షిప్తమై ఉన్నట్లు వారు గ్రహించగలుగుతారు. జరుగబోయే సంఘటనలను కవి ముందుగా సూచించాలనే సంప్రదాయాన్ని అనుసరించి నన్నయ కౌరవ పాండవుల కథకు చెందిన సంఘటనలను సౌపర్ణాఖ్యానములో సూచించినాడు. కద్రూ వినతల కథకు, రాబోయే కథలోని కుంతి గాంధారుల కథకు సాదృశ్యము ఉంది కద్రువకు వేయిమంది నాగముఖ్యులు జన్మించినారు. గాంధారికి నూరుగురు కుమారులు జన్మిస్తారనే విషయము దీనివల్ల సూచింపబడింది. వినతకిద్దరు పుత్రులు జన్మించినారు. వారిలో గరుడుడు బలసంపన్నుడు. వైనతేయుల గురించి

---

1. విజ్ఞాన సర్వస్వమ్ము, ఆరవ సంపుటము పుట 100,
తెలుగుభాషాసమితి, హైదరాబాదు, 1961.

చెప్పడంవల్ల బలసంపన్నులైన పాండవేయుల వృత్తాంతము సూచింపబడింది. సౌపర్ణాఖ్యానములోని దేవదానవుల యుద్ధము, కౌరవ పాండవులకు జరుగబోయే యుద్ధాన్ని తెలుపుతుంది. సౌపర్ణాఖ్యానములోని విభావసుప్రతీకులనే సోదరులు తమకు భాగపరిష్కారము కుదరక ఒకరినొకరు శపించుకొన్నారని చెప్పినందువల్ల, కౌరవ పాండవులు భాగపరిష్కారము కుదరక యుద్ధానికి సిద్ధపడతారనే విషయము సూచించినట్లైంది. ఇలాంటి సంఘటనల గురించి ఆచార్యుడు విద్యార్థులకు చెప్పినప్పుడు వారికి జ్ఞానమూ, వినోదమూ కలుగుతాయి. మహాభారతము (అరణ్య పర్వము తృతీయాశ్వాసము పద్యాలు 174-186 పుటలు 126-128) లోని సౌకన్యాఖ్యానము పతిసేవయే సతికి పుణ్యహేతువనే నీతిని చాటుతూ ఉంది. (అరణ్య పర్వము 6వ ఆశ్వాసము పద్యాలు 114-128 పుటలు 285-287)లోని వ్రీహిద్రోణాఖ్యానమువల్ల పాత్రునికే దానము చేయాలని, సజ్జన సాంగత్యము మంచిద అవగతమౌతుంది. (శాంతిపర్వము తృతీయాశ్వాసము పద్యాలు 304-342 పుటలు 118-121) లోని లుబ్ధకపోతాఖ్యానము శరణాగతులను రక్షించాలని, అతిథిని సంతోషపెట్టడానికి యజమానుడు తన శరీరాన్నైనా అర్పించాలనే నీతిని తెలుపుతుంది, అదే పర్వములోని (పద్యాలు 472-528 పుటలు 132-137) కాశ్యపగౌతమాఖ్యానమువల్ల చేసినమేలు మరచిపోవడం. మిత్రునికి ద్రోహము చేయడం మహాపాపమనే నీతి బోధపడుతుంది. మహాభారతములోని (ఆదిపర్వము ప్రథమాశ్వాసము పద్యాలు 81-120 పుటలు 33-41) ఉదంకోపాఖ్యానమువల్ల శిష్యుడు గురువుకు హితమైనకార్యము చేయాలనే నీతి విదితమౌతుంది. (ఆదిపర్వములోని తృతీయాశ్వాసము పద్యాలు 103-113 పుటలు 145-151) కచోపాఖ్యానము గురుపుత్రిని సోదరిగా భావించాలనే నీతిని తెలుపుతుంది. (ఆదిపర్వము చతుర్థాశ్వాసము పద్యాలు 5-110 పుటలు 181-207)లోని శకుంతలోపాఖ్యానము సత్యముయొక్క గొప్పతనాన్ని గురించి వివరిస్తుంది. మాండవ్యోపాఖ్యానము (ఆదిపర్వము చతుర్థాశ్వాసము పుటలు 248-251) 261 నుండి 273 వరకు ఉన్న పద్య గద్యాలలో విస్తరించి ఉంది. దీనివల్ల హింసాపరులకు దుఃఖము ప్రాప్తిస్తుందని బోధపడుతుంది. ఆదిపర్వము సప్తమాశ్వాసము (పద్యాలు 67-90 పుటలు 417-423)లోని తపతీసంవరణోపాఖ్యానము క్షత్రియునికి అధిక భోగేచ్ఛ తగదనే నీతిని తెలుపుతుంది. అదేపర్వములోని (అష్టమాశ్వాసము పద్యాలు 293-318 పుటలు 543-548) మందపాలోపాఖ్యానమువల్ల సంతానము లేనివారు పుణ్యలోకాలను పొందలేదనే నీతి బోధపడుతుంది. మహా

భారతములోని (అరణ్యపర్వము ప్రథమాశ్వాసము పద్యాలు 150-193 పుటలు 20-26) సౌంభకాఖ్యానము భగవంతుడు దుష్టులను నిగ్రహించి శిష్టులను పరిపాలిస్తాడనే నీతిని తెలుపుతుంది. అరణ్యపర్వము ద్వితీయాశ్వాసములోని (పద్యాలు 6-231 పుటలు 55-85) నలోపాఖ్యానము ప్రసిద్ధమైంది. దీనివల్ల జూదము సర్వానర్థాలకూ మూలకారణమని బోధపడుతుంది. అరణ్యపర్వము చతుర్థాశ్వాసములోని (పద్యాలు 101-133 పుటలు 168-172) అజగరోపాఖ్యానము, మునులను అవమానించిన వానికి పతనము తప్పదనే నీతిని తెలుపుతుంది. అరణ్యపర్వము సప్తమాశ్వాసములోని (పద్యాలు 170-281 పుటలు 349-361) సావిత్ర్యుపాఖ్యానము పతివ్రతల మాహాత్మ్యాన్ని గురించి తెలుపుతుంది. మహాభారతములోని (ఉద్యోగపర్వము చతుర్థాశ్వాసము పద్యాలు 273-198 పుటలు 301-302) అంబోపాఖ్యానమువల్ల కార్యసాధకుడు సుఖదుఃఖాలను లెక్కపెట్టడనే నీతి బోధపడుతుంది. మహాభారతములోని (కర్ణపర్వము శ్లోకాలు 4-87 పుటలు 3881-3887) హంసకాకీయోపాఖ్యానము వల్ల, శ్రేష్ఠులైనవారిని అవమానించుట మంచిదికాదనే నీతి విదితమౌతుంది. ఇంతవరకు చెప్పబడిన ఆఖ్యానాలూ, ఉపాఖ్యానాలుగాక మరికొన్ని ఆఖ్యానాలూ, ఉపాఖ్యానాలు భారతంలో ఉన్నాయి. ఆఖ్యాన పద్ధతిద్వారా విద్యార్థులకు అంశాలను బోధించినట్లైతే వారు విషయాన్ని సులభంగా గ్రహించగలరని చెప్పడానికి మహాభారతములోని కొన్ని ఆఖ్యానాలను, ఉపాఖ్యానాలను గురించి చెప్పడం జరిగింది.

5.1.7. ప్రశ్నోత్తర పద్ధతి :

విద్యార్థి తన సందేహాలను తీర్చుకోవడనికి ఆచార్యుని ప్రశ్నించడము, ఆచార్యుడా ప్రశ్నలకు సమాధానాలనుచెప్పి విషయాన్ని వివరించడము జరుగుతుంది. దీన్ని ప్రశ్నోత్తర పద్ధతి అంటారు, దీనికి, 'Catechetical Method' అనేది ఇంగ్లీషు భాష ననుసరించి పెట్టినపేరు. దీనివల్ల కలిగే ప్రయోజనాలను గురించి శేషగిరిరావు ఇట్లా చెప్పినాడు. "Catechetical oomes from the Greek word, Katehetes which means oral teacher. This method is the method of questioning and answering. The teacher is able to know definitely by means of question what previous knowledge his pupils possess. He is able to suit his lesson in the several stages of it, especially as regards its matter and quality, to the level of his pupils. This method avoids the defect of keeping the pupils passive during the lesson."[1] ప్రాచీన

1. Dr. Seshagiri Rao, T. V. Psychology and Art of Education, Page 126, Madras Publishing Hhuse 1945 Ltd., Madras. 1949

గ్రంథాలలో భాష్యకారులు అవలంబించిన పద్ధతికూడ ప్రశ్నోత్తర పద్ధతివంటిదే. పాఠకులకు కలిగే సందేహాలను ముందుగనే ఊహించి, వాటికి తగిన సమాధానాలను రచనలో పొందుపరచడం భాష్య పద్ధతి. (అక్షిప్య భాషణాత్ భాష్యమ్)........ సమర్థుడైన ఆచార్యుడు విద్యార్థులకు కలిగే సందేహాలను ముందుగనే ఊహించి. విద్యార్థుల మానసిక యోగ్యతలను దృష్టిలో ఉంచుకొని తగిన ప్రశ్నలనువేసి విషయాన్ని వివరించగలుగుతాడు. మహాభారతములో, ప్రశ్న సమాధాన పద్ధతిలో విషయ వివరణము చేయబడిన సందర్భాలు ఉన్నాయి. వైశంపాయనుడు జనమేజయునికి భారతకథను వినిపించినాడు. జనమేజయుడు వేసిన ప్రశ్నలకు సమాధానంగా వైశంపాయనుడు భారతకథను అతనికి వివరించినాడు. సకల ధర్మాధర్మాలు, సుగతి దుర్గతి స్వరూపాలు, జీవుల గర్భోత్పత్తి ప్రకారాలు, వర్ణాశ్రమ ధర్మాలు తమకు వినిపించవలసిందని అష్టకాదులు అడిగినప్పుడు వారి ప్రశ్నలకు సంగ్రహంగా యయాతి సమాధానాలిచ్చినట్లు మహాభారతములో (ఆదిపర్వము తృతీయాశ్వాసము పుటలు 174-176) 219 నుండి 222 వరకు ఉండే పద్య గద్యాలనుబట్టి తెలుస్తుంది.

భీముడు అజగరముచే పట్టుబడినప్పుడు అతన్ని విడిపించుటకు నహుషుని ప్రశ్నలకు ధర్మరాజు సమాధానములు చెప్పవలవచ్చింది. "ఘనుడ యేగుణములు గలవాడు బ్రాహ్మణుం డతనికెఱుఁగఁ దగినయట్టి వస్తువెద్ది"[1] అని నహుషుడు ప్రశ్నించినాడు. "సత్య క్షమా దమ శౌచ దయా దానశీలంబు లెందేనిఁ గాననగు నట్టివాడు బ్రాహ్మణుడగు, సుఖము దుఃఖంబునై నెడ విమోహమునుబొంద కునికియ వానికి నుత్తమంబగు వేద్యమని"[2] ధర్మజుడు సమాధానము చెప్పినాడు.

"నీ చెప్పిన యగ్గుణములు
క్రియ శూద్రునందు గల్గిన నతం డుత్తమ
ద్విజుఁడుగా నేర్చునే నిజము విడిచి
నట్టులయిన బ్రాహ్మణాది వర్ణ విభాగ
మెట్లుగలుగునయ్యు హీను లధికు
లను వివేక మది యపార్థకంబు గాదె"[3]

1. నన్నయ. op. cit., అరణ్యపర్వము చతుర్థాశ్వాసము పద్యము 127 పుట 172
2. ,, ,, ,, గద్యము 128 ,,
3. ,, ,, ,, పద్యము 128 ,,

అని నహుషుడు అడిగినప్పుడు, ధర్మరాజు ప్రత్యుత్యుత్తరమిచ్చిన వృత్తాంతాన్ని నన్నయ ఇట్లా వర్ణించినాడు. "ప్రమాదంబున వర్ణసంకరంబయినప్పుడు వర్ణ పరీక్షార్థంబుగా బ్రాహ్మణాదులకు వృత్తంబు వేఱువేఱ స్వాయంభవుండైన మనువు చెప్పె సత్యాది గుణంబులు శూద్రునందు గలిగెనేని వాడు సచ్ఛూద్రుండగుఁగాక బ్రాహ్మణుండుగా నేర్చునే యనియు బ్రాహ్మణునందు లేనినాడు శూద్రుండ యనంబడుం గావున వృత్తంబుల యుత్తమంబులు."1

"విత్తహీనుండు వెండియు వివిధ విధుల
విత్తవంతుండు కానేర్చు వృత్తహీనుఁ
డైనవాడు విహీనుండ యండ్రు కాన
విత్తరక్షకు కడుమేలు వృత్తరక్ష."2

"అప్రియం బొగిఁజేసియు ననృతవాది
యయ్యు హింసగావింపని యమ్మహాత్ము
డేగు సుగతికి నండ్రదియెట్లు సెప్పు."3

మని నహుషుడు ధర్మజుని మూడవమారు ప్రశ్నించినాడు. "దానంబును బ్రియంబు చేఁతయును సత్యంబును నహింసయు ననునివి నాలుగును సమానంబుల యయినను నహింసయు విశేషంబెట్లనిన దేవ మనుష్య తిర్యగ్యోను లనియెడు మూడు గతుల యందును మనుష్యుండు దానాది గుణంబులు గలిగి యహింసాపరుండయినవాడు దేవగతి వడయు విపరీతుండై తిర్యగ్యోనులం బొందు"4 నని ధర్మరాజు సమాధానం చెప్పినాడు.

5.1.7.1.

మహాభారతములోని సంవాదాలన్నీ ప్రశ్నోత్తరపద్ధతి ననుసరించి విషయాన్ని వివరించడానికి చెప్పబడినవే. "దీనాననంబులయి దుర్బలంబులయిన యపత్యంబుల

---

1. నన్నయ, op. cit., అరణ్యపర్వము చతుర్థాశ్వాసము గద్యము 129 పుట 172
2. „ „ „ పద్యము 130 „
3. „ „ „ పద్యము 132 „
4. „ „ „ గద్యము 133 పుట 173

దుఃఖంబేనెట్లు సూడనోపుదు"1 ననిన గోమాతతో, "వర్షంబునఁ దృణవర్ధనంబు సేసి దుర్బల బలీవర్దంబులకు బలంబు గావించెద"2 నని ఇంద్రుడు చెప్పిన వృత్తాంతాన్ని పుత్రవ్యామోహముతో దుర్బుద్ధియైన దుర్యోధనుని విడువలేననిచెప్పు ధృతరాష్ట్రునికి, ఇంద్ర సురభి సంవాదము (అరణ్యపర్వము ప్రథమాశ్వాసము పద్యము 81-86 పుటలు 11-12) ద్వారా వినిపించి, అరణ్యవాసముచే కృశించిన పాండవులపై దయ చూపుమని వ్యాసుడు ధృతరాష్ట్రునితో చెప్పినాడు. "యథాకాలకల్పిత క్షమా తేజుండైనవానికి నుభయలోకసిద్ధి యగు"3 నని ప్రహ్లాదుడు బలికి చెప్పినమాటలను వినిపించి, కౌరవులపై తన ప్రతాపాన్ని చూపవలసినదిగా ద్రౌపది ధర్మరాజుకు చెప్పడము, అతడు సహనము గొప్పదని వాదించడం, "దైవమానుషంబులు కర్మఫల ప్రాప్తికి సాధనంబులని" ద్రౌపది ధర్మరాజుతో చెప్పడం మొదలగు విషయాలు ద్రౌపది ధర్మరాజుల సంవాదమువల్ల (అరణ్యపర్వము ప్రథమాశ్వాసము పద్యాలు 208-236 పుటలు 28-32) విదితమౌతాయి. అర్థాధారముకాని ధర్మము, క్షత్రియుల కయుక్తమని, కౌరవులతో యుద్ధముచేసి రాజ్యాన్ని సంపాదించాలని భీముడు ధర్మరాజుతో చెప్పడం, సమయోల్లంఘనము తగదని, సత్యధర్మాలను తాను విడువజాలనని, చక్కగా విచారించి చేసిన పనికి ఎప్పటికి హాని కలుగదని ధర్మరాజు భీమునితో చెప్పడం మొదలైన విషయాలు భీమసేన ధర్మరాజుల సంవాదంవల్ల (అరణ్యపర్వము ప్రథమాశ్వాసము పద్యాలు 237-271 పుటలు 32-36) విదితమౌతాయి. అత్రి గౌతముల సంవాదము అరణ్యపర్వము చతుర్థాశ్వాసములోనిది (పద్యాలు 198-207 పుటలు 182-183) క్షత్రియుడందరికంటె గొప్పవాడని అత్రి మహాముని చెప్పినప్పుడు, అర్థకాంక్షచే క్షత్రియుని పొగడడం యుక్తము కాదని గౌతముడు ఆక్షేపించినాడు. కాశ్యపుడను ముని సూచన ననుసరించి వారు సనత్కుమారుని దగ్గరకుపోయి తమ వాదాన్ని వినిపించినారు. క్షత్రియుడు అందరికంటె గొప్పవాడని సనత్కుమారుడు నిశ్చయించినాడు. ఇక సత్యా ద్రౌపదీ సంవాదము, అరణ్యపర్వము పంచమాశ్వాసములోనిది (పద్యాలు 291-345 పుటలు 245-252).—

1. నన్నయ, op. cit,. అరణ్యపర్వము ప్రథమాశ్వాసము గద్యము 86 పుట 11
2. ,, ,, ,, ,, పుట 12

"ఉవిద నీ దేవులు
ననువర్తులగుట యత్యద్భుతంబు
నగు మొగంబుల కాని నళినాక్షి నీదెసఁ
బరుసఁ గింకిరిపాటులేదు
వ్రతము పెంపో మంత్రౌషధ వైభవంబొ
సరస నైపథ్య కర్మ కౌశలమొ చతుర
విభ్రమోల్లాస రేఖయొ వెలది నీ వి
శేష సౌభాగ్య హేతువు"1

చెప్పుమని సత్యభామ ద్రౌపదిని అడిగినప్పుడు ధర్మజ భీమార్జున నకుల సహదేవులు తనను గాఢంగా ప్రేమించడానికి కారణము వారిపై మంత్ర తంత్రాదులు ప్రయోగించడము కాదని. తన ప్రవర్తనను బట్టి వారు తనను ప్రేమిస్తున్నారని ద్రౌపది చెప్పినది. పురోహితుని విశేషాలను, రాజు నడపవలసిన వర్ణాశ్రమ ధర్మాలను, ధనార్జన ప్రస్ఫుటమయ్యే పద్ధతులను, యుద్ధములో చనిపోయేవానికి కలిగే ఫలితాన్ని గురించి చెప్పమని ధర్మరాజు అడిగినప్పుడు భీష్ముడతనికి కుబేర ముచుకుందుల సంవాదాన్ని (శాంతిపర్వము ద్వితీయాశ్వాసము పద్యాలు 318-326 పుటలు 78-79). కేకయరాజ రాక్షస సంవాదాన్ని (పద్యాలు 339-342), కాలకవృక్షీయ క్షేమదర్శి సంవాదాన్ని (పద్యాలు 363-367 పుట 82), ఇంద్రాంబరీష సంవాదాన్ని (పద్యాలు 430-443 పుటలు 88-89) వినిపించినాడు. సాధ్యాలను, అసాధ్యాలను గుర్తించే పద్ధతులను, బలసంపన్నుడైన శత్రువువల్ల కలిగిన ఆపదను అల్పబలుడైన రాజు తప్పించుకొనే ఉపాయాన్ని, శత్రువులు పెక్కుమంది మీదికి వచ్చినప్పుడు హీన బలుడైన రాజాపదను పాపుకొనే పద్ధతిని, ఒకవ్యక్తిని నమ్మడము నమ్మకపోవడములో ఏది కర్తవ్యమో తెలుసుకొనే పద్ధతిని, ఆహారము దొరకనప్పుడు ద్విజుడు ప్రాణాలను రక్షించుకొనే పద్ధతులను గురించి ధర్మరాజు తనకు కలిగిన సందేహాలను భీష్మునికి వినిపించినప్పుడు అతడు ధర్మజుని సందేహాలను తీర్చడానికి శాంతి పర్వము తృతీయాశ్వాసములోని వ్యాఘ్ర గోమాయు సంవాదాన్ని (పద్యాలు 52-81 పుటలు 96-99), సముద్ర సరిత్సంవాదాన్ని (పద్యాలు 86-90 పుటలు 99-100), మార్జాల మూషిక సంవాదాన్ని (పద్యాలు 202-243 పుటలు 110-113). బ్రహ్మ

1. ఎఱ్ఱన, op. cit., అరణ్యపర్వము పంచమాశ్వాసము పద్యము 291 పుట 249

దత్తునితో పూజని యను శకునిక్కైన సంవాదాన్ని (పద్యాలు 245-266 పుటలు 113-115), శాంతిపర్వము తృతీయాశ్వాసము (పద్యాలు 279-303 పుటలు 116-118) లోని విశ్వామిత్ర చండాల సంవాదాన్ని వినిపించినాడు. ప్రళయకాలము దాపురించినప్పుడు ప్రజలు ప్రవర్తించవలసిన పద్ధతిని, జపవిధిని, జపమువల్ల కలిగే ఫలితాన్ని, నిరతిశయమైన జ్ఞానయోగాన్ని గురించి వివరించడానికి భీష్ముడు ధర్మరాజుకు శాంతిపర్వము చతుర్థాశ్వాసములోని మేధావి అనే బ్రాహ్మణ కుమారుడు తన తండ్రితో చేసిన సంవాదాన్ని (పద్యాలు 22-31 పుట 140), యమకాలమృత్యుభూసురేక్ష్వాకుల సంవాదాన్ని (పద్యాలు 130-140 పుటలు 149-150), ఇక్ష్వాకు కౌశికుల సంవాదాన్ని (పద్యాలు 141-171 పుటలు 150-153), మను బృహస్పతి సంవాదాన్ని (పద్యాలు 1724188 పుటలు 153-154) చెప్పినాడు. "కర్మంబులు సంస్కార యోగంబున శుభాశుభంబులం బురుషుం బొందించు వానికిం గర్త యప్పురుషుండ యగుట గాకుండుట నిశ్చయింపరాకుండు నాకేర్పడం జెప్పవే"[1] అని ధర్మరాజు భీష్ముని అడినప్పుడు, భీష్ముడు అతనికి ఇంద్ర ప్రహ్లాద సంవాదాన్ని (శాంతిపర్వము చతుర్థాశ్వాసము పద్యాలు 363-384 పుటలు 168-169) వినిపించి ధర్మరాజుకు కలిగిన సందేహాన్ని తొలగించినాడు. భూపాలకునికి లక్ష్మీభ్రంశము కలగడానికి గల కారణాలను, మానవుడు తనకు దుర్దశ ప్రాప్తించినప్పుడు నడచుకొనవలసిన తీరును గురించి వివరించడానికి భీష్ముడు ధర్మరాజుకు శాంతిపర్వము చతుర్థాశ్వాసములోని ఇంద్రుడు బలిచక్రవర్తి సంవాదాన్ని (పద్యాలు 389-411 పుటలు 170-172), (పద్యాలు 422-453 పుటలు 172-175) వినిపించినాడు.

> "ఏమిట రూపగుఁ బురుషుం
> డే మెయి రూపుసెడు నాకు నెఱిగింపుము"[2]

అని ధర్మరాజు భీష్ముని అడిగినప్పుడు అతడు,—

> "గురుభక్తి నిరతులు సుర పితృపూజన
> పరులును సత్య సంభాషణులును
> దానశీలురుఁ బరధన పరదార ప
> రాఙ్ముఖ చిత్తులు బ్రాహ్మణ ప్రి

1. తిక్కన, op. cit., శాంతిపర్వము చతుర్థాశ్వాసము గద్యము 369 పుట 168
2. ,, ,, పంచమాశ్వాసము పద్యము 3 పుట 176

యులు దివానిద్రావియుక్తులు వృద్ధ దు
ర్బల దీనయోషిత్కృపారతులును
శౌచులు నతిథి భోజన శిష్టభోజులు
నేను మెచ్చు జనంబు లిట్లుగాక
ధర్మమెడలి కామంబుఁ గ్రోధంబుఁ జాల
గలిగి గర్వులై బలియు భైక్షంబు నిడక
పరుషవాక్కులఁ గ్రూరంపుఁ జరితములను
మిగిలి వర్తించువారు నామెచ్చు గారు''1

—అని లక్ష్మి ఇంద్రునితో చెప్పిన వృత్తాంతాన్ని శ్రీ చక్ర సంవాదముద్వారా (శాంతిపర్వము పంచమాశ్వాసము పద్యాలు 2-17 పుటలు 176-177) ధర్మరాజుకు వినిపించినాడు. ముక్తిని కలిగించే విద్యను, సకల సత్త్వ సమ్మతుడైన వ్యక్తిని, ఉత్తమ ఆహారాన్ని, గృహస్థ సన్న్యాసాశ్రమాలను, తృష్ణను పోగొట్టుకొనే పద్ధతిని, మానవునికి శ్రేయస్సు కలిగే విధానాన్ని గురించి వివరించడానికి భీష్ముడు ధర్మరాజుకు శాంతిపర్వము పంచమాశ్వాసములోని దేవలజైగీషవ్య సంవాదాన్ని (పద్యాలు 20-28 పుటలు 177-178), ఉగ్రసేన శ్రీకృష్ణ సంవాదాన్ని (పద్యాలు 29-32 పుట 178), జాజలితులాధారుల సంవాదాన్ని (పద్యాలు 224-245 పుటలు 195 196), కపిల గో సంవాదాన్ని (పద్యాలు 300-331 పుటలు 200-203), జనకరాజు మాండవ్య మహామునుల సంవాదాన్ని (పద్యాలు 374-378 పుట 207), పితాపుత్ర సంవాదాన్ని (పద్యాలు 380-389 పుట 208), వరుసగా వినిపించినాడు. భీష్ముడు ధర్మరాజుకు శాంతిపర్వము షష్ఠాశ్వాసములోని వసిష్ఠ జనకరాజ సంవాదాన్ని (పద్యాలు 4-43 పుటలు 231-343), యాజ్ఞవల్క్య జనకరాజ సంవాదాన్ని (పద్యాలు 80-89 పుటలు 237-238) వినిపించి అక్షరమైన తత్త్వాన్ని గురించి వివరించినాడు. "గృహస్థ ధర్మంబు పరిత్యజింపక మోక్షంబు బడయుట గలుగనోపునే మదీయ చిత్తంబు సంశయాయత్తంబగుచుండు నిక్కాలుష్యంబు వాపవే"2 అని ధర్మరాజు భీష్ముని అభ్యర్థించినప్పుడు అతనికి భీష్ముడు జనక సులభా సంవాదాన్ని (శాంతిపర్వము షష్ఠాశ్వాసము పద్యాలు 170-219 పుటలు 245-249) వినిపించి అతని సందేహాన్ని

---

1. తిక్కన, op. cit., శాంతిపర్వము పంచమాశ్వాసము పద్యము 1| పుట 177
2. తిక్కన, op. cit., శాంతిపర్వము షష్ఠాశ్వాసము గద్యము 169 పుట 245

తీర్చినాడు. నరనారాయణ సంవాదమును (శాంతిపర్వము షష్ఠాశ్వాసము పద్యాలు 349-389 పుటలు 261-266) ఆధారముగా చేసుకొని గాంగేయుడు ధర్మరాజుకు ముక్తుని లక్షణాలను వివరించినాడు. బంధువులను పెక్కుమందిని వధించానని పరితపించే యుధిష్ఠిరునికి శాంతనవుడు గౌతమీలుబ్ధక సర్పమృత్యుకాల సంవాదాన్ని (అనుశాసనికపర్వము ప్రథమాశ్వాసము పద్యాలు 5-42 పుటలు 1-4) వినిపించి, "ప్రాణులను వధింపను మనుజుడు కర్తగాడని" సూచించినాడు. సర్వజన పూజ్యుడైన వ్యక్తిని, పాపపరిహార పద్ధతిని, వనితల స్వభావాన్ని, గోవుల మాహాత్మ్యాన్ని, పరశురామ విశ్వామిత్రుల జన్మవృత్తాంతాన్ని గురించి వివరించమని యుధిష్ఠిరుడు అడిగినప్పుడు భీష్ముడతనికి అనుశాసనికపర్వము ద్వితీయాశ్వాసము లోని వాసుదేవ నారద సంవాదాన్ని (పద్యాలు 131-144 పుటలు 50-51), వాసుదేవ భూదేవీ సంవాదాన్ని (పద్యాలు 146-152 పుటలు 51-52), నారద పంచచూడ సంవాదాన్ని (పద్యాలు 166-180 పుటలు 53-54), చ్యవన నహుష సంవాదాన్ని (పద్యాలు 257-290 పుటలు 60-63), చ్యవన కుశిక సంవాదాన్ని (పద్యాలు 291-331 పుటలు 63-66), వరుసగా వినిపించినాడు. గోమయముయొక్క ప్రభావాన్ని, దానాన్ని ప్రతిగ్రహించనివాని వృత్తాంతాన్ని, పితృకార్యాదులలో గొడుగులు, చెప్పులు దానం చేయడంవల్ల కలిగే ఫలితాన్ని గురించి వివరించడానికి భీష్ముడతనికి గోశ్రీ సంవాదాన్ని (అనుశాసనికపర్వము తృతీయాశ్వాసము పద్యాలు 113-126 పుటలు 92-93), సప్తర్షి వృషాదర్భి సంవాదాన్ని (పద్యాలు 208-252 పుటలు 101-105), సూర్య జమదగ్ని సంవాదాన్ని (పద్యాలు 255-267 పుటలు 105-106), చెప్పినాడు. అజాతశత్రుడు "నాకలోకం బేకప్రకార మనోహారియైయుండునో బహుప్రకార ప్రమోదియైవెలుంగునో యెఱింగింపవే"1 అని గంగాపుత్రుని ప్రశ్నించి నప్పుడతడు, "పుణ్య కర్మంబు లనేకవిధంబులుగావే · కావునం దత్తదనురూపానేక స్థానంబై నాకంబు నిశ్శోకంబును నస్తోక సుఖకరంబునునై కరంబొప్పుచుండు"2 ననిచెప్పి గౌతమ శతక్రతు సంవాదముద్వారా ఆ విషయాన్ని ధర్మజునికి విశదీకరించినాడు. విప్రుల మాహాత్మ్యాన్ని వివరించడానికి భీష్ముడు ధర్మరాజుకు బ్రహ్మ భగీరథ సంవాదాన్ని (అనుశాసనికపర్వము చతుర్థాశ్వాసము పద్యాలు 82-85 పుటలు 122-123), పవన కార్తవీర్యార్జునుల సంవాదాన్ని (అనుశాసనికపర్వము

---

1. తిక్కన, op. cit., అనుశాసనికపర్వము 4వ ఆశ్వాసము గద్యము 54 పుట 119
2 ,, ,, ,, ,, ,,

పంచమాశ్వాసము పద్యాలు 338-355 పుటలు 186-188) వినిపించినాడు. సర్వశాస్త్ర సారమై శ్రేష్ఠమైన ధర్మము నారాయణుని పూజించడమేనని భీష్ముడు ధర్మరాజుకు నారద పుండరీక సంవాదాన్ని (అనుశాసనికపర్వము చతుర్థాశ్వాసము పద్యాలు 365-379 పుటలు 146-147) వినిపించి అతని సందేహాన్ని తొలగించినాడు. ఇంతవరకు చెప్పబడిన 'సంవాదా'లే గాక హర సనత్కుమార సంవాదము, గురుశిష్య సంవాదము మొదలైన సంవాదాలు మహాభారతములో ఉన్నాయి. ధర్మరాజుకు భీష్ముడు హర సనత్కుమార సంవాదాన్ని (అనుశాసనికపర్వము చతుర్థాశ్వాసము పద్యాలు 169-195 పుటలు 130-132) వినిపించి అధ్యాత్మ విద్యను గురించి వివరించినాడు. అశ్వమేధపర్వము ద్వితీయాశ్వాసములోని (పద్యాలు 103-104 పుటలు 238-241) గురు శిష్య సంవాదముద్వారా కృష్ణుడు అర్జునునికి బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశించినాడు.

మహాభారతములో అష్టావక్రునికి జనకునికి, అష్టావక్రునికి వందికి, ధర్మరాజుకు యక్షునికి జరిగిన సంవాదాలలో పొడుపుకథ పద్ధతి కనిపిస్తుంది. నేడు విద్యాసంస్థలలో విద్యార్థుల ప్రజ్ఞను పరీక్షించడానికి ఉపయోగపడే 'క్విజ్' పద్ధతికి, పొడుపుకథ పద్ధతికి కొంత సాదృశ్యమున్నది. ఆరు కమ్ములు, పంద్రెండిరుసులు, ఇరవై నాలుగు కణుపులు, మున్నూట అరవై ఆకులుకల చక్రమేది? అని జనకుడు అష్టావక్రుని ప్రశ్నించినాడు. ఆరు ఋతువులు ఆరు కమ్ములుగ, పంద్రెండు నెలలు పంద్రెండిరుసులుగ, ఇరవైనాలుగు పక్షాలు ఇరవైనాలుగు కణుపులుగ. మున్నూట అరవై దినాలు మున్నూట అరవై ఆకులుగ కలది కాలచక్రమని అష్టావక్రుడు సమాధానము చెప్పినాడు. రథానికి కట్టబడిన గుఱ్ఱాలలాగా తిరుగుతూ, డేగలలాగా తటాలున పడిపోయే రెండింటినీ దేవతలలో ఎవరు గర్భము ధరిస్తారు? ఆ రెండు దేనిని పుట్టిస్తాయి? అని జనకుడు ప్రశ్నించినప్పుడు, అవి రెండు పూర్వోత్తరారణులని, అవి అగ్నిని పుట్టిస్తాయని అష్టావక్రుడు చెప్పినాడు. వంది అష్టావక్రుల సంవాదము మహాభారతములోని వనపర్వములో (పుటలు 1320-1321 శ్లోకాలు 1-28) వర్ణించబడింది. వంది మహాపండితుడు. అతడు జనకునిసభలో అంతకు ముందు పండితులను ఓడించినాడు. అష్టావక్రుడు వందికంటె చిన్నవాడైనా ప్రతిభా సంపన్నుడు. కాబట్టి తన ప్రతిభను నిరూపించుకోవాలని శాస్త్రార్థములో వందిని ఓడించాలని అష్టావక్రుడు సంసిద్ధుడైనాడు. అష్టావక్రుడు వందితో 'మొదట నా ప్రశ్నలకు సమాధానములిమ్ము. తరువాత నేను నీ ప్రశ్నలకు సమాధానాలు చెప్పగల'నని పల్కిన వెంటనే వంది సూర్యుడొక్కడే ముల్లోకాలను

వెలిగిస్తున్నాడని, దేవేంద్రుడొక్కడే అద్వితీయ శూరుడై శత్రువులను చంపగలుగుతున్నాడని, యముడొక్కడే పితరులకు ప్రభువై ఉన్నాడని ఏకసంఖ్యగల వాటిని[1] గురించి చెప్పినాడు. ఇంద్రాగ్నులు, పర్వతనారదులు, అశ్వనీదేవతలు, భార్యాభర్తలు జంటలుగా ఉంటారని, బండికి ఉండేవి రెండు చక్రాలని రెండు రెండుగా నున్నవాటిని గురించి[2] అష్టావక్రుడు పేర్కొనినాడు. భూతసృష్టికి కారణాలైన గుణాలు మూడు, వేదాలుమూడు, పశుగోమేష్టి రూపాలైన యాగాలు మూడు, సూర్యచంద్రాగ్ని రూపమైన జ్యోతిస్సులుమూడు అని వంది చెప్పినాడు. ఆశ్రమాలు నాలుగు, వర్ణాలు నాలుగు (హ్రస్వదీర్ఘప్లుతాలు, హల్లులు, బ్రాహ్మణాది వర్ణాలు నాలుగు, దిశలు నాలుగు, గోవుకు నాలుగు పాదాలని అష్టావక్రుడు చతుస్సంఖ్యగల వాటిని గురించి చెప్పినాడు. అగ్నులైదని (గార్హపత్యము దక్షిణాగ్ని ఆహవనీయము సవ్యము అపసవ్యము), నిత్యయజ్ఞాలైదని (దేవఋషి పితృ మనుష్య భూత యజ్ఞాలు), వేదాలలో వర్ణించిన అప్సరస పంచచూడ అని, పంచనదము పుణ్యప్రదమైనదని, (విపాశ ఇరావతి వితస్త చంద్రభాగ శతద్రునదులు) ఐదు సంఖ్యలు గల వాటిని గురించి వంది పేర్కొనినాడు. అగ్నిని స్థాపించే సమయములో ఉంచే గోరూపమైన దక్షిణలారు, కాలచక్రానికి ఆరు ఋతువులు, మనస్సుతోచేరి జ్ఞానేంద్రియాలు ఆరు, కృత్తికలు ఆరు, వేదాలలో చెప్పబడిన సాద్యస్కమనే పేరుతో జరిగే యజ్ఞాలు ఆరు అని ఆరు సంఖ్యలుగల వాటిని గురించి అష్టావక్రుడు చెప్పినాడు. వంది ఏడు సంఖ్యలుగల వాటిని గురించి చెప్పడానికి ప్రారంభించినాడు. గ్రామ్యపశువులు ఏడు (ఆవు గేదె మేక గొఱ్ఱె గుఱ్ఱము కుక్క గాడిద), వన్యపశువులు ఏడు (సింహము పులి తోడేలు ఏనుగు కోతి ఎలుగుబంటి జింక), యజ్ఞాలలో వాడబడే ఛందస్సులు ఏడు (గాయత్రి ఉష్ణిక్కు అనుష్టుప్పు బృహతి పంక్తి త్రిష్టుప్పు), ఋషులు ఏడుగురు, పూజలు ఏడు (గంధ పుష్ప ధూప దీప నైవేద్య చందన తాంబూలాలు). వీణకు ఉండే తంత్రులు ఏడు అని సప్తసంఖ్యాకమైన వాటిని చెప్పినాడు అష్టావక్రుడు వందినిచూచి దేవతలలో అష్టవసువులున్నారని (ఆపుడు ధ్రువుడు సోముడు అధ్వరుడు అనిలుడు అనలుడు ప్రత్యూషుడు ప్రభాసుడు),

---

1. ఏక ఏవాగ్ని ర్బహుధా సమిధ్యతే ఏకః సూర్యః సర్వమిదమ్ విభాతి
   ఏకో వీరోదేవ రాజోఽరిహంతా యమః పితౄణా మీశ్వరశ్చైక ఏవ

2. ద్వావింద్రాగ్నీ చ రతౌ వై సఖాయౌ ద్వౌదేవర్షీ నారద పర్వతౌచ
   ద్వావశ్వినౌ ద్వేరథస్యాపి చక్రే భార్యా పతీద్వౌ విహితౌ విధాత్రా

యూపానికి ఎనిమిది అంచులుంటాయని ఎనిమిది సంఖ్యలుగలవాటిని చెప్పినాడు. పితృ యజ్ఞాలలో పఠింపబడే సామిదేనులనే ఋక్కులు తొమ్మిది, బృహతి ఛందస్సులో ప్రతిపాదానికి ఉండే అక్షరాలు తొమ్మిది, అంకెలు తొమ్మిది, భూత సృష్టి తొమ్మిదింటి సంయోగముచే జరుగుతుందని, (ప్రకృతి, పురుషుడు, మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు) తొమ్మిది సంఖ్యలుగలవాటిని వంది చెప్పినాడు. లోకములో మానవులకు పది దశలున్నాయని (గర్భవాసము, జన్మము, బాల్యము, కౌమారము, పౌగండము, కైశోరము, యౌవనము, ప్రౌఢదశ, వార్ధక్యం, మృత్యువు). వేయికి నూర్లు పది అని, స్త్రీలకు గర్భధారణ కాలము పదినెలలని, నిందితులు పదిమంది అని (రోగి, దరిద్రుడు, శోకార్తుడు, రాజదండితుడు, శఠుడు, ఖలుడు, వృత్తివంచితుడు, ఉన్మత్తుడు, ఈర్ష్యాసరాయణుడు, కామి), పూజనీయులు పదిమంది[1] అని అష్టావక్రుడు చెప్పినాడు. విషయాలు పదకొండు అని (కర్మేంద్రియ విషయాలు జ్ఞానేంద్రియ విషయాలు మనస్సు), ఇంద్రియాలు పదకొండని. ప్రాణులకు కలిగే వికారాలు పదకొండని (కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య హర్ష శోక రాగ ద్వేష అహంకారాలు), రుద్రులు పదకొండుమంది అని వంది పలికినాడు. సంవత్సరానికి నెలలు పండ్రెండు, జగతీ ఛందస్సులో ఒక్కొక్క పాదానికి ఉండే అక్షరాలు పండ్రెండు. ప్రకృతి యాగము నిర్వహింపబడే రోజులు పండ్రెండు, ఆదిత్యులు పండ్రెండుమంది అని అష్టావక్రుడు చెప్పినాడు. వంది పదుమూడు సంఖ్యలుండే వాటిని చెప్పడానికి పూనికొనినాడు. అతడు శ్లోకములో పూర్వార్ధాన్ని మాత్రమే పూరించి దిక్కుతోచక నిలిచినప్పుడు అష్టావక్రుడు శ్లోకములో ఉత్తరార్ధాన్ని పూరించి వందిని వాగ్వాదములో ఓడించినాడు.

ధర్మరాజుకు యక్షునికి జరిగిన సంవాదము మహాభారతములో (అరణ్యపర్వం చతుర్థాశ్వాసము పద్యాలు 423-467 పుటలు 379-383) వర్ణించబడింది. యక్షుడు ధర్మరాజును ప్రశ్నించిన తీరును ఎర్రన ఇట్లా వర్ణించినాడు.

"దినకరు నెయ్యది నడపును
దినకరు నెవ్వారు కొలిచి తిరుగుదు రద్దే

1. ఉపాధ్యాయః పితా జ్యేష్ఠభ్రాతా చైవ మహీపతిః
మాతులః శ్వశురశ్చైవ మాతామహ పితామహౌ
బంధు జ్యేష్ఠః పితృవ్యశ్చ పుంస్యేతే గురవో మతాః
Ibid, Page 1322 Foot Note.

వుని యస్తమించు టేమిట
ననఘ తదాధారభూత మది యెయ్యదియో"[1]

యుధిష్ఠిరుడు యక్షుని ప్రశ్నలకు సమాధానాలిచ్చిన వృత్తాంతాన్ని గురించి ఎఱ్ఱన చెప్పిన పద్యమిది.

"అనిన ధర్మజు డిట్లను నబ్జహితుని
నడపు బ్రహ్మంబు సురకోటి నడచుఁ గొలిచి
ధర్మచే నస్తమితుఁడగుఁ దపనుఁ డమ్మ
హాత్మునకు సత్య మాధారమండ్రు బుధులు"[2]

ప్రశ్నలకు వివరణాత్మకమైన సమాధానాలుగాకుండ, ఒకటి రెండు పదాలలో ఉండే సమాధానాలు యక్ష ధర్మజ సంవాదములో కనిపిస్తాయి. నేడు విద్యాలయాలలో విద్యార్థుల జ్ఞానాన్ని పరీక్షించడానికి నిర్వహించే లక్ష్యాత్మక శోధనికలలో (Objective type tests) లాగా యక్ష ధర్మజ సంవాదములో చిన్నచిన్న ప్రశ్నలు ఉన్నాయి.

యక్ష ధర్మజ సంవాదములోని ప్రశ్నోత్తరాలివి :

1. "ఏమిట శ్రోత్రియుడనఁ జను?" (శ్రుతమువల్ల).
2. అతనికి మహిమ ఎట్లా కలుగుతుంది? (తపస్సుచే).
3. శ్రోత్రియునికి సహాయపడేది ఏది? (ధృతి).
4. అతడు బుద్ధిమంతు డెట్లౌతాడు? (బుధుల సేవచే).
5. భూదేవునికి దేవభావాన్ని కల్గించేది ఏది? (అధ్యయనము).
6 అతనికి సాధుస్వభావ మెట్లాకలుగుతుంది? (వ్రతములచే).
7. అతడసాధువని ఎట్లా అనిపించుకొంటాడు? (విశిష్టమైన వృత్తిని విడిచిపెట్టుటవల్ల).
8. జీవన్మృతుడెవడు? (దేవతలకు అతిథులకు పితృదేవతలకు భృత్యులు మొదలైనవారికి అన్నముపెట్టక తానుమాత్రము తినువాడు).
9. భూమికంటె బరువైనది ఏది? (తల్లి).

1. ఎఱ్ఱన, op cit., అరణ్యపర్వము సప్తమాశ్వాసము పద్యము 423 పుట 379
2. ,, ,, ,, ,, 424 పుట 379

10. ఆకసముకంటె పొడవైనవాడు ఎవడు? (తండ్రి)
11. గాలికంటె వేగముగా పోయేది ఏది? (మనస్సు)
12. గడ్డికంటె తఅపైనది ఏది? (చింత)
13. నిద్రించినా కన్నుమూయనిది ఏది? (చేప)
14. పుట్టినా చేతనత్వాన్ని పొందనిది ఏది? (గ్రుడ్డు).
15. రూపుకలిగినా హృదయములేనిది ఏది? (రాయి).
16. వేగముతో వృద్ధిపొందేది ఏది? (నది).
17. బాటసారికి స్నేహితుడెవరు? (బిడారు).
18. రోగికి స్నేహితుడెవరు? (వైద్యుడు).
19. గృహస్థుకు చుట్టము ఎవరు? (భార్య).
20. మృతిబొందినవానికి చుట్టమేది? (ధర్మము).
21. ధర్మవుకు కుదురు ఏది? (దాక్షిణ్యము).
22. కీర్తికి ఆశ్రయమైనదేది? (దానము).
23. సురలోకాన్ని పొందడానికి మార్గమేది? (సత్యము).
24. సుఖానికి సిలయమైనది ఏది? (శీలము).
25. నరునికి ఆత్మ ఎవ్వడు? (ఆత్మజుడు).
26. అతనికి దైవికమైన చుట్టము ఎవరు? (భార్య).
27. అతని జీవనానికి ఆధారము ఎవడు? (పర్జన్యుడు).
28. అతడు దేనిచే దోషరహితుడౌతాడు? (దానాన్ని కొనియాడడంవల్ల).
29. ధర్మాలలోకెల్ల మేటి ధర్మమేది? (అహింస).
30. ఎప్పటికీ బాగా మాగి పండి ఉండేది ఏది? (యాగకర్మ).
31. దేన్ని నిగ్రహిస్తే ప్రమోదము కల్గుతుంది?
("మనసు క్రొవ్వును ఖండించడంవల్ల").
32. ఎవరితో స్నేహముచేస్తే అది వికలముకాదు? (సజ్జనసాంగత్యము).
33. లోకానికి దిక్కు ఎవరు? (సజ్జనులు).
34. జలము అన్నము దేనివల్ల కలుగును? (నభము ధరణి జలమువల్ల).
35. దేన్ని విషతుల్యంగా చూడాలి? (విప్రుల ధనాన్ని).
36. శ్రాద్ధాన్ని చేయవలసిన సమయమేది?
(ఎప్పుడు బ్రాహ్మణుడు వస్తాడో అప్పుడు).

37. సర్వజనప్రియుడెవడు? (గర్వము లేనివాడు).
38. శోకరహితుడెవ్వడు? (కోపములేనివాడు).
39 దేన్ని వదిలితే అర్థవంతుడౌతాడు? (లోభాన్ని).
40. సుఖి ఎవడు? (తృష్ణలేనివాడు).
41. ఎట్టివాడు పురుషుడు అనిపించుకొంటాడు? (కీర్తిమంతుడు).
42. సర్వధని ఎవడు? (సమదర్శనుడు).

యుధిష్ఠిరుడు చెప్పిన సమాధానాలనువిని యక్షుడు ప్రీతిని పొందినాడు.

5.1.8. చర్చాపద్ధతి :

ఒక విషయాన్నిగూర్చి పక్ష ప్రతిపక్ష రూపంగా సాగేది చర్చ. ఒక విషయాన్ని గురించి కూలంకషంగా చర్చించినప్పుడు దానిలోని లోతుపాతులను విద్యార్థి సులభంగా గ్రహించగలుగుతాడు. మహాభారతములో అనేక విషయాలను గురించి ఆ యా సందర్భాలలో చర్చించడము జరిగింది. జనమేజయుని సర్ప యాగమువల్ల తమకు కలుగబోయే ఉపద్రవాన్ని ఎదుర్కొనడానికి నాగులు సమావేశమై చర్చించడము, రాక్షసునికి ఆహారంగా బ్రాహ్మణ కుటుంబములోని సభ్యులు వెళ్ళవలసి వచ్చినప్పుడు తమ సమస్యను గురించి చర్చించడము, పాండవు లైదుగురు ఒక్క ద్రౌపదిని పెళ్ళిచేసుకోవడ మెట్లని చర్చించడము, పాంచాలీ సహితులైన పాండవులు తాము ఏ యే పనులలో విరటుని కొలువులో చేరవలయునో వాటినిగురించి చర్చించడము మొదలైన సంఘటనలు మహాభారతములో ఉన్నాయి. మహాభారతములోని ప్రసంగాలను గురించి నండూరి బంగారయ్య ఇట్లా చెప్పినాడు. "నవీనులు Symposiums అని పేర్కొను సంప్రదింపులు కూడ నిందున్నవి. అభిమన్యుని వివాహానంతరము విరాటుని కొలువుకూటముననూ, సంజయుడు పాండవుల యొద్దనుండి తిరిగివచ్చినవెనుక ధృతరాష్ట్రుని కొలువుకూటముననూ, ఉపప్లావ్య పురమున మాధవుని మందిరమున, ద్వితీయాశ్వాస ప్రారంభమున జరిగిన సమావేశమును నీ సంప్రదింపులకు ఉదాహరణములు"[1] నాగుల సమావేశ వృత్తాంతము, ఆదిపర్వములో (శ్లోకాలు 1-34 పుటలు 117-119) వర్ణించబడింది. జనమేజయుడుచేసే సర్పయాగములో నాగులకు మరణము తప్పదని కద్రువ శాప

1. బంగారయ్య, నండూరి ఆంధ్రమహాభారతోపన్యాసములు పుట 117, ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్డు, హైదరాబాదు, 1962.

మిచ్చింది. ఆ ఉపద్రవమునుండి తప్పించుకొనడానికి నాగులు ఒక్కచోట సమావేశమై చక్కగా ఆలోచించి చివరకు ఒక నిర్ణయానికి రావడము జరిగింది. నాగులు ఎవరికి తోచిన ఆలోచనలను వారు సభాముఖంగా తెలిపినారు. విప్రవేషాలను ధరించి రాజుదగ్గరకుపోయి అతన్ని సర్పయాగ విముఖునిగా చేయాలని కొందరు చెప్పినారు. రాజుదగ్గర మంత్రులుగాచేరి సర్పయాగమువల్ల కలిగే కీడును గురించి అతనికిచెప్పి, అతన్ని సర్పయాగ విముఖునిగాచేయడం మంచిదని కొందరు పలికినారు. సర్పయాగ విధానమును తెలిసిన ఋత్విజులను కాటువేస్తే వారు చనిపోతారని, ఆ యాగాన్ని చేయించేవారు లేనందువల్ల జనమేజయుడు తన ప్రయత్నాన్ని మానుకొంటాడని కొందరు తమ అభిప్రాయాన్ని తెలిపినారు. అది మంచి పద్ధతి కాదని కొందరు నిందించినారు. మేఘాల రూపాలను ధరించి, యజ్ఞకాలములో భయంకరంగా వర్షించి, అగ్నుల చల్లార్చి, యజ్ఞముకోసము సేకరించిన పదార్థాలు కొట్టుకొనిపోయేటట్లు చేయడం మంచిదని మరికొందరు చెప్పినారు. యాగసాధనాలను తస్కరించి యాగానికి వచ్చినవారిని కఱచి, యజ్ఞాన్నములో మలమూత్రాలను విసర్జించి, యజ్ఞానికి విఘ్నము కలిగిస్తామని కొందరు పలికినారు. తమలో కొందరు ఋత్విక్కులుగచేరి యాగ దక్షిణగ యజ్ఞాన్ని నిలిపివేయమని రాజును కోరడము మంచిదని కొందరు చెప్పినారు. జనమేజయుడు రాణులతో జలక్రీడలాడునప్పుడు అతన్నిపట్టి ఇంటికితెచ్చి శరీరమంతా కాట్లుపేసి చంపడము మంచిదని కొందరు చెప్పినారు. వాసుకి అందరి అభిప్రాయాలనువిని అవి సరియైనవి కావని తేల్చినాడు. తమ తండ్రియైన కశ్యపుని దగ్గరకు వారందరు పోయి శాప ప్రతీకారాన్ని గురించి అడగడం మంచిదని వాసుకి తన అభిప్రాయాన్ని తెలిపినాడు. ఇంతలో ఏలాపుత్రుడనువాడు వారితో జరత్కారునికి జరత్కారువుకు పుట్టబోయే ఆ స్త్రీకునివల్ల సర్పయాగము నివారింపబడుతుందని బ్రహ్మచెప్పిన మాటలను వారికి చెప్పినాడు. జరత్కారునికి తమ చెల్లెలినిచ్చి సర్పయాగమువల్ల కలిగే వినాశాన్ని నివారించడము మంచిదని తన అభిప్రాయాన్ని తెలిపినాడు. వారందరు అతని అభిప్రాయముతో ఏకీభవించినారు. అంతటితో నాగుల సమావేశము పూర్తి అయింది.

బకునికి ఆహారంగా పోవడాన్ని గురించి ఏకచక్రపురములోని బ్రాహ్మణ కుటుంబంలోని సభ్యులు చర్చించిన వృత్తాంతము, ఆదిపర్వము షష్ఠాశ్వాసములో (పద్యాలు 248-264 పుటలు 386-389) వర్ణించబడింది. ఏకచక్రపురములోని

ప్రజలు బకుని బాధలను భరించలేక, ఆ రాక్షసుడు ఊరిమీద పడకుండా రోజుకొక యింటివాడు వానికి సరిపడే ఆహారాన్ని తీసుకొనిపోవాలనే నియమము ఏర్పరచు కొన్నారు. పాండవులు ఏకచక్రపురంలో ఒక బ్రాహ్మణుని ఇంటిలో నివసిస్తుంటే బకునికి ఆహారాన్ని తీసుకొనిపోయేవంతు ఆయింటి యజమానునికి వచ్చింది. బ్రాహ్మణుడు బ్రాహ్మణి మొదలైనవారికి తన అభిప్రాయాలను వినిపించినాడు. సంసారుల జీవితము నిరర్థకమని, దుఃఖభరితమని, ముక్తి పొందినవానికి ఆనందం కలుగుతుందని బ్రాహ్మణుడు వారితో చెప్పినాడు. "మరొక ఊరికివెళ్ళి సుఖంగా ఉందామంటే వింటావా? ఉన్న ఊరును కన్న తల్లిదండ్రులను వదలి రానంటివి. వారు చనిపోయినారు. ఊరిలో బంధువులా లేరు. నాకు అపదను తెచ్చిపెట్టినావు. మా తల్లిదండ్రుల కోరికపై నిన్ను పెళ్ళి చేసుకొన్నాను. మనము అన్యోన్యంగా నడుచుకొన్నాము. నీవు ప్రేమతో నాకు సకలోపచారాలు చేసినావు. నిన్ను నా సహధర్మచారిణిని రాక్షసునికి ఆహారంగా పంపడమెట్లు? ఒకవేళ పుత్రుని పంపుదా మనుకొంటే మనకు పిండాలు పెట్టేవాడుండడే. కూతురును పంపుదామనుకుంటే మనకు దౌహిత్రలాభము తొలగిపోతుంది. ఉభయ కులాలవారిని ఉద్ధరించే ఈ కన్యకను రాక్షసునికి ఆహారంగా పంపలేను" అని బ్రాహ్మణుడు వాపోయినాడు. బ్రాహ్మణుడు సాంసారిక జీవితములోని బాధలను, ముక్తుడైనవానికి కలిగే ఆనందాన్ని గూర్చి చర్చించి, ఆలుబిడ్డల విషయాన్ని ప్రస్తావించి, పొరుగూరికి వెళ్లాలనే తన ప్రతిపాదనను భార్య త్రోసిపుచ్చిందని ఆమెను మెత్తగా చీవాట్లుపెట్టి. ఆమె నొచ్చుకొంటుందేమోనని వారి అన్యోన్య అనురాగాన్ని గుర్తుకుతెచ్చినాడు. పున్నామ నరకమునుండి తల్లిదండ్రులను కాపాడేవాడు పుత్రుడని, ఉభయకులాల వారిని ఉద్ధరించేది పుత్రిక అని, వారిని రాక్షసునికి ఆహారముగా పంపలేనని చెప్పనాడు. ఆ బ్రాహ్మణుని చర్చ తార్కిక పద్ధతిలో నడిచింది.

బ్రాహ్మణుని మాటలనువిన్న తరువాత బ్రాహ్మణి తన అభిప్రాయాలను తెలిపింది. "ఆపదలు వచ్చినప్పుడు పురుషుడు ధైర్యము వహించాలి. దుఃఖించ కూడదు. నేను నీకు భార్యగా గృహస్థ ధర్మాలను నడిపినాను. కొడుకును, కూతురును కన్నాను. నీ కోరికలను తీర్చినాను. నీవు లేకపోతే నేను బ్రతుక లేను. నీడలేని ఆడదాన్ని లోకము చులకనగా చూస్తుంది. నేలపడిన మాంః ముక్కను పక్షులు కాజేయడానికి సిద్ధపడినట్లు దుర్మార్గులు నా వెంటపడతా నేను బాగా బ్రదుకాలనుకొన్నా బ్రదుకనీయరు. అంతేకాదు. ఈ పిల్లలను

పోషించడము కష్టము. ఒకవేళ పోషించినా వీరిలో కూతురునైనా దురభిమానుల కివ్వవలవస్తుంది. పట్టుపట్టి యివ్వకపోతినా మోసముతోనైనా తీసుకపోతారు. నా నడవడికి లోటురాకుండా బ్రతికేది ఎట్లు? మీరులేకపోతే పసివానికి విద్యనేర్పేవా రెవ్వరు? నేను రాక్షసునికి ఆహారంగాపోతే నన్ను చంపినందువల్ల వానికి స్త్రీహత్యా పాపము వస్తుందని, వాడు నన్ను వదిలిపెట్టవచ్చు. ఒకవేళ వాడు నన్ను మింగినాసరే. నీతో భోగాలను అనుభవించినాను, కోరికలు తీర్చుకొన్నాను. సంతానవతినైనాను. నేను చనిపోయినా నీవు మరొక స్త్రీని పెళ్లాడి గృహస్థధర్మాన్ని పాటించవచ్చు. నీవు లేనప్పుడు నేను మరొక పురుషుని పెండ్లిచేసుకోవడము ధర్మవిరుద్ధము" అని చెప్పింది. ధైర్యము వహించడము పురుషుని లక్షణమని చెప్పి, సతీపతి కుతూహల రహస్యాలను గుర్తుకుతెచ్చి సంతానభాగ్యాన్ని తడవి, పతిలేనిసతి తన శీలాన్ని కాపాడుకోవడము కష్టమని నుడివి పిల్లలను పోషించడంలో, వారికి చదువు చెప్పించడములో ఉండే బాధలను మగనికి వినిపించి తార్కికపద్ధతిలో బ్రాహ్మణి తాను చెప్పదలచిన విషయాన్ని వినిపించింది. బ్రాహ్మణుడామాటలను వినినాడు. ఆమెను గట్టిగా కౌగలించుకొన్నాడు. అతడు ఏడ్చినాడు. ఆమె ఏడ్చింది. మరణ ప్రయత్నములోనున్న వారిని చూచి కూతురు వారితో ఇట్లా చెప్పింది. "నేను రాక్షసునికి బలి ఔతాను. ఎప్పటికైనా మీరు నన్ను ఒక వరునికి ఇవ్వవలసి ఉంటుంది. ఎప్పుడో మీరు నన్ను వదలుకోవడముకంటే ఇప్పుడే వదలుకోవడము మంచిది. అందువల్ల కులానికి మేలు కలుగుతుంది. నేను చనిపోతే తండ్రి తాతలకు దౌహిత్రలాభమువల్ల కలిగే పుణ్యలోకాలు కలుగ వంటారా? అది సమంజసమైందికాదు. మీవల్ల పుత్రులు దౌహిత్రులు కలుగుతారు. వారివల్ల పితరులకు పుణ్యలోకాలు కలుగుతాయి. మీరు లేకపోతే నన్ను, నా తమ్ముని నీతిమార్గములో పెంచేదెవరు? భర్త భార్య గర్భములో ప్రవేశించి పుత్రుని రూపములో పుడతాడు. నీకు వానికి భేదములేదు. వానిని వదులుకోవడము, సహధర్మచారిణి ఐన భార్యను వదలుకోవడము మంచిదికాదు." ఆ బ్రాహ్మణుని కూతురు తల్లిదండ్రులను ఓదార్చి తాను రాక్షసునికి బలిగా పోతానని వారితో తెగించి పలికింది. తాను లేకపోయినా వారికికమీదట కలుగబోయే కూతురువల్ల దౌహిత్రులు పుడతారనీ, వారివల్ల పితరులకు ఉత్తమలోకాలు సిద్ధిస్తాయని చెప్పింది. తల్లిదండ్రులు లేని పిల్లల జీవితము దుర్భరమని తెలిపింది. 'పుత్రుడు తండ్రికంటె వేరొకడు కాడు' 'భార్య సహధర్మచారిణి' అనే వాక్యాలు కన్యక వాదానికి ఆయువుపట్టులు.

బ్రాహ్మణుని కూతురు తార్కిక పద్ధతిలో తన ప్రసంగాన్ని సాగించింది. అంతలోనే విప్రబాలుడు కోలను చేతపట్టుకొని రాక్షసుని చంపివస్తానంటూ ముందుకు నడిచినాడు. ఇంతవరకు శోకమయమైన వాతావరణములో జరిగినచర్చ ముగిసింది. పసివాని తేనెలొలికే మాటలకు వారు ఆనందించినారు. బ్రాహ్మణుడు కుంతీదేవికి తన దుఃఖ కారణాన్ని వినిపించినాడు. రాక్షసుని చంపడానికి భీముని పంపాలని కుంతి నిశ్చయించింది. భీముడువెళ్ళి బకుని చంపినాడు. బ్రాహ్మణుని సమస్య తీరింది. ఏకచక్రపురములోని ప్రజల సమస్యలు తీరినాయి.

ద్రౌపది వివాహచర్చ ఆదిపర్వము సప్తమాశ్వాసములో (పద్యాలు 210-215 పుటలు 453-454) వర్ణించబడింది. అర్జునుడు మత్స్యయంత్రాన్ని తెగవేసిన తరువాత కుంతి దగ్గరకు వచ్చినాడు. భీముడుకూడ అతనితో వచ్చినాడు. ధర్మజుడు, నకుల సహదేవులు అచ్చట ఉన్నారు. భిక్షను తెచ్చినామని భీమార్జునులు తల్లితో చెప్పినారు. ఆ భిక్ష నిత్యమూ కుమారులు తనకు నివేదించే భిక్షవంటిదేనని భావించి దాన్ని సమంగా అనుభవించండని కుంతి వారితో చెప్పింది. తరువాత కుంతి ద్రౌపదిని చూచింది. తాను చెప్పినమాటలు ధర్మవిరుద్ధమైనవని కుంతి భయపడింది. పాండవు లైదుగురు ద్రౌపదిని అనుభవించడం అధర్మము. అనుభవించకపోతే కుంతి అబద్ధము చెప్పినట్లౌతుంది. ఇది సమస్య. ధర్మరాజు ఆలోచించినాడు. వీర్యశుల్క విజితయైన ద్రౌపదిని అగ్నిసాక్షిగా పెండ్లిచేసుకొమ్మని ధర్మజుడు అర్జునునితో చెప్పినాడు. పెద్దవారుండగా చిన్నవాడు ముందుగా వివాహము చేసుకోవడము ధర్మవిరుద్ధమని ధనంజయుడు చెప్పినాడు. ధర్మాన్ని నిర్ణయించవలసిన బాధ్యత ధర్మరాజుపై పడింది. విధి ప్రేరణచే వారికి ఐదుగురికి ఆమెపై వలపు కలిగింది. అప్పుడు ధర్మరాజు వేదవ్యాసుడు చెప్పిన మాటలను గుర్తుకు తెచ్చుకొన్నాడు. అతడు తమ్ములతో చెప్పిన మాటలనుగురించి నన్నయ వర్ణించిన పద్యమిది.—

"గురువచనస్థితి మన కే
గురకును నిది పత్నిగాఁ దగుం గావున ని
త్తరుణిని బరిగ్రహింతము
తిరముగ గురు వచనమొండు దెఱఁగేల యగున్."[1]

—పాండవులైదుగురు ద్రౌపదిని పెళ్లి చేసుకొన్నారు.

1. నన్నయ, op. cit, ఆదిపర్వము సప్తమాశ్వాసము పద్యము 215 పుట 454

అరణ్యవాసం ముగిసిన తరువాత ధర్మరాజు తమ్ములతో అజ్ఞాతవాసాన్ని గురించి చర్చించడం, విరాటపర్వము ప్రథమాశ్వాసములో (పద్యాలు 65-114 పుటలు 7-11) వర్ణించబడింది. తమ అజ్ఞాతవాసానికి అనువైన దేశాన్ని పేర్కొనమని ధర్మరాజు అర్జునుని అడిగినాడు. అర్జునుడు పాంచాల చేది మత్స్య సాల్వాది దేశాలను పేర్కొని, వాటిలో ఏదేశము వారు నివసించడానికి సౌకర్యంగ ఉంటుందో ఆదేశాన్ని నిర్ణయించమని ధర్మజునితో చెప్పినాడు. మత్స్యరాజు, విరటుడు బల పరాక్రమ సంపన్నుడని, ధర్మశీలుడని, వదాన్యుడని, విద్యా వయోవృద్ధుడని, తమ మేలు కోరేవాడని, అతని దేశములో, అతని దగ్గర అజ్ఞాతవాసము ముగించుకొనుట మంచిదని ధర్మరాజు తమ్ములతో పలికినాడు. వారాతని కొలువులో ఏ యే పనులలో ఎవరెవరు మెలగాలో వాటిని నిర్ణయించుకొనినారు. వారు ధౌమ్యునివల్ల సేవా ధర్మాలను గురించి తెలుసుకొనినారు. పాంచాలితో విరాట నగరానికి బయలుదేరినారు. సన్న్యాసి వేషములో ధర్మరాజు, వంటలవాడుగ భీముడు, నాట్యాచార్యుడుగ అర్జునుడు, అశ్వపాలకుడుగ నకులుడు, గోపాలకుడుగ సహదేవుడు, సైరంధ్రి వేషములో ద్రౌపది విరటుని కొలువులో చేరినారు. ఆ యా విద్యలలో నిష్ణాతులైన వారిని ఆదరించడము వల్లనే విరటుని రాజ్యము పాడిపంటలతో తులతూగేదని విదితమౌతుంది. పాండవులు, ద్రౌపది విరటుని కొలువులో తాము ఏ యే పనులలో మెలగాలో వాటిని గురించి నిర్ణయించుకొనడం ఒక క్రమపద్ధతిలో జరిగింది.

విరటుని కొలువుకూటములో జరిగిన చర్చనుగురించి ఉద్యోగపర్వము ప్రథమాశ్వాసములో (పద్యాలు 4-38 పుటలు 161-164) వర్ణించడం జరిగింది. ఉత్తరాభిమన్యుల వివాహము జరిగిన మరునాడు విరటుడు, ద్రుపదుడు, వసుదేవుడు, సాత్యకి, బలరాముడు, కృష్ణుడు, ధర్మరాజు, ద్రుపదునికుమారులు, భీమార్జున నకులసహదేవులు, ప్రద్యుమ్నుడు, సాంబుడు, అభిమన్యుడు, ఉపపాండవులు మొదలైనవారు సమావేశమైనారు. వారందరు చిత్ర విచిత్రమైన కథలతో కొంతకాలము గడిపినారు. కృష్ణుడు ఆ సభలో ప్రసంగించడానికి పూనుకొనినాడు. సభాసదులు కృష్ణునిపైన తమ చూపును నిలిపి ఆ యా మాటలను శ్రద్ధతో వింటున్నారు. కృష్ణుడు సభాసదులకు పాండవులనుభవించిన కష్టాలను వివరించినాడు. పాండవులకు, కౌరవులకు మేలుకలిగే పద్ధతినిగురించి ఆలోచించమని సభాసదులతో చెప్పినాడు. దుర్యోధనునికడకు దూతనుబంపుట మంచిదని తన అభిప్రాయాన్ని వారికితెలిపినాడు. బలరాముడు కృష్ణుని మాటలనువిని మెచ్చుకొని సభాసదులతో—

"హరి వాక్యము వింటిరె యది
యిరు దెఱగుల జనములకును హితమును ధర్మో
త్తరమునునై యున్నది యీ
వెరవున శక్యంబు మనకు వీరలఁ దీర్పన్."1

—అని చెప్పినాడు. సామోపాయముతో కార్యాన్ని సాధించడము మంచిదని బలరాముడు తన అభిప్రాయాన్ని సభాసదులకు తెలిపినాడు. బలరాముడు చెప్పిన మాటలు సాత్యకికి నచ్చలేదు. అందువల్ల సాత్యకి అతని నిందించినాడు. సాత్యకి తన అభిప్రాయాన్ని సభాసదులకు తెలిపినాడు. ఆ వృత్తాంతాన్ని తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"నా మతమునఁ గార్యము సం
గ్రామము సేయుటయ యిట్లుగాకీ లోనన్
సామవచనంబు లక్కురు
భూమీశ్వరుతోడ నాడఁబుచ్చెదరేనిన్.

"దైన్యముదక్కి దూత యుచితంబుగఁ బాండునృపాలు పాలురా
జన్యవరుండు ధర్మజుడు సమ్మతి వేడెడునన్న లోక సా
మాన్య విధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చుకొంద మ
న్యోన్య విరుద్ధ భాషముణలాడినఁ దత్పల మాతడందెడిన్."2

ద్రుపదుడు సాత్యకి మాటలను మెచ్చుకొన్నాడు. 'బలదేవుని మాట మాటగాదు' అన్నాడు. అతడు తన ప్రసంగాన్ని సాగించినాడు. బంధువులకు మిత్రులకు సమరవార్తను చెప్పడానికి దూతలను పంపడం మంచిదని చెప్పినాడు. తన పురోహితుని కౌరవులకడకు రాయబారిగా పంపుట యుక్తమని పలికినాడు. ద్రుపదుని మాటలను కృష్ణుడు మెచ్చుకొన్నాడు. సభలలో పలువురు వ్యక్తులు తమ అభిప్రాయాలను వెల్లడిస్తున్నప్పుడు వక్తలు తమ వాదాలకు అనుకూలంగా ఉండే వాటిని స్వీకరించడం, ప్రతికూలంగా ఉండేవాటిని తిరస్కరించడం జరుగుతుంది. ఇట్లాంటి చర్చలు మహాభారతములో ఎన్నో జరిగినట్లు విదితమౌతుంది.

1. తిక్కన, op. cit., ఉద్యోగపర్వము ప్రథమాశ్వాసము పద్యము 18 పుట 126
2. తిక్కన, op. cit., ఉద్యోగపర్వము ప్రథమాశ్వాసము పద్యాలు 31-32 పుటలు 163-64.

5.1.9. గోష్ఠి :

పక్ష ప్రతిపక్ష భావంలేక కేవలం తనకున్న అభిప్రాయము సరియైందో కాదో తేల్చుకోవడానికి చేసేది గోష్ఠి. ధర్మార్థకామాల తారతమ్యాన్ని గురించి విదురుడు, అర్జునుడు, భీముడు, నకుల సహదేవులు, ధర్మజుడు గోష్ఠి జరిపిన వృత్తాంతం శాంతిపర్వము తృతీయాశ్వాసములో (పద్యాలు 453-471 పుటలు 131-132) వర్ణించబడింది. 'పురుషార్థాలకు విద్య ఉత్తమ సాధన'మనే విభాగములో విదురాదులు ధర్మార్థకామాల తారతమ్యాన్నిగూర్చి తెలిపిన అభిప్రాయాలను వివరించడము జరిగింది. ఇచట వాటినే సంగ్రహంగా చెప్పవలసి ఉంది. విదురుడు పురుషార్థాలలో ధర్మము గొప్పదని సమర్థించినాడు. తరువాత నకుల సహదేవులు తమ అభిప్రాయాలను వ్యక్తముచేసినారు. అన్నింటికన్నా ముందు ధర్మాన్ని ఆచరించాలని, ధర్మయుక్తంగా అర్థాన్ని సంగ్రహించాలని, తరువాత కోరికలను తీర్చుకోవాలని ధర్మార్థకామాల సంబంధాన్ని గురించి వారు చెప్పినారు. పురుషార్థాలలో కామము ప్రధానమైనదని భీముడు సమర్థించినాడు. ధర్మరాజు వారి మాటలనువిని వారిని కలయజూచి ఇట్లా అన్నాడు. "ఏనడిగిన తెఱంగునకు విదురుని వాక్యంబు సిద్ధాంతంబు దక్కటివారి వచనంబులు నొక్కొక్కమెయి నాదరణీయంబులు."1 పురుషార్థాలలో మోక్షము ఉత్తమమైందని ధర్మరాజు తన అభిప్రాయాన్ని వారికి తెలిసినాడు. వారందరు ధర్మరాజును అభినందించినారు. ఆ గోష్ఠి ముగిసింది.

5.1.10. ఉపన్యాస పద్ధతి :

శ్రోతలను ఆకర్షించడానికి, వక్తవేదికనెక్కి చేసే ప్రసంగము ఉపన్యాసము. 'ఉప' అనే పదానికి 'సమీపము' అని అర్థము (ఉపసమీపే). 'న్యాసం' అంటే ఉంచడమని అర్థము, వక్త తనకు తెలిసిన విషయాన్ని శ్రోతల ముందుంచడము ఉపన్యాసమని చెప్పవలసి ఉంది. అనేక విషయాలను గురించి అల్పకాలములో శ్రోతలకు చెప్పడానికి ఉపన్యాస పద్ధతి ఉపయోగపడుతుంది. ఇది ఏకమార్గ ప్రక్రియ అని (one way process) ఈ పద్ధతి శ్రోతలకు విసుగును కలిగిస్తుందని కొందరు విమర్శించినా, సమర్థుడైన ఉపన్యాసకుడు శ్రోతలకు కలిగే సందేహాలను ముందుగనే ఊహించి తగిన విధంగా ఉపన్యాసాన్ని సాగిస్తే ఈ పద్ధతి వారిని ఆకర్షిస్తుంది.

1. తిక్కన, op. cit., శాంతిపర్వము తృతీయాశ్వాసము గద్యము 463 పుట 132

కౌరవపాండవభాగ పరిష్కారాన్ని గురించి, ద్రుపద పురోహితుడు, కృష్ణుడు కౌరవ సభలో, సంజయుడు ఉపప్లావ్యపురములో ధర్మరాజు పేరోలగములో ప్రసంగించినారు.

ద్రుపద పురోహితుని రాయబార వృత్తాంతము ఉద్యోగపర్వము, ప్రథమాశ్వాసములో (పద్యములు 223–257 పుటలు 182–184) వర్ణించబడింది. ద్రుపద పురోహితుడు మతిమంతుడు, చతురవచనుడు, సమయజ్ఞుడు, ఇంగితజ్ఞానము కలవాడు. అతడు సభలో ప్రవేశింపగానే విదురాదులు అతన్ని తగిన విధంగా పూజించి పాండవుల క్షేమమడిగినారు. ద్రుపదుపురోహితుడు పాండవుల కుశల వార్తను వారికి వినిపించి, వారి క్షేమ వృత్తాంతాన్ని తెలుసుకొని, సకల సైన్యాధిపతుల సమక్షములో తన ఉపన్యాసాన్ని ప్రారంభించినాడు. సభాసదులకు రాజధర్మము తెలియనిదికాదని, ఐనా తాను చెప్పవలసి వచ్చిందని, ధృతరాష్ట్ర పాండు భూపతులు సహోదరులని, పైతృకమైన ధనాన్ని అనుభవించే హక్కు వారికి, వారి బిడ్డలకు ఉంటుందని చెప్పినాడు. కౌరవులు తమ పైతృకమైన ధనాన్ని అనుభవించడం. పాండవులను భవించకపోవడానికి గల కారణమేమని సభాసదులను ప్రశ్నించినాడు. పాండవులు తమ పిత్రార్జితమైన ధనాన్ని అనుభవించకుండ, దుర్యోధనుడు వారికి బాధలను కలిగించడం పాండవులు ఆపదలను గడచి గట్టెక్కడం, పాండవులు తమ బల పౌరుషాలచే సంపాదించిన రాజ్యలక్ష్మిని మాయజూదంలో కాజేయడం, కౌరవులు పాండవులను అరణ్యాలకు పంపడం మొదలైన వాటిని గురించి ద్రుపద పురోహితుడు సభాసదులతో చెప్పినాడు. అతడు ధృతరాష్ట్రుని నిందించినాడు. యుద్ధమువల్ల ప్రజలందరికి నష్టము కలుగుతుందనే ఉద్దేశముతో పాండవులు కౌరవులపై పగపూనలేదని వారిని దుర్బలులుగా భావించరాదని ద్రుపద పురోహితుడు పలికినాడు. పాండవుల ధర్మతత్పరతను కొనియాడినాడు. తమకు పదకొండు అక్షౌహిణుల సైన్యమున్నదని గర్విస్తారేమోనని, భీముని భుజబలాన్ని, సాత్యకి సాహసాన్ని, అర్జునుని సమర కౌశలాన్ని గురించి చెప్పి కౌరవులను హెచ్చరించినాడు. అఖిల విద్యాజాల సంవేదియైన మాధవుడు పాండవుల పక్షమని, వారికి సాధ్యము కానిపని ఏదీలేదని నొక్కి వక్కాణించినాడు. ద్రుపద పురోహితుడు తన ఉపన్యాసాన్ని ముగించే సమయంలో చెప్పినమాటలను తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"అదను దప్పకుండ నమ్మహాత్ముల నెమ్మిఁ
బిలువఁబంచి హితముఁ బ్రియము రెండు

పక్షములకు నగుట పాటించి తగవు మైఁ
గొంత భూమి యిచ్చి కూడిమనుడు."1

ద్రుపద పురోహితుని ఉపన్యాసము విని భీష్ముడు తెలిపిన అభిప్రాయాన్ని తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"నీవాక్యము విప్ర స్వా
భావికమై యిట్లు శ్రుతికిబరుషంబైనన్
భావింపఁ గార్యమున యం
దే విధమున సభకు నింత యిష్టంబగునే."2

ద్రుపద పురోహితుడు తన ఉపన్యాసాన్ని సంగ్రహంగా తార్కిక పద్ధతిలో సాగించినాడు. అతని ఉపన్యాసానికి పారుష్యము ప్రధాన లక్షణమని భీష్ముని మాటలవల్ల విదితమౌతుంది.

సంజయుని రాయబార వృత్తాంతము ఉద్యోగపర్వము ప్రథమాశ్వాసములో (పద్యాలు 273–361 పుటలు 186–194) వర్ణించబడింది. సంజయుడు చతుర భాషణుడు ఎంతకఠినమైన విషయాన్నైనా మధురంగా చెప్పే శక్తి సంజయునికి ఉంది. ఉద్యోగ పర్వములోని ద్వితీయా శ్వాసములోని (291–302 పద్యాలు) పద్యాలనుబట్టి అతని ఉపన్యాస మాధుర్యము విదితమౌతుంది. ధర్మరాజు సంజయుని ఉపన్యాసాన్ని మెచ్చుకొన్న సందర్భములో తిక్కన వర్ణించిన పద్యమిది.

"ఎదురున్న రూపు పలుకగఁ
దుదిఁగటకటబడవు నీవు దుర్ణయమును బె
ట్టిదమును బెండునునగు పలు
కొదవదు నీ నాలుకకు నయోన్నత యెపుడున్."3

అహింసా ధర్మాన్ని పాటించి అడవులకు పొమ్మని సంజయుడు ధర్మరాజుతో చెప్పినాడు. కౌరవులు చేసిన చెడ్డపనులు ఎన్నో ఉన్నాయి. వాటిని సమర్థించడం కష్టం. సంజయుడు తాను అవలంబించదలచుకొన్న వైపునందలి వారిలోనున్న దోషాలను ముందుగ ఒప్పుకొన్నాడు. అట్లు ఒప్పుకొన్నందువల్ల సంజయుడు ఉదార

1. తిక్కన, op. cit., ఉద్యోగపర్వము 1వ ఆశ్వాసము పద్యము 241 పుట 183
2. భారతము, op. cit,. ఉద్యోగపర్వము 1వ అశ్వాసము పద్యము 243 పుట 183
3. ,, ,, ,, పద్యము 363 పుట 190

స్వభావము కలవాడని ఎదుటి వ్యక్తులు భావించడం జరుగుతుంది. కౌరవ పక్షానికి అనుకూలంగా వాదించడం కష్టం. ఐనా సంజయుడు అట్లా వాదించగలిగినాడు. ఇరు పక్షాలకు చెందినవారిని పొగడుచున్నట్లు పైకి కన్పిస్తుంది. కౌరవులను గట్టిగా పొగడడంలో అతని వ్యంగ్య చమత్కృతి వ్యక్తమౌతుంది. సంజయుని వ్యంగ్య చమత్కారాన్ని గుర్తించి దానికి తగిన పద్ధతిలోనే ధర్మరాజు సమాధాన మిచ్చినాడు. సంజయుని ఉపన్యాసము పైకి పసగా కనిపించినా, సారములేదని కృష్ణుడు దాన్ని ఖండించినాడు. ద్రుపద పురోహితుడు చెప్పిన విషయాన్నే సంజయుడు చెప్పినా వినడానికి ఇంపుగా ఉండేలాగా చెప్పినందువల్ల అతని ఉపన్యాసానికి చాతుర్యము ప్రధానమైన లక్షణమని చెప్పవలసి ఉంది.

కౌరవ సభలో కృష్ణుడు సాగించిన మొదటి ఉపన్యాసము ఉద్యోగపర్వము, తృతీయాశ్వాసములో (పద్యాలు 256-284 పుటలు 259-261) వర్ణించబడింది. దీనిలో రెండు భాగాలున్నాయి. 1. కృష్ణుడు ధృతరాష్ట్రునితో సంభాషించడం 2. పాండవులు చెప్పిన మాటలను ధృతరాష్ట్రునికి వినిపించడం. కృష్ణుడు తన ఉపన్యాసాన్ని ప్రారంభించి నప్పుడు చెప్పిన మాటలను తిక్కన ఇట్లా వర్ణించినాడు.

"జననాథ నీయెఱుంగని
పనులుగలవె యైనఁ దగవుఁ బరమ హితంబుం
దనవారికిఁ జెప్పన తగు
నని వచ్చితి భారతాన్వయము ప్రియమొందన్."1

"కౌరవులు పాండవులు పాలు నీరులాగా కలిసి మెలసి ఉండడం మంచిది. కౌరవులు వేరు పాండవులు వేరు అనే భేదభావము నీకు లేదుగదా! మీది భరత వంశము. మీ వంశము ధర్మము, న్యాయము, సత్యము, దయ మొదలైన సద్గుణాలకు నిలయమైనది. కానీ నీకుమారులు దుర్యోధనాదులు ధర్మార్థాల నిరాకరించి ఎన్నో దుష్కార్యాలు చేసినారు. వారికి బుద్ధి చెప్పవలసిన బాధ్యత నీది. నీవుపేక్షిస్తే సర్వ ప్రజలకు వినాశము కలుగుతుంది.

బలపరాక్రమ సంపన్నులైన పాండవులను ఎవ్వరూ జయించలేరు. నీ ప్రాభవాన్ని, శాంతిని, నీతిని, అందరూ మెచ్చుకొనేలాగా, నీ తమ్ముని బిడ్డలను నీ బిడ్డలను కాపాడుకొనడం నీ కర్తవ్యం." ఇది కృష్ణుని ఉపన్యాసము మొదటి భాగములోని సంగ్రహమైన విషయం. ఉపన్యాసములోని రెండవ భాగాన్ని

1. తిక్కన op. cit., ఉద్యోగపర్వము తృతీయాశ్వాసము పద్యము 256 పుట 259

సభాసదులకు వినిపిస్తూ, కృష్ణుడు, పాండవులు తండ్రి చచ్చిన బిడ్డలని, వారిని బాల్యమునుండి పెంచి ఇప్పుడు విడిచి పెట్టడం మంచిదికాదని, ధృతరాష్ట్రునితో చెప్పినాడు. సత్యధర్మాలను గురించిన పాండవుల అభిప్రాయాలను కృష్ణుడు సభా సదులకు వినిపించినాడు. పాండవ కౌరవులు ఎవరిభాగాన్ని వారు తీసుకొని దాన్ని సుఖంగా అనుభవిస్తూ ఉంటే వారిని చూచి బంధువులు మెచ్చుకుంటారని, హరి పలికినాడు. ధర్మరాజు సుగుణాలను గురించి ధృతరాష్ట్రునితో, ఆయన నుడివినాడు. మాయజూదంలో కౌరవులు పాండవ రాజ్యలక్ష్మిని కాజేయడం, నిండు సభలో ద్రౌపదిని అవమానించడం, వారిని అడవులకు పంపించడం మొదలైన కౌరవుల దుష్కార్యాలను గురించి కృష్ణుడు ధృతరాష్ట్రునితో చెప్పినాడు. దుర్యోధనుని లోభాన్ని మాన్పమని హెచ్చరించినాడు. "పాండవులు నీకు శుశ్రూష చేయడానికి సిద్ధంగా ఉన్నారు. మీకది ఇష్టము లేకపోతే యుద్ధము చేయడానికికూడ సిద్ధమే. రెండింటిలో ఏది తథ్యమో దాన్ని నిశ్చయించవలసిన బాధ్యత నీది' అని కృష్ణుడు ధృతరాష్ట్రునితో చెప్పినాడు. వాక్యోపవాక్యాల నిర్మాణములో. విషయ విభాగములో, ప్రతిపాద్య విషయాన్ని వివరించడంలో కృష్ణుని ఉపన్యాస నైపుణ్యము వ్యక్త మౌతుంది. ఇతరుల మనస్సును నొప్పించకుండా. ప్రియమూ, హితమూ, పథ్యమూ, సత్యమూ, మధురమూ, వ్యర్థముకానివీ, మితిమీరనివీ ధర్మహితములూ ఐన మాటలను సభలో పలకాలనే విషయాన్ని దృష్టిలో నుంచుకొని ఆయన తన ఉపన్యాసాన్ని శ్రోతలకు వినిపించినట్లు విదితమౌతుంది. ఒక విషయాన్ని గురించి సరిక్రొత్తగా, సంగ్రహంగా, స్పష్టంగా, రమ్యంగా ఉపన్యసించడం సులభమైన పనికాదు. ఉపన్యాసానికి ప్రయోజనముకూడా అవసరం. సంక్షిప్తత, స్పష్టత, రమ్యత, నవ్యత మొదలైన ఉపన్యాస లక్షణాలకు శ్రీకృష్ణుని ఉపన్యాసం లక్ష్యభూతమైంది. విషయముపై అధికారం, దాన్ని ప్రదర్శించే పద్ధతి, శారీరక సౌష్ఠవం. గంభీరమైన కంఠం, తగిన వేషం, భాష, సమయజ్ఞత, ఇంగితజ్ఞానం ఉపన్యాసకునికి అవసరం. కృష్ణుని మూర్తి మనోజ్ఞమైనది. ఆయన వాక్కు రమణీయమైనది. ఆయన స్వరూపాన్ని గురించి తిక్కన వర్ణించిన పద్యాలివి.

"అంబుద శుభగాత్రున్ బీ
తాంబర ధరుఁగమలదళ నిభాక్షున్ హరిఁ జూ
డంబడపి లోచనము లమ్ర
తంబానినమాడ్కి సమ్మదంబునఁ దేలన్.

ఆ కొలువువారు గర మచ
లాకృతి నొక పలుకులేక యందఱు వింజా
బాకిడిన కరణి నవశము
దాకారిత చిత్తవృత్తులై యుండంగన్.

జలదస్వన గంభీరత
నెలు గొప్పగ దంతదీప్తు లెసఁగ ముకుందుం
డలరు చెవుల నఖిల జనం
బులు విన ధృతరాష్ట్ర భూవిభున కిట్లయెన్."1

కృష్ణుడు ఉపన్యసించడానికి పూనుకొని వేదికపైకి రాగానే సభ అంతటా నిశ్శబ్దం ఆవరించింది. ఆయన ఉపన్యాసము తార్కిక పద్ధతిలో నడిచింది. పాండవ కౌరవ భాగపరిస్కార విషయమై తాను చెప్పదలచుకొన్న అంశాన్ని ఆయన మొదటనే సభాసదులతో చెప్పినాడు.

"క్షీరోదకగతి బాండవ
కారవుల లొడగూడి మనికి కార్యం; బది నీ
వారసి నడపుము వారన
పీరనఁ గురు ముఖ్య నీకు పేఱుంగలదే."2

దుర్యోధనునికి పెద్దలు చెప్పిన సంధిపలుకులు రుచించలేదు. ధృతరాష్ట్రుని ప్రార్థనపై కృష్ణుడు మరల దుర్యోధనునికి బుద్ధులు చెప్పడానికి పూనుకొనినాడు. అతడు వినలేదు. భీష్మద్రోణులు చెప్పిన మాటలనూ అతడు వినలేదు. మీదు మిక్కిలి 'యెవ్వరైన సంగ్రామమునన్ జయంబుగొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్' అని కఠినముగా మాటలాడినాడు. అప్పుడు కృష్ణుడు కినుకవహించినాడు. ఆయన 'పుండరీకాక్షుఁ డగుటెల్ల బోయిఁ అరుణ కమలాక్షు' డైనాడు. 'పుండరీకాక్షుడు' 'అరుణ కమలాక్షుడు' అను పదాలను కవి ప్రయోగించడమువల్ల కృష్ణుని ఉపన్యాసానికి సౌమ్యత, ఉగ్రత అనే రెండు లక్షణాలున్నట్లు బోధపడుతుంది. నారదాది దేవర్షులు, భీష్మాది రాజర్షులు, విదురాది నీతి నిపుణులు ఆయన

1. తిక్కన, op. cit., ఉద్యోగపర్వము 3వ ఆశ్వాసము పద్యాలు 245-256 పుట 259.

2. తిక్కన, op. cit., ఉద్యోగపర్వము 3వ ఆశ్వాసము పద్యము 258 పుట 259

ఉపన్యాసాన్ని మెచ్చుకొనినారు. ఇట్లాంటి ఉపన్యాస పద్ధతిని పాటించు ఆచార్యుడు అంతేవాసుల మెప్పును పొందగలుగుతాడు.

5.1.11. ప్రయోగపద్ధతి : (Experimental Method)

విద్యార్థికి సిద్ధాంత జ్ఞానమూ (theoritical knowledge), ప్రయోగ జ్ఞానమూ (practical knowlege) రెండూ ఉన్నప్పుడే విద్యాధ్యయన ఫలము సిద్ధిస్తుంది. విద్యార్థి ఒక శాస్త్రంలోని విషయాలను గ్రహించి, ఆ విషయాలను ప్రయోగాలద్వారా (Experiments) అనుభవానికి తెచ్చుకోవలసి ఉంటుంది. మహాభారతంలోని ఆచార్యులు, రాజకుమారులు పన్నిన వ్యూహాలు, చేసిన యుద్ధాలు వారి ప్రయోగజ్ఞానాన్ని తెలుపుతూ ఉన్నాయి. ఒక ప్రయోగ పద్ధతిని గురించి పరిశీలించడం అవసరం. కౌరవ పాండవులు ద్రోణాచార్యుల దగ్గర ధనుర్విద్యా విషయాలను, అస్త్ర శస్త్ర విద్యలను మొదలైనవాటిని అభ్యసించిన వృత్తాంతాన్ని గురించి 'గురువులు - శిష్యులు వారి పరస్పర సంబంధము' అనే ప్రకరణంలో చెప్పడం జరిగింది. ద్రోణుడు తన శిష్యులను పరీక్షించాలని ఒక ప్రయోగాన్ని ఏర్పాటు చేసినాడు. అది వారి ధనుర్విద్యా కౌశలాన్ని తెలుసుకోవడానికి చేసిన ప్రయోగము. ద్రోణుడు ఒక చెట్టుపై కృత్రిమమైన పక్షిని ఒకదాన్నిపెట్టి దాని తలను తెగవేయుమని శిష్యులను నియోగించినాడు. ఒక్కొక్క శిష్యుడే ఆచార్యుని పిలుపుపై అచటికివచ్చి అతడు ఎప్పుడు బాణాన్ని ప్రయోగించమంటే అప్పుడు బాణాన్ని ప్రయోగించడానికి సిద్ధంగా ఉండాలని చెప్పినాడు. ద్రోణుడు ధర్మరాజును పిలిచినాడు. ఆ సందర్భములో ఆతడు ధర్మరాజుతో పలికిన మాటలను నన్నయ ఇట్లా వర్ణించినాడు.—

"వృక్ష శాఖాగ్రమున నున్న పక్షిశిరము
దెల్లముగఁ జూచితే మహీవల్లభుండ
యనిన విమ్మగ జూచితి ననిన వెండి
యును గురుడు ధర్మజున కిట్టులనియెఁ బ్రీతి.
జననుత యా గ్రమానిని న
న్నును మఱి నీ భాతృవరులనుం జూచితె నీ
వనవుడుఁ జూచితి నన్నిటి
ననఘా వృక్షముననున్న యవ్విహగముతోన్."1

1. నన్నయ, op. cit., ఆదిపర్వము పంచమాశ్వాసము పద్యాలు 249-250 పుట 317

—అప్పుడు ద్రోణుడు, ధర్మరాజుతో, "నీ దృష్టి చెదరె, దీని నీవు వేయనోపవు పాయుము" అని పలికినాడు. దుర్యోధనుడు మొదలైన కౌరవులు, భీమసేన నకుల సహదేవులు, నానాదేశాలనుండి వచ్చిన రాజపుత్రులు పక్షిని గురిపెట్టి కొట్టబోవు నప్పుడు ఎదుటనున్నవారు కనబడుచున్నారని చెప్పినందువల్ల వారిదృష్టి చెదరిందని ద్రోణుడు వారిని నిందించినాడు, అర్జునుడు తదేక దృష్టితో చూచుటవల్ల పక్షి శిరస్సు తప్ప వేరొకటి ఏదియు కనిపించలేదని ఆచార్యునితో చెప్పినాడు. అర్జునుని దృష్టి లక్ష్యము పైననే ఉన్నదని గ్రహించి, ఆచార్యుడు అర్జునునితో బాణాన్ని ప్రయోగించమని చెప్పినాడు. అతడు బాణాన్ని ప్రయోగించినాడు. వెంటనే పిట్టతల తెగి నేలపై పడింది, ద్రోణుడు, అర్జునుని లక్ష్య భేదిత్వాన్ని మెచ్చుకొని అతనికి ధనుర్వేద రహస్యాలను ఉపదేశించినాడు. విద్యార్థులచే, ఆయాశాస్త్రాలకు చెందిన ప్రయోగాలు చేయించడంవల్ల వారికి అనుభవ జ్ఞానము కలుగుతుంది.

### 5.1.12. బోధన దశలు :

ఆచార్యుడు, శిష్యులకు పాఠ్యాంశాలను బోధించడం ఒక క్రమ పద్ధతిలో జరుగవలసి ఉంటుంది. ఆ సమయంలో గురువు కొన్ని బోధన దశలను అనుసరించడం జరుగుతుంది. సూతుడు శౌనకాది మహామునులకు నైమిశారణ్యములో భారత కథను వినిపించడంలో ఒక క్రమ పద్ధతిని పాటించినట్లు విదితమౌతుంది. అతడు రోమహర్షణుని కుమారుడు. అతడు వైశంపాయనునివల్ల భారత కథను విన్నాడు, అతడు తీవ్రమైన వినికి కలవాడు, ఉపనిషత్తుల రహస్యాలను తెలుసు కొన్నవాడు. సాధారణంగా బోధన రీతులు గురువునుండి శిష్యునికి సంక్రమిస్తూ ఉంటాయి. వైశంపాయనుడు, భారత కథను మునులకు వినిపించే సమయములో పాటించిన రీతి, ఉగ్రశ్రవసునికి సంక్రమించి నందువల్ల, అతడు శౌనకాది మునులకు భారత కథను చెప్పే సమయములో ప్రరోచనాది దశలను పాటించినాడు. అవి ఇరు, 1. ప్రరోచనం 2. ప్రతిపాదనం 3 సమన్వయం 4. అవధారణం 5. సాధార ణీకరణం 6, అనుభవం.

#### 5.1.12.1. ప్రరోచనం:

స్థలము నైమిశారణ్యము. అది విద్యాధ్యయనానికి అనుకూలంగా ఉండేచోటు. కథకుడు ఉగ్రశ్రవసుడు. మునులు శ్రోతలు. ఉగ్రశ్రవసునికి బోధ్య విషయముపై

అధికారమున్నది. దాన్ని బోధించే పద్ధతికూడ అతనికి తెలిసినదే. సూతుడు మొదట వారి కుశల వృత్తాంతమును తెలుసుకొని, ఏ ఇతిహాసాన్ని గురించి చెప్పాలో ఆజ్ఞాపించమని శౌనకాది మునులను అడిగినాడు. వారు, భారత కథను వినిపించమని అతన్ని కోరినారు. ఆయన వాసుదేవునికి, వ్యాసునికి నమస్కారాలర్పించి భారత కథను వారికి వినిపించడానికి పూనుకొనినాడు. భారతం నిఖిలజ్ఞానసాధకం, సకల వేదార్థసారం, సర్వలక్షణ సమన్వితం, సకలార్థ ప్రదాయకం అని స్తుతించినాడు. భారతంలోని లక్ష శ్లోకాలలో ఎనిమిదివేల ఎనిమిదివందల శ్లోకాలకు అర్థం వ్యాస శుకులకు తప్ప ఇతరులకు తెలియదని, సంజయునికి కూడా ఆ శ్లోకాలలోని అర్థం తెలుసునో తెలియదో సందేహమని సూతుడు వారితో చెప్పినందువల్ల భారతం మహిమాన్వితమని, భారతకథను వినాలని శౌనకాది మహామునులకు కుతూహలము కలిగింది. ఇది ప్రరోచనదశ.

5.1.12.2. ప్రతిపాదనం :

సూతుడు శౌనకాదులకు భారతానికి సంబంధించిన వివిధ ధర్మాలను ఉపాఖ్యానాల ద్వారా వివరించడానికి పూనుకొనినాడు. అతడు సమష్టి - వ్యష్టి పద్ధతిని దృష్టిలోపెట్టుకొని మునులకు భారతకథను వినిపించినాడు. అతడు వారికి భారత కథను మొదట సంగ్రహంగాచెప్పి తరువాత ఒక్కొక్క పర్వములోని విషయాన్ని వివరించినాడు. ఇది ప్రతిపాదన దశ.

5.1.12 3. సమన్వయం :

భారతంలోని కథాంశాలన్నీ ధర్మంలో సమన్వితం కావాలనే ఉద్దేశంతో వేదవ్యాసుడు భారతాన్ని రచించినాడు. అర్థకామాలు ధర్మవిరుద్ధాలైతే మానవునికి పతనం తప్పదని, అవి ధర్మబద్ధాలైతేనే మానవునికి అభ్యుదయం కల్గుతుందని ఆయన సూచించినాడు. కాబట్టి భారతములో ధర్మమే సమన్వయ స్థానంగా కనిపిస్తుంది. ధర్మం భేదరూపమే. అభేదమైన మోక్షం దానికి సమన్వయ స్థానమౌతుంది. ఇట్లా అర్థకామాలద్వారా ధర్మాన్నీ, ధర్మంద్వారా మోక్షాన్ని మానవుడు అందుకోవాలనే ఉద్దేశంతో భారతంలోని కథలను అన్నింటినీ పరమ పురుషార్థంతో ముడిపెట్టడం వ్యాసుడు సాధించిన మహాసమన్వయం (Grand synthesis)· దీనికి అనుగుణంగానే సూతుడు శౌనకాది మునులకు భారత కథార్థాన్ని వివరించినాడు.

5.1.12.4. అవధారణం :

భారతంలోని విద్యార్థులలో ధర్మరాజు వృత్తాంతాన్ని పరిశీలించడంవల్ల అతని సంస్కార మెలాంటిదో తెలుస్తుంది. ధర్మరాజు భీష్మునివల్ల ప్రవృత్తి నివృత్తి ధర్మాలను గురించి విని మనస్సుకు పట్టించుకోవడంవల్ల అతనికి సంస్కారము కలిగింది. అతడు దారుణ సంగ్రామకృత విషాదాన్ని పరిత్యజించి ఆత్మబలంతో రాజ్యపాలన చేసినాడు. కృష్ణుని ఆదేశాన్ని శిరసావహించి అశ్వమేధయాగాలు చేసినాడు. సత్కర్మలన్నిటిలోను అశ్వమేధ యాగమే పరాకాష్ఠ. సత్యలోక ఫలితాన్ని ఇచ్చేది అదే. దీనితో ఉత్తమ క్షత్రియుడు చేయవలసిన కార్యమంతా నిర్వర్తించినట్లైంది. ఇది అవధారణం.

5.1.12, 5 : సాధారణీకరణం,

రాజ్యపరిపాలన అనంతరం ధర్మరాజు మనఃప్రవృత్తి సాధారణీకరణంవైపు మరలింది. అప్పటికి కౌరవులందరు నశించినారు, పాండవ బలంకూడా చాలవరకు నిర్మూలమైంది యాదవులుకూడా అన్యోన్య కలహంతో అహంకరించినట్లు వార్త అందింది. ధర్మరాజు చివరకు కృష్ణుని మరణ వార్తను విన్నాడు. పెద్దలైన గాంధారీ ధృతరాష్ట్రులు, విదురుడు మొదలైనవారు చనిపోయినారు. ధర్మరాజుకు వైరాగ్యం కలిగింది. ప్రతి మానవునికి కలిగే జనన మరణాలు, సుఖదుఃఖాలు తనకూ తప్పవని గ్రహించి తదనుగుణంగా విశ్వధర్మాన్ని వ్యక్తి ధర్మంగా పాటించడం సాధారణీకరణం. ఆ దృష్టి ఏర్పడడంవల్లనే చివరకు ధర్మరాజు ద్రౌపదీ సోదర సహితంగా మహాప్రస్థానానికి బయలుదేరినాడు. ప్రస్థానం విశేషదృష్టి. మహాప్రస్థానం సాధారణ దృష్టి. ధర్మరాజు అంతిమ యాత్రలో ఇది మనకు బోధపడుతుంది.

5.1.12.6. అనుభవం :

మహాప్రస్థానమైన తరువాత స్వర్గారోహణ పర్వంలో జరిగిన వృత్తాంతంవల్ల మానవుని చరమానుభవమేమిటో స్పష్టంగా తెలుస్తుంది. సృష్టిలో తానూ ఒక సాధారణ వ్యక్తినేనని బయలుదేరిన ధర్మరాజు ఇక వెనుదిరిగి చూడలేదు. భార్యయైన ద్రౌపదినిగాని, సోదరులైన సహదేవాదులుగాని పడిపోయినప్పటికిని పట్టించుకోలేదు. అట్లా ముందుకు సాగిపోయే దృఢనిశ్చయమే అనుభవానికి మార్గం. ఈ మార్గంలో

అతన్ని అనుసరించింది లౌకికమైన వస్తువేదీకాదు. ఒక్క విశ్వాసం మాత్రమే. ఆదే అతని వెంట వచ్చిన శునకం. అదికూడా శునక రూపంలో ప్రచ్ఛన్నుడైన ధర్ముడే. తాను చేసిన ధర్మఫలం తనను అనుసరించివచ్చింది. తరువాతి ఆముష్మిక జీవితం దీనిపై ఆధారపడి ఉంటుంది. దేవతలు విమానాన్ని తీసుకొనిరావడం. దాన్ని ఎక్కి అతడు దేవలోకాలకు వెళ్ళడాన్నిబట్టి మర్త్యుడు దివ్యత్వాన్ని సాధించడమనే ఆఖరి అనుభవం ఇందులో వ్యక్తమౌతుంది, ('మృత్యోర్మా అమృతంగమయ') అమృతత్వమే చివరకు మర్త్యునికి కలగవలసిన అనుభవం. అది మనకు ధర్మరాజు చేరిన స్వర్గ ప్రవేశంలో సూచింపబడింది. ధర్మరాజు జీవిత రహస్యాలను తెలుసుకొనగలిగితే భారత కథ అంతా అర్థమయినట్లే, ధర్మంతో విరాజిల్లే వాడెవడో వాడే ధర్మరాజు. ధర్మనిర్వహణ తత్పరుడైన వాడే పరిపూర్ణుడైన మానవుడు. అట్లాంటి పౌరులను సృష్టించడానికి మన విద్యా విధానము తోడ్పడవలసి ఉంది.

బోధన పద్ధతులెన్ని ఉన్నా, శిష్యుడు గురువునుండి పరిపూర్ణమైన జ్ఞానాన్ని పొందడానికి వీలుపడదు. శిష్యుడు ఏయేమార్గాలలో సనాతన విద్యను ఆర్జిస్తాడో వాటినిగురించి మహాభారతంలో ఇట్లా చెప్పడం జరిగింది.

"కాలేనపాదం లభతేతథార్థం తతశ్చపాదంగురు యోగతశ్చ
ఉత్సాహ యోగేనచ పాదమృచ్ఛేత్ శాస్త్రేణపాదంచ తతోఽభియాతి"1

సనాతన విద్యలో ఒక పావలా భాగాన్ని మానవుడు సమయ బలంతోను, ఒక పావలా భాగం గురువునుండి, కొంత ఉత్సాహయోగంతోనూ, కొంత పరస్పర శాస్త్ర విచారంతోనూ గ్రహిస్తాడు. కాలం కలిసిరావడం, మంచి గురువు దొరకడం, విద్యార్థికి ఉత్సాహం ఉండడం, సహపాఠకులతో అతడు విషయాన్ని గురించి చర్చించడం బ్రహ్మవిద్య పట్టుపడడానికి కారణాలని దీనివల్ల విదితమౌతుంది. లౌకిక విద్యను పొందడానికికూడ పై పద్ధతులు ఉపకరిస్తాయి గురువు లేకపోయినా ప్రకృతినుండిగాని ప్రకృతిలో నివసించే ప్రాణులనుండిగాని ఉపదేశాన్నిపొందినవారు ఉంటారని, బోధ్యుడనే ఋషి యయాతికి వినిపించిన వృత్తాంతం క్రింది శ్లోకంలో వర్ణించబడింది,

1. తిక్కన op. cit., ఉద్యోగపర్వము శ్లోకము 16 పుట 2|85

"పింగళా కురరః సర్పః సారంగాన్వేషణం వనే
ఇషుకారః కుమారీచచ షడేతే గురవోమమ"[1]

పింగళ అనే వేశ్యవల్ల ఆశను త్యజించే పద్ధతిని, క్రౌంచ పక్షివల్ల భోగాలను వదలిపెట్టే మార్గాన్ని, పరకృతమైన వేశ్మంలో ప్రవేశించి సుఖజీవనం సాగించే పామును చూచి ఇంటిపైనుండే మమకారాన్ని తొలగించుకొనే ఉపాయాన్ని, సారంగమనే పక్షివల్ల ఇతరులకు ద్రోహము చేయకూడదనే నీతిని, బాణాలను తయారుచేసే వానినుండి ఏకాగ్రచిత్తముయొక్క విశిష్టతనూ, కుమారినుండి ఒంటరిగా ఉండడం మంచిదనే నీతిని, బోధ్యుడు గ్రహించినాడు. అందువల్ల అవి గురువులని చెప్పడం జరిగింది.

సంజయుడు వ్యాసుని అనుగ్రహంవల్ల దూరశ్రవణ దూరదర్శనాది శక్తులను పొంది కురుక్షేత్ర విషయాలను గచ్ఛుత్ వ్యాఖ్య పద్ధతిలో ధృతరాష్ట్రునికి వినిపించడం, భారతంలోని కొన్ని సమస్యలు ఆకాశవాణి వినిపించడంవల్ల పరిష్కరింపబడడం ఆశ్చర్యాన్ని మనకు కలిగిస్తాయి.

ఆనాటి ఆశ్రమాలలో విద్యాబోధనలో అనుసరింపబడిన బేసిక్ విద్యా విధాన పద్ధతి, సమస్యాపూరితమైన ఒక కార్యాన్ని దాని సహజ స్థావరంలో పూర్తి చేయడమనే లక్షణానికి లక్ష్యంగా నిలిచిన ద్వాదశ వార్షిక సత్రయాగ పద్ధతి, విద్యార్థి ఆడుచూ, అధ్యయనాన్ని సాగించాలనే పరమార్థాన్ని తెలిపే క్రీడా పద్ధతి మొదలైన బోధన పద్ధతుల గురించి మహాభారతంలో ఆయాసందర్భాలలో చెప్పడం జరిగింది. ఒక్కొక్క బోధన పద్ధతిలో కొన్ని గుణాలు, కొన్ని దోషాలు ఉంటాయి. సమయాన్నిబట్టి, విద్యార్థుల మానసిక శక్తులను దృష్టిలో ఉంచుకొని, పాఠ్యాంశాలపై మాపునిలిపి, ఏయే పద్ధతులను పాటిస్తే బోధన సమర్థంగా ఉంటుందో ఆయా పద్ధతులను ఆచార్యుడు పాటించవలసి ఉంది. బహుదేశాటనం, బహుశ్రుతులతో నిరంతర సాంగత్యం, బహుకాల రాజాస్థాన సేవనం, కావ్యశాస్త్ర విచారం వ్యక్తికి వివేకాన్ని కలిగిస్తాయి. పాండవులు ఎన్నో ప్రదేశాలను తిరిగినారు. బహుశ్రుతులతో వారికి సాంగత్యం కలిగింది. విరటుని కొలువులో ఒక్క సంవత్సరం కాలము గడిపినారు. వారు శాస్త్ర చర్చకావించినారు. వారు జ్ఞానాన్ని ఆర్జించినారు.

---

[1] తిక్కన op. cit., శాంతిపర్వము శ్లోకము 7 పుట 4880

# 6. మహాభారతములోని విద్యా సంస్కారాదులు

6. 1. ఉపనయనము :

ఒక శిలను శిల్పంగా మార్చడానికి ఎంతో పరిశ్రమ అవసరము, అట్లే పుట్టువుచే శూద్రుడైన మానవుడు సంఘానికి ఉపయోగపడే వ్యక్తిగా రూపొందాలంటే అతనికి ఎన్నో సంస్కారాలు జరుగవలసి ఉంటుంది. R B. పాండే సంస్కార శబ్దవ్యుత్పత్తిని, ఆశబ్దానికి ఉండే నానార్థాలను గురించి ఇట్లా చెప్పినాడు.

"The sanskrit word samskara is derived from the root 'Kr' with the prefix, 'Sam' and suffix, 'Ghan' added and is used in different senses. ............In clasical sanskrit literature, samskara has the sense of education, cultivation, perfection, training, refinement, grammatical purity, polishing embellishment, purificatory rites."1

'కృ' ధాతువుకు 'సం' అనే ఉపసర్గ, ఘఞ్ అనే ప్రత్యయము చేరడము వల్ల సంస్కారమనే శబ్దమేర్పడింది. సంస్కార శబ్దానికి అనేకార్థాలున్నాయి. లౌకిక సంస్కృత వాఙ్మయములో దీనికి అధిగమనము, అభ్యసనము, పరిపూర్ణత, శిక్షణ, శోధనము, శబ్దశుద్ధి, మార్జనము, పరిష్కరణము, జాతకర్మాది సంస్కారాలు అనే అర్థాలున్నాయి. సంస్కారము ఏ వ్యక్తికైనా, ఏ పదార్థానికైనా రెండు విధాలుగ ఏర్పడుతుంది. ఒకటి అనులోమ పద్ధతి. రెండవది ప్రతిలోమపద్ధతి. గుణాధానము అనులోమము. దోషాపనయనము ప్రతిలోమము నిషేకాదిశ్మశాన పర్యంతము మానవునికి జరుగవలసిన సంస్కారాలు చాలా ఉన్నాయి. వాటిలో ఉపనయనము, సమావర్తనము, విద్యకు సంబంధించిన సంస్కారాలు, 'ఉప' సమీపే, వటుని గురువు సమీపానికి తీసుకపోవడాన్ని ఉపనయనమంటారు. తల్లిదండ్రులనుండి భౌతిక జన్మను పొందిన వ్యక్తి, జ్ఞానాన్ని సంపాదించడము కోసము గురువు దగ్గరికి వెళ్ళవలసి ఉంటుంది. ఉపనయన సంస్కారము ఏ యే వర్గాలవారికి ఎన్నో యేట జరగాలో ఆ విషయాన్ని గురించి మను ధర్మశాస్త్రంలో ఇట్లా చెప్పబడింది,

"గర్భాష్టమేఽబ్దేకుర్వీత బ్రాహ్మణస్యోప నాయనమ్
గర్భాదేకాదశే రాజ్ఞో గర్భాత్తు ద్వాదశేవిశః"1

---

1. The cultural Heritage of India, Volume II, Page 390 the Ramakrishna Mission Institute of culture, Calcutta-29. 1962.

1. కుల్లూకభట్టు, op. cit., పుట 36 శ్లోకము 36

బ్రాహ్మణులకు ఎనిమిదవయేట, క్షత్రియులకు పదకొండవయేట, వైశ్యులకు పంద్రెండవయేట ఉపనయనము జరుగవలసి ఉంది. కొన్ని అనివార్యమైన కారణాలవల్ల వారికి ఆయా వయస్సులలో, ఉపనయనము జరుగకపోతే వారిని 'వ్రాత్య'లను పేరుతో సంఘమునుండి వెలివేయడము జరిగేది. ఉపనయనాన్ని పొందేవ్యక్తి చివరిసారిగా తల్లిపొత్తున భుజించవలసి ఉంది. అతడు కౌపీనాన్నీ, మేఖలను, యజ్ఞోపవీతాన్ని ధరించాలి. అజినము, దండముకూడా అతనికి అవసరము. ఉపనయన సంస్కార సమయములో గురువు వటునికి గాయత్రి మంత్రాన్ని ఉపదేశిస్తాడు. వటుడు సూర్యుని దర్శించాలి. వ్యక్తిచేసే ప్రతిపనికి సూర్యభగవానుడు సాక్ష్యమని., అందువల్ల విద్యార్థి మంచి పనులనే చేయాలని చెప్పడానికి గురువు శిష్యునిచే అట్లా చేయించేవాడు. ఉపనయన సమయంలో గురువు విద్యార్థి వక్షస్థలాన్ని స్పృశించడము, విద్య హృదయగతము కావాలని, ఆచార్యునికి అంతే వాసికి సత్సంబంధము ఉండాలని చెప్పడముకోసమే. ఈ సంస్కారము జరిగే సమయములో విద్యార్థిని బండమీదికి ఎక్కించడము జరుగుతుంది. జీవితములో అతడు ఉన్నత స్థానాన్ని పొందాలని చెప్పడానికి గురువు శిష్యునిచే ఆ పనిని చేయించేవాడు ఉపనయనం జరిగే సమయములో గురువు శిష్యునిచేతిని పట్టుకోవడము జరుగుతుంది. విద్యార్థిని సంరక్షించే భారాన్ని తాను వహిస్తున్నానని చెప్పడానికి గురువు అట్లా చేసేవాడు. ఉపనయన సంస్కారము ముగిసిన తరువాత, జలము స్వీకరించమని, తన ధర్మాన్ని తాను నిర్వర్తించాలని, పగటిపూట నిద్ర పనికిరాదని, మౌనము అవలంబించమని, గురువుయెడ వినయముతో ప్రవర్తించాలని, వేదాధ్యయనాన్ని పాటించాలని, ఉదయము సాయంత్రము భిక్షకు వెళ్లాలని, అన్ని కార్యాలు నిర్వర్తించాలని, బ్రహ్మచర్యాన్ని పాటించాలని, గురువు, శిష్యుని ఆదేశించేవాడు. ఉపనయనము జరిగిన తరువాత వటుడు వేదాధ్యయనాన్ని ప్రారంభించవలసి ఉంటుంది. అధ్యయనము పూర్తి ఐన తరువాత, అతడు గృహస్థాశ్రమాన్ని స్వీకరించడానికి ముందు, ఆచార్యుడు శిష్యునికి సమావర్తన సందేశాన్ని వినిపించడము జరుగుతుంది.

6.2. సమావర్తనము :

సమావర్తన సమయములో గురువు, శిష్యునికి వినిపించిన సందేశము ఇట్లా వర్ణించబడింది.

(తైత్తిరీయోపనిషత్తులో) "సత్యంవద, ధర్మంచర, స్వాధ్యాయాన్ మా ప్రమదః. ఆచార్యాయ ప్రియంధనమాహృత్య ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః సత్యాన్న ప్రమదితవ్యమ్. ధర్మాన్న ప్రమదితవ్యమ్. కుశలాన్న ప్రమదితవ్యమ్ భూత్యై న ప్రమదితవ్యమ్ స్వాధ్యాయప్రవచనాభ్యాంన ప్రమదితవ్యమ్ దేవపితృకార్యాభ్యాంన ప్రమదితవ్యమ్ మాతృదేవోభవ, పితృదేవోభవ ఆచార్యదేవోభవ అతిథిదేవోభవ యాన్యనవద్యాని కర్మాణి తానిసేవితవ్యాని యాన్యస్మాకం సుచరితాని తానిత్వయో పాస్యాని"1

సత్యము చెప్పాలని, వేదవిహిత కర్మలనాచరించాలని. వేదాధ్యయనములో ప్రమాదముకూడదని, ఆచార్యునికి ప్రియమైన దక్షిణను సమర్పించి గృహస్థాశ్రమాన్ని స్వీకరించుమని, సంతానాన్ని పొందుమని, సత్యము ధర్మము ఆరోగ్యము సంపాదనము అధ్యయనము అధ్యాపనము, వీటిలో సోమరితనము కూడదనీ, ఆచార్యుడు, శిష్యుని, సమావర్తన సమయములో ఆదేశించేవాడు. అంతేకాదు దేవతలనూ, విద్వాంసులనూ, మాతాపితలనూ, ఆచార్యులనూ, అతిథులనూ దైవ సమానులుగా భావించాలని, మంచిపనులను ఆచరించాలని, చెడుపనులను వర్జించాలని ఆచార్యుని ఆచరణములోని మంచిని గ్రహించి జీవితములో దాన్ని ఆచరించాలని చెప్పడము జరిగేది.

## 6 3 గురుదక్షిణలు :

విద్యార్థులు గృహస్థాశ్రమాన్ని స్వీకరించడానికి ముందు ఆచార్యులకు దక్షిణలను సమర్పించిన సంఘటనలు మహాభారతములో ఉన్నాయి. గురువుకుగాని. గురుపత్నికిగాని ప్రియమైన వస్తువును సమర్పించి శిష్యుడు తన ఋణాన్ని తీర్చు కోవాలనేది ఆనాటి ఆచారము శిష్యులలో కొందరు గురువుకు సేవచేసి దక్షిణలు ఇవ్వకుండ దానితోనే తృప్తిపడిన వారున్నారు. ఆచార్యునికి దక్షిణను సమర్పించినా, సేవచేసినా విద్యార్థికి అహంకారము ఉండకూడదు. గురువుగాని, గురుపత్నిగాని కోరిన వస్తువులను దక్షిణగా ఇవ్వడానికి శిష్యులు ఎన్నో కష్టాలను ఎదుర్కొనవలసి వచ్చేది. అందువల్ల జీవితములోని కష్టనష్టాలను గుర్తించడములో వారికి అనుభవపూర్వకమైన జ్ఞానము కలిగేది.

---

1. గోపదేవ్, పండిత, తైత్తిరీయోపనిషత్తు (ఆంధ్రటీకాతాత్పర్యోపేతము) ఆర్యసమాజము, కూచిపూడి గుంటూరు జిల్లా. 1979

ఉదంకుడు గురుపత్ని ఆదేశాన్ని అనుసరించి పౌష్యుని భార్య ధరించిన కుండలాలను దక్షిణగా గురుపత్నికి సమర్పించాలని తీసుకొని వస్తుంటే, అతనికి ఒక జలాశయము కనిపించింది. ఉదంకుడు, కుండలాలను ప్రక్కనపెట్టి సంధ్య వార్చుకొంటూ ఉంటే, తక్షకుడనే నాగరాజు వాటిని తీసుకొని నాగలోకానికి వెళ్లడము, పర్జన్యుని దయవల్ల ఆ కుండలాలు మరలా దొరకడము, వ్రత సమయానికి గురుపత్నికి వాటిని సమర్పించాలనే ఉద్దేశంతో దివ్య పురుషుని అనుగ్రహముతో మనో వేగాన్ని మించిన వేగముతో ప్రయాణముచేసి, గురువుయొక్క గృహాన్ని చేరడము, గురుపత్నికి చెవుల పోగులను సమర్పించడము ఎంతో సాహసోపేతమైన కార్యము. అతడు గురుపత్నికి దక్షిణను సమర్పించి గురువు అనుగ్రహానికి పాత్రుడైనాడు. పైలుడు ఉదంకుని దీవించిన వృత్తాంతాన్ని గురించి నన్నయ వర్ణించిన పద్యమిది.

"కరమిష్టము సేసితిమా
కరి సూదన దీన నీకునగు సత్ఫలముల్
గురుకార్య నిరతులగు స
త్పురుషులకగు టరుదెయధిక పుణ్యఫలంబుల్"1

ఏకలవ్యుడు ద్రోణుని ఖ్యాతిని గూర్చి విని, విలు విద్యను నేర్చుకొనడానికి అతని దగ్గరకు వచ్చినాడు. నిషాదులకు ప్రవేశములేదని చెప్పి ద్రోణుడు ఏకలవ్యుని శిష్యుడుగా గ్రహించలేదు. ఏకలవ్యుడు అరణ్యానికి వెళ్లి మట్టితో ద్రోణుని బొమ్మనుచేసి, దానినే గురువుగా భావించి స్వయం కృషితో విలువిద్యను అభ్యసించినాడు. కురుపాండవులొకమారు ఏకలవ్యుడున్న అరణ్యానికి వేటకు వచ్చినారు. వారికుక్క ఏకలవ్యునిచూచి మొరిగింది. ఆశబ్దాన్ని విని ఏకలవ్యుడు "దానిముఖంబునం డేడు బాణంబు లొక్కటఁ దొడిగి యక్కజంబుగానతి లాఘవంబున" వేసినాడు. కుక్క వారిదగ్గరకు వెళ్లింది. దానిపై బాణాలను వేసిన వానికోసము వెదకి, వారు ఏకలవ్యుని చూచినారు. అతని ధనుర్విద్యా నైపుణ్యానికి, వారు ఆశ్చర్యపడినారు. తనకంటె మిన్నయైన ధనుర్ధారుని, ఏకలవ్యుని చూచి బాధపడే ప్రియశిష్యుడైన అర్జునునికోసము, ద్రోణుడు, ఏకలవ్యుని కుడిచేతి బొటన వ్రేలిని దక్షిణగా కోరినాడు. ఏకలవ్యుడు కుడిచేతి బొటనవ్రేలిని కోసి భక్తితో ద్రోణునికి దక్షిణగ సమర్పించినాడు. అతడు విలువిద్య కలిమికి హీనుడైనాడు.

---

1. నన్నయ op. cit., ఆదిపర్వము, ద్వితీయాశ్వాసము, పద్యము 6 పుట 55

ద్రోణుడు తనకు గురుదక్షిణగ ద్రుపదుని పట్టితెమ్మని తన శిష్యులను కోరినప్పుడు, దుర్యోధనాదులు, ద్రుపదుని బంధించి తీసుకొని రావలెనని వెళ్లి అతని చేతిలో ఓడిపోయినారు. అర్జునుడు ఆచార్యుని కోరికను తీర్చడానికి సంసిద్ధుడైనాడు. భీముడు సైన్యాధిపతిగ, నకుల సహదేవులు చక్ర రక్షకులుగ, అర్జునుడు ద్రుపదునిపై యుద్ధానికివెళ్లి అతన్ని ఓడించి, బంధించి, తీసుకొనివచ్చి ద్రోణాచార్యుని ముందు పడవేసినాడు.

గాలవుడు విశ్వామిత్రుని శిష్యుడై, అధ్యయనము ముగిసిన తరువాత, గురుదక్షిణను ఇవ్వాలనే తన కోరికను గురువుకు వినిపించినాడు. అతడు గురుదక్షిణ వద్దని శిష్యునితో చెప్పినాడు. ఏదో ఒక దక్షిణను కోరుకొమ్మని గాలవుడు విశ్వామిత్రునితో చెప్పినాడు. విశ్వామిత్రుడు, శిష్యుని భక్తిని పరీక్షించాలనే ఉద్దేశముతో, శరీరమంతా తెలుపురంగులో ఉండి, చెవిమాత్రము నీలిరంగులో ఉండే అపరూపమైన ఎనిమిదివందల గుర్రాలను దక్షిణగా ఇమ్మని కోరినాడు. గాలవుడు వాటికోసము వెదకినాడు. అలాంటి గుర్రాలు అతనికి కనిపించలేదు. గాలవుడు గరుత్మంతునితో తన సమస్యను గురించి చెప్పినాడు. వారిరువురు అలాంటి గుర్రాల కోసము వెదకినారు. ఐనా ఫలితము దక్కలేదు. వారిరువురు యయాతి దగ్గరకు వెళ్లినారు. తమ సమస్యను అతనికి విన్నవించినారు. యయాతి తన కూతురైన మాధవిని వారికి చూపి, ఈమెను ఏ రాజుకైనా ఇచ్చి మీకు కావలసిన గుర్రాలను పుచ్చుకొమ్మ"ని చెప్పినాడు. ఇక్ష్వాకుడు అనే రాజుకు మాధవిని ఇచ్చి, ఆ రాజునుండి రెండు వందల గుర్రాలను, వారు సంపాదించినారు. ఇక్ష్వాకుడు, మాధవిని, మరల గాలవునికి ఇచ్చినాడు. గాలవుడు, ఆమెను దివోదాసునకు ఇచ్చి అతనినుండి రెండు వందల గుర్రాలను సంపాదించినాడు. అట్లే ఔశీనరునినుండి, అతడు మరి రెండు వందల గుర్రాలను సంపాదించినాడు. ఇంక అలాంటి గుర్రాలు ఎక్కడ దొరకలేదు. గరుడుని సలహాను అనుసరించి, గాలవుడు, విశ్వామిత్రునికి ఆరువందల గుర్రాలను మాధవిని, ఇచ్చి తన ఋణాన్ని తీర్చుకొన్నాడు.

కృష్ణ బలరాములు సాందీపనికి సమర్పించిన గురుదక్షిణ విచిత్రమైంది. సాందీపని దగ్గర కృష్ణబలరాములు విద్యను అభ్యసించినారు. సాందీపని పుత్రుడు ఒకనాడు ప్రభాస తీర్థములో స్నానము చేయడానికి వెళ్లి అక్కడనే మరణించినాడు. పుత్రుని బ్రతికించి ఇమ్మని గురువు కృష్ణబలరాములను కోరినాడు. కృష్ణుడు

యమలోకానికివెళ్ళి గురుపుత్రుని బ్రతికించి తెచ్చి గురువుగారికి సమర్పించినాడు. కృష్ణబలరాములు గురువుయొక్క ఋణాన్ని తీర్చుకొనినారు

మూర్త పదార్థమునుండి అమూర్తమైన పదార్థముదాకా ఏ వస్తువైనా శిష్యుడు గురుదక్షిణగా ఇవ్వడానికి పనికి వస్తుంది. శిష్యుల భక్తిని శక్తిని పరీక్షించాలని. ఆనాటి గురువులు కొందరు అపరూపమైన వస్తువులను దక్షిణగా కోరేవారు. తపస్సంపన్నులైన ఆచార్యుల ప్రభావము పనిచేస్తుందని. అందువల్ల వారు కార్య సాధకులు కాగలరని నమ్మడంవల్లనే గురువులు అలాంటి వస్తువులను దక్షిణగా కోరడం జరిగేది. ఉదంకునికి గురు దయవల్ల అణిమాది అష్టసిద్ధులు కలిగినా, తక్షకుడు కుండలాలను అపహరించిన సమయములో, ఆ సిద్ధులు పనిచేయలేదు. దీనిక కారణము అతనికిగల కోపము. కేశదుష్టమైన ఆహారాన్ని తనకు పెట్టించాడని ఉదంకుడు. పౌష్యుని శపించడాన్నిబట్టి అతడు కోపిష్ఠి అని తెలుస్తుంది. ఏకలవ్యుడు. గురువుకోసము కుడిచేతి బొటనవ్రేలిని దక్షిణగా ఇచ్చినాడంటే గురువు కోరినప్పుడు దేన్ని ఇవ్వడానికైనా శిష్యుడు సిద్ధపడాలని చెప్పినట్లైంది. అర్జునుడు ద్రుపదుని పట్టితెచ్చి గురువుకు దక్షిణగ సమర్పించడములో గురుశిష్యుల పరస్పర సహకారము వ్యక్తమౌతుంది. గాలవుడు విశ్వామిత్రునికి సమర్పించిన దక్షిణనుబట్టి గురువు కోరికను తీర్చడానికి శిష్యుడు ఎంత అపూర్వమైన వస్తువునైనా తెచ్చి ఇవ్వాలనే విషయము బోధపడుతుంది. కృష్ణుడు సాందీపనికి సమర్పించిన గురుదక్షిణనుబట్టి ప్రాణాపాయ స్థితిలోనున్న ఆచార్యునికి ప్రాణమువంటి వస్తువును అర్పించి శిష్యుడు తన ధర్మాన్ని నిర్వర్తించాలని విదితమౌతుంది.

గురుదక్షిణలకు సంబంధించిన పై సంఘటనలవల్ల విద్యార్థులకు, సేవా గౌరవము, క్రోధరాహిత్యము, పరస్పర సహకారము, ప్రాపంచిక సుఖాలపై అనాసక్తి మొదలైన గుణాలు అవసరమని, అట్లాంటి గుణాలున్న విద్యార్థులే జీవితములో ఉన్నతమైన స్థానాన్ని పొందగలరని విదితమౌతుంది.

(◡)

# ఉపయుక్త గ్రంథ సూచి (Bibliography)

I ఆంధ్ర గ్రంథములు :


1. ఎఱ్ఱాప్రెగడ హరివంశము : పూర్వభాగము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ హైదరాబాద్, 1968.
2. గోపదేవ్ పండిత కఠోపనిషత్తు : ఆంధ్ర టీకా తాత్పర్య సహితము, ఆర్యసమాజము, కూచిపూడి, 1979.
3. గోపదేవ్‌పండిత ఛాందోగ్యోపనిషత్తు : ఆంధ్రటీకా తాత్పర్య సహితము, ఆర్యసమాజము, కూచిపూడి 1975.
4. గోపదేవ్ పండిత తైత్తిరీయో పనిషత్తు: అంధ్రటీకా తాత్పర్య సహితము, కూచిపూడి 1979.
5. చిన్నయసూరి, పరవస్తు : నీతిచంద్రిక బాలసరస్వతీ బుక్‌డిపో కర్నూలు, 1975.
6. తిక్కన శ్రీ మదాంధ్ర మహాభారతము: విరాటోద్యోగ పర్వములు వి. ఆర్. సన్స్, మద్రాసు, 1965.
7. తిక్కన శ్రీ మదాంధ్ర మహాభారతము: భీష్మద్రోణ పర్వములు, వి. ఆర్. సన్స్, మద్రాసు 1965.
8. తిక్కన శ్రీ మదాంధ్ర మహాభారతము: శాంతిపర్వము వి. ఆర్. సన్స్, మద్రాసు, 1965.
9. తిక్కన శ్రీ మదాంధ్ర మహాభారతము: అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల. మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు వి. ఆర్. సన్స్, మద్రాసు 1965.
10. తిక్కన శ్రీ మదాంధ్ర మహాభారతము: విరాటోద్యోగ పర్వములు రామా అండ్ కో, ఏలూరు, 1954.
11. నన్నయ శ్రీ మదాంధ్ర మహాభారతము: ఆదిసభా పర్వములు, తెలుగు డిపార్టుమెంటు, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు, 1968
12. నన్నయ శ్రీ మదాంధ్ర మహాభారతము: అరణ్యపర్వము, రవీంద్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు, 1967.

